# భాషాంతరంగం

(భాషా నిర్మాణవ్యాసాలు)

ఆచార్య చేకూరి రామారావు

2000



పొట్టి శ్రీరాములు

తెలుగు విశ్వవిద్యాలయం

**భాషాంత రంగం** - చేకూరి రామారావు
(భాషానిర్మాణ వ్యాసాలు) - **Chekuri Rama Rao**



ప్రచురణల సంఖ్య - 225

ముద్రణ: డిసెంబర్, 2000

ప్రతులు - 1000

వెల రూ. 40/-

**ప్రతులకు :**
డైరెక్టర్, పబ్లికేషన్ డివిజన్,
పొట్టి శ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం,
లలిత కళాక్షేత్రం, పబ్లిక్ గార్డెన్స్ హైదరాబాదు - 500 004.

ముద్రణ : నవ్య ప్రింటర్స్, సోమాజిగూడ, హైదరాబాద్ ఫోన్ : 3314147

ISBN No. 81- 86973 - 67-1

# ముందుమాట

తెలుగు భాషాసాహిత్యాలు, సంస్కృతి, చరిత్ర, లలితకళలు, జానపద గిరిజన విజ్ఞానం వంటి బహుముఖీన అంశాల వికాసం కోసం ఏర్పడిన సమున్నత విద్యాసంస్థ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం. ఆ లక్ష్యాన్ని సాధించటానికి ప్రధానంగా బోధన, పరిశోధన, గ్రంథ ప్రచురణ, విస్తరణసేవ వంటి చతుర్ముఖీన మార్గాలను అనుసరిస్తున్నది. విస్తరణసేవ, అంతర్జాతీయ సంస్థ తరపున ప్రవాసాంధ్రులకు సాంస్కృతిక సేవ వంటి ఉదాత్త కార్యక్రమాలతో పురోగమిస్తున్నది. గ్రంథ ప్రచురణ క్రింద విశ్వవిద్యాలయం కావ్యాలు, విజ్ఞాన సర్వస్వ సంపుటాలు, నిఘంటువులు, మాండలిక వృత్తి పదకోశాలు, భాషా సాహిత్యం, సంగీతం, నాట్యం, నాటకం, లలిత కళలు, జానపద గిరిజన విజ్ఞానం, చరిత్ర, సంస్కృతులకు సంబంధించిన ప్రచురణలు, అనువాదాలు వెలువరిస్తున్నది. పొట్టి శ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయ ప్రచురణలు అశేష పాఠకాదరణ పొందుతున్నాయి.

ఈ ప్రచురణ కార్యక్రమానికి అనుగుణంగా విశ్వవిద్యాలయం ఇప్పటికే ఎన్నో ప్రముఖ గ్రంథాలను ప్రచురించింది. వ్యాఖ్యా స్రవంతి శీర్షిక సుప్రసిద్ధ పండితులచే ప్రాచీన కావ్య ప్రబంధాలకు వ్యాఖ్యానాలు వ్రాయించి ప్రచురించే ప్రణాళికను చేపట్టింది. ఇప్పటివరకు ఈ ప్రణాళికలో కుమారసంభవం, కాశీఖండం, శివరాత్రి మహాత్మ్యం వంటి గ్రంథాలను వ్యాఖ్యాసహితంగా ముద్రించింది.

తెలుగులో ప్రసిద్ధి పొందిన ప్రాచీన, ఆధునిక గ్రంథాలను ఇంగ్లీషు, హిందీ భాషలలోనికి అనువాదం చేయించి ప్రచురించింది. తెలుగు కథ అనే పేరుతో ప్రతి సంవత్సరం వెలువడిన ఉత్తమ కథలను ఎంపికచేసి ముద్రించే కార్యక్రమాన్ని చేపట్టింది. తెలుగు కథ - 1995 రెండు భాషల్లో సంపుటాలు వెలువరించడం జరిగింది. అలాగే 1996, 1997, 1998, 1999 కథా సంపుటాలు అందుబాటులో ఉన్నాయి.

తెలుగు విజ్ఞాన సర్వస్వ సంపుటాలను తయారుచేయించే కార్యక్రమంలో విశ్వసాహితిని 'హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్‌ది ఆంధ్రాస్' అనే పేరుతో ఆంగ్లంలో ఒక సంపుటాన్ని ప్రచురించింది. భాషాభివృద్ధి కృషిలో భాగంగా తెలుగుభాషా చరిత్ర, ద్రావిడ భాషలు అనే గ్రంథాలను పునర్ముద్రించింది. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంఘిక సంక్షేమ శాఖ వారి సహకారంతో డా॥ బి.ఆర్. అంబేద్కర్ రచనలు ప్రసంగాలను పది సంపుటాలుగా ప్రచురించింది. తెలుగు వారికి మంచి పరిశోధన పత్రికలేని కొరతను 'వాఙ్మయి' తీరుస్తున్నది.

అలాగే విశ్వవిద్యాలయం ఇటీవల ప్రారంభించిన 'వంద గ్రంథాలు సౌజన్య ప్రచురణలు' అనే పథకానికి మంచి స్పందన లభిస్తున్నది.

ప్రస్తుత గ్రంథం "భాషాంతరంగం" అగ్రశ్రేణి భాషాశాస్త్రవేత్త సుప్రసిద్ధ సాహిత్య విమర్శకుడు ఆచార్య చేకూరి రామారావు గారు రచించారు. ఇందులోగల తొమ్మిది వ్యాసాలు భాషానిర్మాణానికి సంబంధించినవి. వీరి రచనలో కేవలం సాంకేతిక భాషా శాస్త్ర దృక్పథమే కాకుండా సాహిత్య దృష్టి కూడా అంతస్సూత్రంగా ఉంటుంది. చేరాగా సుప్రసిద్ధులైన రామారావుగారు కూలంకషమైన నిర్మాణ విమర్శకు పేరెన్నికగన్నారు. ఈ వ్యాసాలు లోగడ అచ్చయినప్పుడే విశేషంగా పాఠకలోకం దృష్టిని ఆకర్షించాయి. వివిధ పత్రికల్లో, ప్రత్యేక సంచికల్లో, వచ్చిన అలాంటి వ్యాసాలను ఒకచోటచేర్చి పరిశోధకులకీ, పాఠకులకీ విశ్వవిద్యాలయాల అధ్యయన శాఖలకీ అందుబాటులోకి తెచ్చిన చేరా గారికి అభినందనలు తెలుపుతున్నాను. ఈ సంకలనం పాఠకుల ఆదరాభిమానాలను చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

తేది 20.10.2000
హైదరాబాదు.

(ఎన్. గోపి)

# అంతరంగ ప్రవేశిక

ఆధునిక భాషా శాస్త్ర సహాయంతో తెలుగు భాష ద్వారా భాషాతత్త్వాన్ని గ్రహించటానికి నేను చేస్తున్న ప్రయాణంలో తొలి మజిలీలు *తెలుగు లో వెలుగులుగా*, ఆ తర్వాత మజిలీ తెలుగు వాక్యంగా అచ్చుయ్యాయి. ఇప్పుడు మరికొన్ని *భాషాంతరంగం* అనే పేరుతో సంకలితం చేస్తున్నాను. నా భాషా వ్యాసాల్లో నిర్మాణదృష్టి, పరిశోధన పాలు, సిద్ధాంత స్పర్శ ఎక్కువగా ఉన్న తొమ్మిది వ్యాసాలను ఈ సంకలనంలో చేర్చాను.

ఇందులో *నేటి తెలుగు : వర్ణం నుంచి వాక్యం వరకు* అనే వ్యాసంలో చెప్పిన కొన్ని విషయాలు తెలుగు వాక్యం అనే పుస్తకంలో ఉన్నమాట నిజమే. అయినా సూక్ష్మంగా పరిశీలిస్తే కొన్ని భేదాలు కనిపిస్తాయి. మౌలికంగా విషయం అదే అయినా చూసే చూపు (Perspective) లో భేదం ఉంది. *తెలుగు వాక్యం* అచ్చయిన మరో పదేళ్ల తరువాత రాసిన వ్యాసం కావడం వల్ల కొన్ని పరిణతాంశాలు, ఇందులో కనిపిస్తాయి. *తెలుగు వాక్యం* లోని విషయాలు ఈ వ్యాసంలో కేవలం పునరుక్తాలు కావు. పునరవలోకితాలు. ఇందులో 'మట్లాడే భాష రాసే భాష ఒకటేనా ? అవును/కాదు' అనే వ్యాసం రచయిత్రి రంగనాయకమ్మ గారితో జరిపిన వివాద ఫలితం. వాదాంశాలన్నీ ఈ వ్యాసంలో చేర్చలేదు. ఫలితాంశాన్నే ఇక్కడ ప్రదర్శించాను. ఈ వ్యాసం చివర ఉపయుక్త వ్యాస, గ్రంథ సూచికను చేర్చి ఉండవలసింది, వీలు కుదరలేదు.

*క్రియాస్తి నాస్తి విచికిత్స* పరివర్తన సిద్ధాంత పరిధిలోని వ్యాసం. గుప్త వ్యక్త నిర్మాణ భేదాల స్వరూపం తెలిస్తే తప్ప ఈ వ్యాసంలో చేసిన వాద పద్ధతి పూర్తిగా బోధపడదు. అయితే ఈ విషయాలు నా ఇతర వ్యాసాల్లో కొన్నిచోట్ల చర్చించాను. *భాష : వ్యాకరణం: నిఘంటువు*, *అనువాద పద్ధతులు:ఆచరణ సమస్యలు* అనేవి సిద్ధాంత స్ఫూర్తి ఉన్న వ్యాసాలైనా భాషా శాస్త్ర పరిచయంలేని శ్రోతలను, భిన్న శాస్త్ర విషయాసక్తులను ఉద్దేశించి చేసిన ప్రసంగాలు కావడం వల్ల వీటిశైలి శాస్త్రేతరంగా ఉంది. సంభాషణ రీతికి సన్నిహితంగా జరిగి శైలి సరళమైంది. ఈ రెండు ప్రసంగ వ్యాసాలు తెలుగు విశ్వవిద్యాలయ విద్యాగోష్ఠుల్లో చేసిన ప్రసంగాలు.

*భాషాశాస్త్రం:సాంకేతిక పద నిర్మాణం* అనే వ్యాసం కూడా తె.వి.వి. వారి భాషా పీఠం జరిపిన ఒక గోష్ఠిలో చదివిన పత్రమే.

భాషా సాహిత్యాల తాత్త్విక భూమిక అనే వ్యాసం ఏటుకూరి బలరామమూర్తిగారి వర్ధంతికి చేసిన స్మారకోపన్యాసం. బలరామమూర్తి గారు తత్త్వశాస్త్రవేత్త కావటం వలన ఈ వ్యాసంలో తత్త్వ శాస్త్ర మౌలికాంశాలను కొన్ని జోడించడానికి ప్రయత్నించాను. అయితే భాష పుట్టుకను గురించి ఎక్కువ అంశాలు ప్రస్తావించగలిగానే కాని వివరించలేకపోయాను. ఇందుకు నా అలసత్వమే కారణంగా అంగీకరిస్తున్నాను.

నేను భాషాశాస్త్ర పరిశోధకుడు కావటానికి ప్రధాన కారకులు ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారు. ఆయన జగమెరిగిన భాషాశాస్త్రవేత్త. సెన్సస్ ఆఫ్ ఇండియావారు నాచేత రాయించిన A Grammatiacal Sketch of Modern Telugu అనే చిరుపొత్తం 1969లో ఆయనకు అంకితమిచ్చాను. అది ఇంకా సెన్సస్ వారి దగ్గరే కలకత్తాలో దీర్ఘనిద్రపోతున్నది. ఇప్పుడీ వ్యాస సంకలనం ఆయనకు అంకితంగా కూర్చగలిగినందుకు సంతోషిస్తున్నాను. ఇంతమాత్రాన ఆయన ఋణం తీరేదికాదు. చంద్రునికో నూలుపోగు.

ఈ వ్యాస సంకలనాన్ని ప్రకటిస్తున్నందుకు విశ్వవిద్యాలయం వారికి మరీ ముఖ్యంగా విద్వత్పరిశ్రమను గుర్తించగల విద్వదుపాధ్యక్షులు ఆచార్య గోపీ గారికి, స్వయంగా భాషాశోధకులైన రిజిస్ట్రారు ఆచార్య ఎన్. శివరామమూర్తి గారికి కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి అపూర్వమైన ఇంతమంచి పేరు సూచించిన కవి, పండితుడు అయిన సీతారాంకి ఆశీస్సులు. ఆరోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టక, ఎన్ని దిద్దుబాట్లున్నా విసుక్కోక శ్రద్ధగా అక్షరాలు కూర్చిన చి॥ రమాదేవి అభివృద్ధిని, ఆరోగ్యాన్ని కాంక్షిస్తున్నాను.

**చేరా**

2000 మే, 25

భాషాంతరంగ వేది

భాషాశాస్త్ర మహా మహోపాధ్యాయులు

ఆచార్య **భద్రిరాజు కృష్ణమూర్తి** గారికి

## ఇందులో....

# భాష, వ్యాకరణం, నిఘంటువు

## సిద్ధాంతం - ఆచరణ

భాషాశాస్త్ర పాఠ్యగ్రంథాల్లో భాషా నిర్వచనాలను చదువుకున్న చాలామంది వాటిలో వైవిధ్యాన్ని గమనించే ఉంటారు. అవేవీ సమగ్రాలు కావని కూడా గుర్తించే ఉంటారు. అయితే అవి తప్పులు కూడా కావు. ప్రతి నిర్వచనమూ భాషను గురించి ఏదో ఒక అంశాన్ని పురస్కరిస్తుంది. నిజానికి ఏ శాస్త్రంలోనూ ఏ నిర్వచనమూ సమగ్రం కాదు. ఎప్పటికీ అందుకోలేని లక్ష్యం సమగ్ర నిర్వచనం. అయితే ఎప్పటికీ యత్నించటం మానని లక్ష్యం కూడా ఇది. ఈ పరిమితిని విస్మరించకుండా ప్రస్తుత సందర్భానికి పనికొచ్చే నిర్వచనం (Working definition) ఒకటి సూచిస్తున్నాను. అరిస్టాటిల్ చెప్పినట్టు 'నిర్వచనాలను బద్దలు కొట్టటం తేలిక, కొత్త నిర్వచనం చెయ్యటం కష్టం', అయినా నిర్వచనాలు చెయ్యటం మానం.

ప్రస్తుత నిర్వచనం : *మాటల అర్థవంతమైన కూర్పు భాష. ఇది బ్రహ్మాండాన్ని* బద్దలు కొట్టే నిర్వచనమేమీ కాదు కాని ప్రస్తుతం మన అవసరానికి పనికొస్తుంది. భాషావ్యవహారంలో మాటలుంటాయి. మాటలు ధ్వని రూపంలో వినపడతాయి. రాత ఉన్న సమాజాల్లో అక్షరాల రూపంలో కనపడతాయి. (కనపడని, వినపడని వారికి వారి కోసం తయారు చేసిన బ్రెయిలీ లిపిని స్పర్శ ద్వారా గ్రహిస్తారు). మాటలు అర్థబోధ కలిగిస్తాయి. ఈ మాటలను కొన్ని వర్గాలుగా విభజిస్తారు. ఈ వర్గాలను కొన్ని నిర్ణీత పద్ధతుల్లో కూరిస్తే అర్థవంతమైన వాక్యాలు వస్తాయి.

నిర్ణీత పద్ధతుల్లో చేసే పదాల కూర్పునే వ్యాకరణం అంటారు. మాటల నిధిని నిఘంటువు అంటారు. ఇంకో రకంగా చెపితే భాష అంటే నిఘంటు వ్యాకరణాల సంప్రయోగం. వ్యాకరణ నిర్మాణ సూత్రాలు అమూర్తం. భాషా వ్యవహర్త భాషాగ్రహణ క్రమంలో ఈ సూత్రాలను ఏర్పరచుకుంటాడు. ఈ వ్యాకరణ సూత్రాలను నిర్మించుకోవటం ద్వారానే వ్యవహర్త భాషా వ్యవహారం చెయ్యగలుగుతున్నాడని ఇటీవలి భాషాపరిశోధకులు నమ్ముతున్నారు. వ్యవహర్త భాషాప్రయోగ దక్షతకు అతను నిర్మించు కున్న వ్యాకరణమే మూలభూతం. ఈ వ్యాకరణ స్వరూపాన్ని ప్రత్యక్షంగా దర్శించ లేము. పరోక్షంగా గ్రహించవలసిందే. అందుకే, దీన్ని మనోవ్యాకరణం అందాం. ఈ

మనోవ్యాకరణం ఏ రూపంలో ఉందో, సూత్రాలు ఎట్లా ఉంటాయో, దాన్ని వ్యవహర్త భాషాప్రయోగంలో ఏ విధంగా ఉపయోగించుకుంటాడో ప్రత్యక్షంగా పరిశీలించే మార్గాలు లేవు. కాని ఇట్లాంటి వ్యాకరణం ఒకటి మనుష్య మనః కుహరంలో లేకపోతే భాషా వ్యవహారమే సాగదు. సూక్ష్మాంశాల్లో విభేదాలు చాలా ఉన్నా, ఈ ప్రతిపాదనను భాషా పరిశోధకులంతా నమ్ముతున్నారు.

ఈ మనోవ్యాకరణం ప్రత్యక్ష పరిశీలన దృష్టం కాకపోయినా దీని మనుగడకు పరోక్ష సాక్ష్యాలు చాలా ఉన్నాయి. పరివర్తన సిద్ధాంతకర్తలు, బాల్యభాషాగ్రహణ క్రమ పరిశోధకులు ఈ సాక్ష్యాలను తమ రచనలలో బహుళంగా ప్రదర్శించారు. భాషా పరిశోధకులు తమ పరిశోధనకు ఈ మనోవ్యాకరణంతో సరితూగ గలిగిన వ్యాకరణ గ్రంథాన్ని రచించటమే తమ లక్ష్యంగా గ్రహించారు. ఈ గ్రంథానికీ, వ్యవహర్త నిర్మించు కున్న మనో వ్యాకరణానికి బింబ-ప్రతిబింబ భావం లేదు. భాషాపరిశోధకుడిభౌతిక వ్యాకరణానికి ఇట్లాంటివేమీ ఉండవు. భౌతిక వ్యాకరణం మనో వ్యాకరణానికి స్వతంత్ర రూపకల్పన (model building) మాత్రమే. ఒక ఊహా ప్రతిపాదన (hypothesis) మాత్రమే. వ్యవహర్తకు భాష తెలుసు అంటే అతనికి అవ్యక్తంగా వ్యాకరణం తెలుసన్న మాట.

భాషలో మాటలు లేకపోతే వాటిని కూర్చటం ఉండదు. అంటే వ్యాకరణం ఉండదు. మాటలకు ధ్వని స్వరూపం ఉంటుంది. అర్థబోధ ఉంటుంది. వాక్య నిర్మాణంలో ప్రమేయం ఉన్న వ్యాకరణ లక్షణాలుంటాయి. ఇవన్నీ కలిస్తేనే మాటలు అవుతాయి.

ఈ మాటల్ని సంస్కృతంలో పదాలంటారు. ప్రత్యయ విశిష్టమై ప్రయోగార్హమైన శబ్దాలకే పదం వ్యవహారంలో ఉంది. మాటలు అనే మాటకు ఇంతకన్నా విస్తృతార్థాలున్నాయి (చూ.సి.పి. బ్రౌను, గెలెటీ నిఘంటువులు). నిజానికి ఈ వ్యాసంలో అంత విస్తృతార్థంలోనూ వాడటం లేదు. పదం, అపదం, ప్రత్యయం, మొ. వాటికి కొన్నిటికి 'మాట' వాడుతున్నాను. దీన్ని దాదాపు నోమ్‌ఛోమ్‌స్కీగారు వాడిన formative అనే అర్థంలో వాడుతున్నాను.

వ్యాకరణం ఎందుకు రచించాలి అనే ప్రశ్నకు చాలా సమాధానాలున్నాయి. అందులో ఒకటి : వ్యవహర్తకు వ్యాకరణ పరిజ్ఞానం (అవ్యక్తంగానే అనుకోండి) ఉంది గనక, నిఘంటు రచన ఎందుకు చెయ్యాలి అనే దానికి కూడా అదే సమాధానం వర్తిస్తుంది. అంతేకాదు, పిల్లల భాషా సంపాదనలో మొదట నేర్చుకునేవి మాటలే. మాటల వైఖరీ భేదాలే వాక్యాల్లో నామక్రియాది భేదాలుగా ప్రవర్తిస్తాయి. కర్త, కర్మ వంటి వాక్య

ప్రయోగంలో వచ్చే సంబంధాలకు మాటలు కావాలి. మాటలుంటేనే ధ్వనులుంటాయి. వర్ణాలుంటాయి, పదాలుంటాయి, వాక్యాలుంటాయి. అందువల్ల మాటలు లేనిదే భాష లేదు. అందుకే తెలుగులో మాట అంటే మాటే కాదు భాషావ్యవహారమంతా. utterance, sentence, information, discourse అనే అర్థాలు కూడా తెలుగులో మాటకు ఉన్నాయి.

మాటకున్న మరీ విస్తృతార్థాల జోలికి ప్రస్తుతం పోకుండా, మరీ సంకుచితార్థానికి పరిమితం కాకుండా సొంత అర్థబోధ ఉన్న శబ్దాలూ, శబ్దసంయోజనాలూ మాటలనుకుందాం. పదాలూ, అపదాలూ, జాతీయాలూ మాటలే అవుతాయి. పిల్లి, ఎలుక, మనసు, ప్రేమ, అను, అనుకొను, విను, వినపడు, ఎగబడు, లే, కదా !, కాలుజారు, నోరుజారు, మస్కాకొట్టు, వాగుడుకాయ, వాగుబోతు, తిరుగుబోతు - ఇట్లా చాలారకాల మాటలున్నాయి. ఈ మాటలకు ధ్వనిస్వరూపం ఉంది. వ్యాకరణ లక్షణాలున్నాయి. సొంత అర్థబోధ ఉంది. ఇవన్నీ వ్యవహర్తకు తెలుసు. కాబట్టి ఇవి వ్యవహర్త మనఃపద నిధి (lexicon) లో భాగం.

అంతేకాదు, పదానికి సందర్భనియత రూపభేదాలుంటాయి. స్వతంత్ర రూపాంతరాలుంటాయి. సమానార్థక శబ్దాల మధ్య అర్థచ్ఛాయా భేదాలూ, ప్రయోగ భేదాలుంటాయి. పదాలకు ప్రత్యేకమైన విలువలుంటాయి. కొన్నింటికి గౌరవభాజనలో తేడా లుంటాయి. మరికొన్నిటి మధ్య సౌందర్య స్పర్శలో తేడాలుంటాయి. ఈ సమాచారమంతా వ్యవహర్తకు తెలుసు. వ్యవహర్త కేవలం అభిప్రాయ ప్రకటనకే భాషను వాడడు. సౌందర్య దృష్టితో వాడతాడు, సందర్భ శుద్ధితో వాడతాడు. గౌరవ న్యూనతా వ్యక్తీకరణలో తేడా లుంటాయి. తన భావావేశాన్ని నింపవచ్చు. మాటలు విషాద భరితం కావచ్చు. హాస్య స్ఫోరకం కావచ్చు.

ఈ భేదాలన్నీ వ్యవహర్తకు తెలుసు. అంటే అతని మనఃపదనిధిలో భాగం అన్న మాట. పత్రికల్లో పార్టీ నాయకుడు అనే అర్థంలో అధినేత అని వాడుతున్నారు. రెంటికీ ఒకే అర్థం అయినా స్ఫూర్తి ఒకటి కాదు. అధినేత అనే మాటలో ఇతరుల మాటలను లక్ష్యపెట్టని అప్రజాస్వామికనాయకుడు అనే అర్థం ఇమిడి ఉంది. అడిగాడు. ముష్టి ఎత్తాడు అనే వాటికి అర్థం ఒకటైనా రెండో దాంట్లో న్యూనతాభావం ఉంది. వచ్చారు - విచ్చేశారు అనే మాటలకు అర్థం ఒకటైనా రెండోదానికి గౌరవ వ్యక్తీకరణ ఉంది. మల్లీశ్వరి పాటలో అందెల రవళుల సందడి మరి మరి - అన్నచోట అందెల మ్రోతల సందడి మరి మరి అంటే రెంటినీ పోల్చిన శ్రోతలు - వాళ్లకి సౌందర్య దృష్టి ఉంటే - రెండోదాన్ని నిరాదరిస్తారు. ఆమె అందగత్తె అన్నా ఆమె రంభ అన్నా అర్థం ఒకటే. రెండోదాంట్లో

వక్త భావావేశం కనిపిస్తుంది. ఒక సంఘటనను వర్ణించేటప్పుడు అది విచారకరం అన్న దానికీ అది దారుణం అన్న దానికీ వ్యక్తి వ్యక్తీకరించే భావావేశంలో భేదం ఉంది. మాటలకు - అర్థాలు సర్వస్వతంత్రమేం కాదు. మిగతా మాటల అర్థాలతో సామ్య సంబంధాలూ, భేదక సంబంధాలూ ఉంటాయి. ఇవన్నీ ఎరిగి మాట్లాడే వ్యవహర్తలున్నారు. అంటే ఈ సమాచారమంతా వ్యవహర్త మనఃపదనిధిలో భాగమేనన్న మాట.

ఒక ధాతువు నుంచి భిన్నపదాలు నిష్పన్నమవుతాయి. ఈ పద్ధతి సంస్కృతంలో ఎక్కువ. *కృ* ధాతువు నుంచి *కరణము, కారకము, క్రియ, కర్త, కర్మ, కృత* అనే రూపాలు నిష్పన్నమవుతాయి. ఈ మాటల మధ్య రూపసామ్య, అర్థసామ్య సంబంధాలు వ్యవహర్తకు తెలిసి ఉండాలి. ఒక మాటకు భిన్నార్థాలు, భిన్నపదాలకు సమానార్థాలూ ప్రతి భాషలోనూ కనిపిస్తాయి. ఇవీ వ్యవహర్త జ్ఞానంలో భాగాలే. అంతేకాక పదాల మధ్య అనుప్రాస (Rhyming) సంబంధాలు కూడా వ్యవహర్తకు తెలుసుననటానికి కొన్ని నిదర్శనా లున్నాయి. ముఖ్యంగా సామెతల్లో అనుప్రాసలు, అక్షర సమతౌల్యం ఉన్న పదప్రయోగం కనిపిస్తుంది.

1. సన్నగుడ్డ చినిగినా అందం
   చక్కనమ్మ చిక్కినా అందం

2. ఆస్తిమూరెడు, ఆశబారెడు

అనే సామెతల్లో అక్షర పరిమాణ సామ్యం మాత్రా సమత్వం అంత్యవర్ణ సామ్యం గమనించదగింది. చాలా సామెతల్లో ఈ రకమైన ధ్వని సామ్యం, అక్షర సమత్వం కనిపిస్తుంది.

ఒక వస్తువు గురించి చెప్పటానికి మరొక వస్తువును సాదృశ్యంగా గ్రహించే పద్ధతి ఒకటి ఉంది. దీన్ని సదృశీకరణం (metaphorization) అని వ్యవహరిస్తున్నాను. ఇది కవిత్వ భాషలో ప్రచురంగా ఉన్నా సాధారణ భాషలో కూడా తరచు కనిపిస్తుంది.

ఒక అమ్మాయి అందంగా ఉన్నదని చెప్పటానికి ఆమె రంభ అనో బంగారు బొమ్మ అనో అంటారు. జడుడ్ని వర్ణించాలంటే వాడు గాడిద అనీ, తిండిపోతును పంది అనీ, మందకొడిని పండుబోతుగిత్త అనీ, స్పందనలేనివాణ్ణి దున్నపోతు అనీ, ధైర్య వంతుణ్ణి సింహమో, పులో అనీ, ధైర్యంలేనివాణ్ణి పిల్లి అనీ, సిగ్గులేనివాణ్ణి కుక్క అనీ, జిత్తులమారి నక్క అనీ, చపలచిత్తుణ్ణి కోతి అనీ, కుటిలుణ్ణి పాము అనీ, లేక తేలు అనీ, రొదచేసేవాణ్ణి దోమ అనీ, హీనుడనుకున్నవాణ్ణి పురుగు' అనీ బెదురుతున్నవాణ్ణి జెర్రి అనీ, మితభాషిని

ముంగి అనీ, పొట్టివాణ్ణి తట్టుగుర్రమనీ, పొడుగువాణ్ణి కొంగ అనీ, నల్లనివాణ్ణి కాకి అనీ - ఇట్లా మనకు పరిచితమైన పశుపక్షి క్రిమికీటకాలతో పోల్చి చెపుతాము. అట్లాగే కడిగెయ్యటం, దులిపెయ్యటం వంటి క్రియల్లో శుభ్రపరచు అనే ప్రధానార్థాన్ని బాధించి కొత్త అర్థాన్ని కల్పించాం. నామాఖ్యాతాలు రెంటిలోనూ ఈ రకమైన సదృశీకరణం చాలా తరచుగా కనిపిస్తుంది. పదాలకు కొత్త అర్థాలు ఏర్పడే పద్ధతుల్లో సదృశీకరణం ఒకటే. మనిషికున్న పద నిర్మాణ శక్తులలో ఇదొకటి. ఇది చిన్న పిల్లలలో చాలా ఎక్కువగా కనిపిస్తుందనీ, పేరున్న పెద్ద స్కూళ్ళల్లో చదివే పిల్లలకు ఈ శక్తి క్రమేపీ సన్నగిల్లుతుందనీ, కొందరి పరిశోధనలో తేలింది. నేనెరిగిన ఒక నాలుగేళ్ల పిల్లవాడు సీతాఫలం అనే మాట తెలీక అది కావాలని అడగటానికి తాబేలు డిప్పతో పోల్చి అట్లాంటికాయ కావాలన్నాడు. భావన నిర్మాణం (concept formation) లో సదృశీకరణ పాత్ర చాలా ఉందని పిల్లల భాషను పరిశీలించినా, పెద్దల భాషను పరిశీలించినా చెప్పగలం. వ్యవసాయ వృత్తిపదకోశంలో ఇట్లాంటి సదృశీకరణలు ఎన్నో. ఉదాహరణకు వడ్ల పేర్లు చూడండి. *కనకమామిళ్లు, కాకిరెక్కలు, కృష్ణకాటుకలు, చిట్టిముత్యాలు, జానకిరాములు, దొరసానిపిక్కలు, బంగారు ముక్కలు, బంగారు తీగెలు* - ఇవి కొన్ని మాత్రమే.

వీటన్నిటివల్ల మనిషి పదనిర్మాణ శక్తిని అర్థం చేసుకోవాలంటే సదృశీకరణను అర్థం చేసుకోవాల్సి ఉంటుందని తెలుస్తుంది.

ఏ భాషలో అయినా కొత్త అవసరాలకు కొత్త పదాలు ఏర్పర్చుకోవాల్సి ఉంటుంది. దానికి ప్రపంచ వ్యాప్తంగా కొన్ని మార్గాలున్నాయి. కొన్ని భాషలకు కొన్ని విషయాల్లో అదనపు సౌకర్యాలూ ఉన్నాయి. నామాలను క్రియలుగానూ, క్రియలను నామాలుగానూ చేసే ప్రక్రియ అన్ని భాషల్లో ఉన్నది. తెలుగులో క్రియల నుంచి నామాలను ప్రత్యయాల ద్వారా తయారుచేసుకుంటాం. వీటిలో కొన్ని చారిత్రికంగా ఏర్పడ్డాయి. కొన్ని ఇప్పటికీ వాడుకుంటున్నాం. ఎక్కువ భాగం అల్పోత్పాదకాలు.

విశేషణాల నుంచి నామాల తయారీ అధికోత్పాదక ప్రక్రియగా కనిపిస్తుంది. తనం అనే ప్రత్యయంతో ఏ విశేషణాన్నైనా నామంగా మార్చవచ్చు. ఏ నామం నుంచైనా మరో నామం సృజించవచ్చు. ఉదా: *మంచితనం, చెడ్డతనం, పిసినారితనం, తెలుగుదనం, పనివాడితనం, సిగ్గులేనితనం, మంచిదక్కించుకోలేనితనం*- అన్ని ప్రత్యయాలకూ ఇంత ఉత్పాదకశక్తి ఉండదు. ఇక నామాల నుంచి క్రియలు రకరకాల పద్ధతిలో ఏర్పడతాయి గాని వాటి ఉత్పాదక శక్తి (productivity) పరిమితం. ఇంగ్లీషులో ఏ నామాన్నయినా

నిరభ్యంతరంగా క్రియగా వాడవచ్చు. చిన్నపిల్లల భాషలో ఇట్లాంటి క్రియలు చాలా తరచుగా కనిపిస్తాయి.

కొత్తపదాలు ఏర్పరచుకొనే మరో పద్ధతి పదంలో ఒక భాగాన్ని విరిచి దానికో అర్థాన్నిచ్చి కొత్తపదాలు ఏర్పరచటం. Hamburg వాడే ఒక Sandwich ని Hamburger అంటారు. దాన్ని తప్పుగా విరిచి fishburger అని అమెరికన్లు తయారు చేసుకున్నారు. Sputnik అనే రష్యను మాటను విరిచి dognik, flopnik, goofnik, oopsnik వంటి మాటలు అమెరికన్లు తయారుచేసుకున్నారు. ఈ పద్ధతి తెలుగువంటి భాషకున్నట్టు లేదు.

తెలుగులో అత్యంతం ఉపయోగించే పద్ధతి సమాస కల్పన (compounding). పిల్లల భాషలో ఈ పద్ధతి పదకల్పన అధికంగా ఉంటుంది. డబుల్ డెక్కర్‌కు *మేడబస్సు* అనీ, కోడిగుడ్డుకు *కోడికాయ* అని పిల్లలు అనటం విన్నాను. ఈ మాటలు తెలుగులో స్థిరపడేవి కావు. అన్ని భాషలలోనూ ఈ పద్ధతి ఉంది. సమాసంలో ఇన్ని పదాలే ఉండాలనే నియమం లేదు. అయితే పదాల సంఖ్య పెరిగిన కొద్దీ ఉత్పాదక శక్తి తగ్గ తుంది. నేతి అనంతరామశాస్త్రి చేసిన శ్రీనాథభాషా పరిశీలనలో శ్రీనాథుడి రచనలన్నిటిలో నుండి లెక్కపెడితే మొత్తం సమాసాలు 2,842 అయితే అందులో రెండంశాల సమాసాలు 2,136, మూడంశాల సమాసాలు 549, నాలుగంశాల సమాసాలు 126, ఐదంశాల సమాసాలు 28, ఆరంశాల సమాసాలు 3. (ఈ సంఖ్య తెలుగు మాటలకు మాత్రమే) అందువల్ల దాదాపు ఏ రెండు మాటలనైనా కలిపి సమాసం చెయ్యవచ్చునన్నమాట. ఏ నిఘంటువులో సమాసాల లెక్క తీసినా దాదాపు ఈ నిష్పత్తిలోనే ఉంటాయనుకుంటా. అర్థసంబంధాలు కూడా విభిన్నంగా ఉంటాయి. తెలుగు విశ్వవిద్యాలయంవారి పత్రికాభాషా నిఘంటువులో కొన్ని సమాసాలు చూడండి. *అధికార తీర్మానం అంటే అధికార పార్టీ ప్రవేశపెట్టే తీర్మానం, అధికార దాహం అంటే అధికారం కోసం పడే తపన, అధికార దుర్వినియోగం* అంటే *అధికారాన్ని అపసవ్యంగా ప్రయోగించటం, అధికార నివాసం* అంటే పదవిలో ఉన్నవారి నివాస గృహాలు, అధికార పక్షం అంటే పాలించే పార్టీ, *అధికార పత్రం అంటే ప్రభుత్వం తయారుచేసే నివేదిక, అధికార పర్యటన* అంటే ప్రభుత్వాధి కారులు ప్రభుత్వ విధులపై చేసే ప్రయాణం, *అధికార పీఠం* అంటే *ప్రభుత్వ పదవి, అధికార భాష* అంటే ప్రభుత్వ వ్యవహారాలకు వాడే భాష. *అధికార వార్త* అంటే *ప్రభుత్వం ప్రకటించే వార్త. అధికార సమావేశం* అంటే *ప్రభుత్వోద్యోగులు విధి నిర్వహణలో జరిపే సమావేశం* - ఇట్లా *అధికార* అనే మాటతో ఏర్పడ్డ సమాసాలు పరిశీలిస్తే వివిధ సంబంధాలు గోచరిస్తాయి.

మానవుల మనఃపదనిధి కోశంలో పదాలతో పదాలు తయారుచేసే పద నిర్మాణ సాధనాలు (మాటల కొరముట్లు) కూడా ఉంటాయని పై పరిశీలన తెలియజేస్తున్నది.

ఈ మనఃపదకోశంలో పదాలు మనం అలవాటు పడ్డ కోశాల్లోలాగా అకారాది క్రమంలో ఉంటాయా ? ఈ కోశంలో పదాల క్రమం ఎట్లా ఉంటుందో గ్రహించే మార్గాలు లేవు. అకారాది క్రమం మనం సమాజ సంస్కృతిలో నేర్చుకున్న ఒక పద్ధతి. ఈ పద్ధతి మనం స్కూళ్లలో సంప్రదాయం నుంచి నేర్చుకున్న పద్ధతి. మనఃపదకోశం ఇట్లాగే ఉంటుందని చెప్పే ఆధారాలు లేవు.

మనం మాట్లాడే భాషను పరిశీలిస్తే కొన్ని మాటలను విరివిగా వాడతామనీ, మరికొన్ని మాటలను అరుదుగా వాడతామని మనకే తెలుస్తుంది. మన మనఃకోశంలో విరివిగా మాట్లాడే మాటలు బాగా అందుబాటులో ఉండేటట్టు, అరుదుగా వాడే మాటలు అడుగున ఉండేటట్టు ఏర్పాటయిందా ? కొన్ని రకాల పరీక్షలు ఆ విధమైన ఏర్పాటు ఉన్నట్టు సూచిస్తున్నాయి.

అట్లాగే పదాది సామ్యాలను, పదాంత సామ్యాలను వ్యవహర్తలు త్వరగా గుర్తిస్తారు. తెలుగు సామెతల్లో యతి, ప్రాస, అనుప్రాస, అంత్యానుప్రాసలు ఈ రకమైన ఊహలకు అవకాశం ఇస్తున్నాయి.

భాషా నిర్మాణ దక్షతను ఛామ్‌స్కీ (competence) అన్నాడు. సామాజిక భాషాశాస్త్రజ్ఞులు నిర్మాణ దక్షత (grammar competence) పాటు ప్రయోగ దక్షత (communicative competence) ను ప్రవేశ పెట్టారు. ఈ దక్షత వ్యవహర్తలందరికీ సమానమని ఛోమ్‌స్కీ ఉద్దేశించాడు. కాని ఇతరులు విభేదించారు. నిర్మాణ దక్షత తరవాత ఈ దక్షతలో తరతమ భేదాలను గుర్తించాల్సి ఉంటుంది. ఒకే భాషా వ్యవహర్తలు కొందరు ఆకర్షణీయంగా మాట్లాడతారు, కొందరు హేతుబద్ధంగా మాట్లాడతారు, కొందరు నట్లుపడుతూ సరియైన పదాలు వెతుక్కుంటూ మాట్లాడతారు. కొందరికి పదప్రయోగంలో నేర్పుంటుంది. కొందరికి అనుప్రాసంలో, మరికొందరికి సదృశీకరణంలో, ఇంకొందరికి పదగుంఫనలో, ఇంకొందరికి సామెతల ప్రయోగంలో నేర్పు ఉండవచ్చు. భాషల మధ్య నిర్మాణ భేదాలుండటం ఎంత సహజమో వ్యవహర్తల మధ్య దక్షత భేదాలుండటం అంత సహజమే. లిఖిత వ్యవహార సమాజాల్లో (literate societies) ఈ భేదాలు ఇంకా ఎక్కువ ఉంటాయి. భారత సమాజంలో సంపూర్ణ మౌఖిక వ్యవహారం మీద ఆధారపడ్డ వాళ్ల నుంచి లిఖిత సాహిత్య పరిచయం ఉన్నవాళ్ల వరకు ఉన్నారు. వాళ్ల దక్షతలో ఈ

భేదాలుంటాయి. తెలుగులాంటి భాషే తీసుకుంటే సాహిత్య ప్రవేశం ఉన్నవారి భాషాప్రయోగానికి, ఇతరుల భాషాప్రయోగానికి ముఖ్యంగా పదప్రయోగంలోనే భేదం ఉంటుంది.

సాహిత్య గంధం ఉన్నవాళ్లు కొన్ని సందర్భాల్లో సాహిత్య భాషాపదాలు వాడతారు. మాట్లాడే భాషలో వాడే మాటలన్నీ రాతలో వాడరు. వేరే పర్యాయ పదాలు వాడతారు. అప్పుడు ఆ వ్యవహర్తల భాషలో ఉన్నత శైలీపదాలు, సామాన్యశైలీ పదాలు అనే విభాగం ఉన్నదన్నమాట ! ఈ విభాగం వాళ్ల మనఃపదకోశంలో ఉండాలి. (ఈ భేదం లేనివాళ్లు కూడా ఉండవచ్చు)

మన ప్రాచీన వ్యాకరణాల్లో తత్సమ, తత్సమేతర పదవిభాగం ఉంది. ఈ విభాగం సమాస రచనకు, బహువచన నిర్మాణాది సూత్రప్రవర్తనకు అవసరం. ఇది కూడా వ్యవహర్త విద్యా శిక్షణననుసరించే ఉంటుంది.

విద్యావంతుల భాషలో రాతననుసరించి ఏర్పడే హ్రస్వీకృత సమాసాలుంటాయి. సోసారిస అంటే ఒకప్పుడు సోషలిస్టు సామ్యవాద రిపబ్లిక్కుల సమాఖ్య, ఐరాస అంటే ఐక్యరాజ్యసమితి, కొన్ని అశ్లీల పదాలను ఇట్లా కుదించి మాట్లాడే భాషలో వాడతారు. ఈ ప్రక్రియ చదువుకున్న వారిలో ఎక్కువ.

ఇట్లాంటి ఎన్నో విభాగాలు, పద్ధతులూ మనఃపదకోశంలో ఉంటాయి. వ్యవహర్తల భాషాజ్ఞానంలోనూ, దక్షతలోనూ ఈ భేదాలు ప్రస్ఫుటమవుతాయి.

ఈ మాటలన్నీ వ్యవహర్త ఎట్లా ఉపయోగించుకుంటాడు ? ఒక్కో అవసరానికి తగినట్లు మాటలుపయోగించుకోటానిక అరల ఏర్పాట్లున్నాయా ?

ఈ ప్రశ్నలన్నిటికీ నిశ్చయార్థక సమాధానాలు దొరకటం కష్టం. మాటల మధ్య వాటి అర్థం మధ్య అసంఖ్యాకమైన లింకులున్నాయి. ఈ లింకులు అన్నీ కానీ, కొన్ని కానీ సమాంతరంగా పనిచేస్తుండవచ్చు. పుస్తకంలో పేజీలు తిప్పేలాంటి పరిమితులు మనఃకోశానికుండవు. ఒక్కోసారి ఒకే మాటకు పరిమితమయ్యే నిబంధన కూడా మనిషి భాషాయోజనకు లేదు.

ఇంతసేపూ మనం మనిషికున్న భాషావ్యవహార శక్తిలో భాగంగా మనఃపదకోశం గురించి మాట్లాడుకున్నాం.

భాషాపరిశోధకులు మనఃపదకోశం గురించి ఏం చేయాలి ?

వ్యవహర్తకున్న భాషా జ్ఞానాన్ని పట్టుకోటమే భాషాపరిశోధన లక్ష్యమైతే - ఇది దాదాపు ఈనాటి భాషాపరిశోధకులందరూ అంగీకరించిన లక్ష్యమే - వ్యవహర్తకున్న మనఃపద కోశానికి భౌతిక రూపమియ్యటమే భాషాపరిశోధకుల లక్ష్యం.

ఇక్కడ ఒక క్షణం ఆగి భాషాశాస్త్ర పరిశోధన మార్గాన్ని ఒకింత ప్రస్తావిస్తాను. అతిప్రాచీన కాలం నుంచి పదాలు, వాటి భేదాలు, వాటి నిష్పాదన వగైరాల గురించి వ్యాకర్తలు ఆలోచిస్తూనే ఉన్నారు. భారతీయ సంప్రదాయంలో పదాలకు వాక్యంలో వాటి ప్రయోగానికి సముచితమైన స్థానం మొదటి నుంచీ ఉంది. యోగ్యతా కాంక్షా సత్తియుతమైన పదసముదాయం వాక్యమని ప్రాచీనులు భావించారు.

పదాలు, వాటి అర్థవంతమైన కూర్పు భాష అనే నా నిర్వచనం దీని మీద ఆధారపడిందే.

సంస్కృత వ్యాకరణ సంప్రదాయంలో పదాలకూ వాటి అర్థాలకూ, వాటి సంయోజనకు సముచితమైన ప్రాధాన్యం మొదటి నుంచి ఉంది.

ఆధునిక భాషాశాస్త్రంలో పదాల పట్టిక వ్యాకరణంలో భాగంగా సుమారు 1964 నుంచి పరిగణించబడుతూ వచ్చింది. ఛామ్‌స్కీగారి Aspects of the theory of syntax (1965) పుస్తకంలో Lexicon (పదనిధి) అనేది వ్యాకరణంలో భాగంగా ప్రతిపాదితమైంది. ధ్వని విభాగం - అర్థవిభాగం రెండూ వ్యాకరణంలో భాగాలుగా పరిగణించటంతో పద విభాగం వ్యాకరణంలో తప్పనిసరి విభాగం అయింది. ఈ పదకోశంలో పదాలకు విభేదక ధ్వన్యంశాల (distinctive phonological features) స్వరూపం ఉంటుందనీ, వాటి అర్థాలు, వ్యాకరణాంశాలు కూడా జోడించాలనీ అవి అన్నీ కలిపి సంకీర్ణ సంకేతాలు (complex symbols) గా ఉంటాయని, వాటిని పదబంధ నిర్మాణసూచిక (phrase markers) ల్లో పదప్రవేశ సూత్రాలు (lexical insertion rules) ద్వారా ప్రవేశ పెట్టాలనీ ఛామ్‌స్కీగారి పరివర్తన వ్యాకరణం నిర్దేశిస్తుంది. ఆ తరవాత 1968 ప్రాంతంలో Remarks on Nominalizations అనే వ్యాసంలో వ్యాకరణంలో పదకోశాన్ని సంపన్నం చేసే ప్రతిపాదనలు చేశారు. మరో పక్క నుంచి Charles Fillmore అనే శాస్త్రజ్ఞుడు 1966 ప్రాంతంలో క్రియలకు నామబంధాల కున్న సంబంధాలను నిరూపిస్తూ కోశంలో క్రియల పాత్రను నిర్వచించాడు. ఆయనా, ఆయన సహచరులూ అప్పటి నుంచి ప్రత్యేకంగా కొన్ని రకాల క్రియల ప్రవర్తన గురించి ప్రత్యేకాధ్యయనం చేశారు.

ఈ రకమైన సిద్ధాంత పరిణామం వల్ల ఇటీవల కాలంలో నిఘంటువులపై ఆసక్తి పెరిగింది. ముఖ్యంగా నిఘంటువులలో ఏ సమాచారం ఎంత ఉండాలి ? అర్థ నిర్ణయం ఏ పద్ధతిలో ఉండాలి ? వ్యాకరణ వివరణ ఎంత ఉండాలి ? ప్రయోగరీతిని గురించి ఎటువంటి సమాచారం నిఘంటువులో ఉండాలి ? అనే విషయాలపై మన అవగాహన గాఢమైంది. విస్తృతమూ అయింది. ఇటీవల ఒకటి రెండు దశాబ్దాలుగా ఈ విషయాలపై విశేషమైన చర్చలు జరుగుతున్నాయి.

మనఃపదకోశంలోగాని, వ్యాకరణాంతర్భాగ పదకోశంలోగాని ఉన్నవన్నీ ప్రయోగ పదకోశాల్లో (practical dictionaries) ఉండాలని లేదు. అది సాధ్యమూ కాదు; సాధ్యమైనా కాకపోయినా ప్రయోజనకరమైన నిఘంటువులు తయారు చేసుకోవటానికి ఈ జరుగుతున్న సిద్ధాంత చర్చలు దోహదం చేస్తాయి. నిఘంటు నిర్మాణంలో పని చేసే వారందరికీ ఈ భాషాశాస్త్ర సిద్ధాంత ప్రవేశమూ, చర్చలతో పరిచయమూ అత్యంతావశ్యకం.

తెలుగు నైఘంటుక సంప్రదాయం చాలా అర్వాచీనమైనది. దొరుకుతున్న వాటిలో కవి చౌడప్ప సీసపద్యాలు (1619-37) ప్రాచీనమైనది. ఇది 30 సీసపద్యాల సముదాయం, 600 పదాలున్నాయి. ఆ తరవాతవి గణపవరపు వేంకటకవి (1674-89) రచించిన ఆంధ్రనిఘంటువు, ఆంధ్ర ద్విరూపకోశం వస్తాయి. పైడిపాటి లక్ష్మణకవి ఆంధ్రనామ సంగ్రహము, అడిదము సూరకవి ఆంధ్రనామ శేషము, కస్తూరి రంగకవి రచించిన సాంబనిఘంటువు అనే మూడింటిని కలిపి తెలుగులో నిఘంటుత్రయం అంటారు. మా చిన్నతనం వరకూ అవి పఠన పాఠనాదులలో ఉండేవి. వీటిలో సుదురుపాటి వేంకన రచించిన ఆంధ్రభాషార్ణవము విపులమైనది.

తెలుగు నిఘంటువులు అమరకోశం మార్గంలో వచ్చినవి. ప్రాచీన నిఘంటు కారులకు అకారాది క్రమ స్పృహ లేకపోలేదు. గిడుగు సీతాపతిగారు (చూ. విలియం బ్రౌను - తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు పీఠిక) కొన్నింటిని గుర్తించారు. ఆంధ్ర భాషార్ణవంలోనూ ఇట్లాంటి ప్రయత్నం జరిగింది. అప్పకవీయంలోనూ, కూచిమంచి తిమ్మకవి లక్షణసార సంగ్రహములోను రేఫద్వయ నిర్ణయం చేసేన పద్యాలలో ఈ స్పృహ కనిపిస్తుంది. అయితే పద్యరచనలో అకారాది క్రమం సంపూర్ణంగా సాధ్యం కాదు. వాళ్లు ఎన్నుకున్న విధానానికి అకారాది క్రమం సరిపోదు. గణపవరపు వేంకటకవి ఆంధ్రనిఘంటువులో అంత్యాక్షర స్పృహ (విరి, వేవిరి, కావిరి అనే విధంగా) కనిపిస్తుంది.

తెలుగు నిఘంటు సంప్రదాయం తత్సమేతరానికే పరిమితం కావటం మరో విశేషం. తెలుగులో సంస్కృత శబ్దాల ప్రవేశానికి పరిమితి లేదు. సంస్కృత నిఘంటువు లుండగా వాటిని మళ్లీ తెలుగులో చెప్పటం ఎందుకన్న కారణం వల్ల తెలుగు నిఘంటువులు తత్సమేతర శబ్దాలనే గ్రహించాయి కాబోలు. ఈ నిఘంటువులు పర్యాయపదాలకు, నానార్థాలకు మాత్రమే పరిమితం. వీటి ఉపరి విభాగం (macro-structure) దేవవర్గు, మానవవర్గు, స్థావరవర్గు, జంగమవర్గు అనే విధంగా అర్థాన్ని అనుసరించి విభాగాలు (semantic classification) చేసుకున్నారు. అకారాది క్రమానికి, అచ్చు పుస్తకానికి సంబంధం ఉంది. అచ్చు యంత్రం కంఠస్థం చేసే శ్రమను తగ్గించింది. అందువల్ల వచన గ్రంథాలు, వచన కోశాలూ సాధ్యమయ్యాయి.

అచ్చ తెలుగు అనబడే తత్సమేతర భాషకు పరిమితమైన ఈ నిఘంటువులలో దేశ్యపదాలే కాక సంస్కృత నామాల నమూనాలో తెలుగులో నిర్మించిన పదజాలమూ ఉంది. బహుశా ఇవి ఎక్కువ భాగం, కవులు, తాము కల్పించినవే కావచ్చు. ఈ నిఘంటువులు ఉన్న పర్యాయపదాలను ఇచ్చి ఊరుకోక సమాస విస్తృతి ద్వారా నూతన పదకల్పన ఎట్లా చేయవచ్చునో చూపించాలని యత్నించినట్టు కనిపిస్తుంది. నిఘంటు ప్రయోజనం ఉన్న పదాలను ఇవ్వటమే కాక కొత్త పదాలను నిర్మించుకునే నమూనాలను చూపెట్టడం కూడా లక్ష్యంగా ఉంచుకున్నట్టు గ్రహించవచ్చు.

నిఘంటువులు పదనిధులే (treasures) కాదు. పదనిర్మాణపు పనిముట్లు కూడా (tools) నన్నమాట ! ఇది సృజనాత్మక (creative) ప్రయోజనం. ఈ నిఘంటువులు ప్రధానంగా కవులకుద్దేశించినవన్న సంగతి గ్రహిస్తే ఈ ప్రయోజనాన్ని అర్థం చేసుకోగలుగుతాం. ఆ కాలంలో కాని, తరవాత కాని వచ్చిన అచ్చ తెలుగు కావ్యాలను ఈ నిఘంటువులు నమూనాలు (models) గా ఉపయోగించి ఉండవచ్చు.

తెలుగులో అకారాది క్రమంలో వచ్చిన నిఘంటువుల్లో P, de la Lane 1720 లో రచించిన French Telugu dictionary మొదటిది కావచ్చు. పాశ్చాత్యులు వాళ్ల అవసరం కోసం ద్విభాషా నిఘంటువులు కూర్చారు. అవి ప్రాయికంగా వ్యావహారిక భాషా నిఘంటువులు. William Brown 1817లో (1818 రెండో ముద్రణం అయి ఉంటుంది). ఆ తరువాత campbell నిఘంటువు 1810లో వచ్చాయి. విస్తృతమయిన ప్రణాళికతో C.P. Brown Telugu English dictionary (1852), English - Telugu dictionary (1853) వచ్చాయి. A Galletti Di Cadilhac నిఘంటువు 1935లో వచ్చింది. ఈ నిఘంటువులన్నిటికీ వాటివాటి ప్రత్యేకతలున్నాయి.

విలియం బ్రౌను నిఘంటువులో నామాలకు విశేషణ రూపాలూ, బహువచన రూపాలూ ఇచ్చాడు. క్రియలకు అడమంత (రావడం, తేవడం) వంటి రూపాలనే ప్రధానారోపాలుగా ఇచ్చి శత్రర్థక, క్త్వార్థక రూపాలనూ కూడా ఇచ్చాడు. ఇంగ్లీషులో అర్థాలూ, తెలుగులో ప్రయోగాలూ ఇచ్చాడు. నిఘంటువు చిన్నదైనా ఇతర భాషీయులకు రూపభేదాలు (allomorphic variation) తెలుసుకోటానికి బాగా ఉపయోగిస్తుంది.

C. P. Brown నిఘంటువులు పెద్దవి. కావ్య భాషకు, వాడుక భాషకు కూడా పనికొస్తాయి. కావ్య భాషా ప్రయోగాలు కూడా దొరుకుతాయి. విస్తృత ప్రణాళిక ననుసరించిన నిఘంటువు. ఇంకా తన ప్రామాణికతను కోల్పోలేదు.

ఈ నిఘంటువులలో గెలెటీ నిఘంటువు విచిత్రమైనది. 'There is no other Telugu dictionary in the least like it' అని 1933లో రాసిన చిరుపీఠికలో చెప్పుకున్నాడు. (అచ్చయింది 1935 లో). ఇదేం డిక్షనరీ-గిక్షనరీ అని తెలుగువాళ్లు ఈసడించుకుంటారని కూడా ఊహించుకున్నాడు. 'rather a manual for young people learning Telugu or English and it aims at educating; edifying or even amusing them when they look up words' అని తన నిఘంటువు లక్ష్యాలను సూచించాడు.

దీనికి R. Galletti రాసిన ఉపోద్ఘాతంలో తెలుగు భాష గురించి, వ్యావహారిక భాషోద్యమం గురించి, సంధి పద్ధతి గురించి చాలా విశేషాలున్నాయి. తెలుగు భాషపై విశేష కృషి చేసిన జెరల్డ్ కెలీగారు (1928-1987) (చూ. తెలుగు విశ్వవిద్యాలయం వారి తెలుగు విజ్ఞాన సర్వస్వం, 3వ సంపుటం అనుబంధం). ఈ నిఘంటువు నుంచి ప్రేరణ పొందటం స్వయంగా నేనెరుగుదును.

ఈ నిఘంటువు రోమన్‌లిపిలో ఉంది. అక్షర క్రమం ఆ సంప్రదాయంలోనే ఉంది. ఈ నిఘంటువులో హాస్యోక్తులు సరదాగా చదువుకోటానికి కూడా బాగుంటాయి. మాట్లాడుట అనే మాటకింద ఇచ్చిన ఈ హాస్య సంభాషణ చూడండి.

స్త్రీ : నా పెనిమిటి నిద్రలో మాట్లాడుతుంటారు, వారి కేమయినా మందిస్తారా?

వైద్యుడు : మందక్కరలేదు. పగటిపూట ఆయనను స్వేచ్ఛగా మాట్లాడనివ్వండి.

తరువాత చెప్పుకోవలసిన తెలుగు, అకారాది నిఘంటువులు, మామిడి వెంకయ్య ఆంధ్రదీపిక (రచన 1816, ముద్రణ 1848) ఈ రకం నిఘంటువులలో మొదటిది లాగుంది. ఆ తరువాత బహుజనపల్లి సీతారామాచార్యులుగారి శబ్దరత్నాకరం (1885)

మహాకాళి సుబ్బరాయుడుగారి శబ్దార్థచంద్రిక (1893, 1919) ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి సూర్యరాయాంధ్ర నిఘంటువు (1936-70) బులుసు వేంకటేశ్వరులు గారి వావిళ్ల నిఘంటువు (1949-69) చెలమచర్ల రంగాచార్యులుగారి ఆంధ్రశబ్ద రత్నాకరము (1967-70) కావ్యభాషకు కూర్చిన నిఘంటువులు.

ఆంధ్రసాహిత్య అకాడమీ స్థాపనతో తెలుగు నిఘంటు చరిత్రలో మరో ఘట్టం మొదలయింది. నన్నయ్య, తిక్కన, నన్నెచోడ, శ్రీనాథ పదకోశాలు అచ్చేశారు. ఇవి తెలుగు మాటలకే కుంచితం కావటం, అపదాలను చేర్చకపోవటం, అర్థ నిర్ణయం చెయ్యకపోవటం వీటి పరిమితులు. వృత్తి పదకోశాల ప్రకటన తెలుగు నిఘంటు నిర్మాణంలో ఒక విప్లవంలాంటిదే. తెలుగులో వివిధ మాండలికాల విభజన మొదటి సారిగా ఈ నిఘంటువుల ఆధారంగా జరిగింది. ఈ నిఘంటువుల్లో స్థూల నిర్మాణం (macro-structure ) అర్థం మీద ఆధారపడింది. అంతర్భాగాలు అకారాది క్రమంలోనే ఉన్నాయి. రెండు పద్ధతులను సమర్థంగా ఉపయోగించుకున్న నిఘంటువులవి. ప్రజల వ్యవహారంలో పదస్వరూపాన్ని కోశాలకెక్కించటానికి జరిగిన బృహత్ప్రయత్నాలవి. పర్యాయపదాలు, రూపాంతరాలు, ఉచ్చారణ భేదాలు అనే విభాగాల వల్ల భాషా స్వరూపం ఎక్కువగా తెలుసుకోవటానికి వీలయింది. ఇంతకు ముందు కోశాలకెక్కని ఎన్నో పదాలు కావ్యభాషా పదాలతో సహా - వీటిలో కనిపిస్తాయి.

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారి తెలుగు వ్యుత్పత్తి కోశం తెలుగు నిఘంటు చరిత్రలో మరొక మైలురాయి. సోదర భాషల్లో సరూప పదాలను కూడా ఇచ్చిన మొదటి తెలుగు నిఘంటువు ఇది. (1978-1995) ఈ రకపు ప్రయత్నానికి భద్రిరాజు కృష్ణమూర్తిగారి Telugu verbal bases (1961) మూలం. ఆయన తన సిద్ధాంత గ్రంథంలో 1236 తెలుగు క్రియలకు సోదర భాషల నుంచి సరూప పదాలను అర్థాలను కూర్చారు.

తెలుగు అకాడమీ వారు శబ్దసాగరము అనే బృహన్నిఘంటువు తలపెట్టి దానికి బదులు చిన్న నిఘంటువు నొకదానిని తయారుచేసే ప్రయత్నంలో ఉన్నారు. వివిధ శాస్త్రాలకు వారు తయారుచేసిన పదపట్టికలు విస్తృతంగా ఉపయోగంలో ఉన్నాయి.

ఇవికాక జి. ఎన్. రెడ్డిగారి పర్యాయపదకోశం JPL Gwynn డా. వేంకటేశ్వర శాస్త్రి సహాయంతో నిర్మించిన తెలుగు నిఘంటువులు నిఘంటు నిధికి మరో రెండు చేర్పులు.

తెలుగు దినపత్రిక ఈనాడు సంస్థ బూదరాజు రాధాకృష్ణగారి చేత కొన్ని నిఘంటువులు రాయిస్తున్నది. ఆర్.వి. రామారావుగారి సాయంతో రాధాకృష్ణగారు కూర్చిన వ్యవహారపదకోశం పత్రికా రచయితలకోసం ఆంగ్లపదాలకు తెలుగులో నిత్యం

అవసరమయ్యే పదాలను కూర్చారు. పత్రికా రచయితలు ఈ మాటలు అవసరమైనప్పుడు వెంటనే సంప్రదించటానికి వీలుగా ఈ నిఘంటువు తయారయింది. ఈనాడు సంస్థవారే మరవరాని మాటలు అని సృజనాత్మక సాహిత్యం నుంచి కొటేషన్లు గ్రహించి నిఘంటువు ఒకటి తయారుచేస్తున్నట్లు *'వ్యవహారపదకోశం'* లో ప్రకటించారు (1990). ఇవికాక బూదరాజు రాధాకృష్ణగారి సంపాదకత్వాన మరో బృహన్నిఘంటువు తయారీలో ఉన్నట్టు తెలుస్తుంది. ఈనాడు ఆదివారం సంచికలో ఆయన కొన్ని మాటలపై రాస్తున్న వివరణలు ఈ అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి. ఒక తెలుగు పత్రిక కొన్ని నిఘంటువుల తయారీకి పూనుకోటం ఆహ్వానించదగిన పరిణామం. ఈనాడు సంస్థవారు ఈ నిఘంటు నిర్మాణ పరిశ్రమను ఇట్లాగే కొనసాగిస్తారని ఆశించవచ్చు. మిగతా పత్రికలవారు కూడా దీని నుంచి స్ఫూర్తి పొంది మరికొన్ని నిఘంటువుల తయారీకి కృషి చేసి, భాషా సేవలో పాలుపంచుకోగలరని ఆశించటం దురాశ కాకుంటే బాగుండు!

నేను 1870 లో తెలుగు విశ్వవిద్యాలయంలో చేరిన తరువాత ప్రారంభించిన పత్రికాభాషా నిఘంటువు 1995 తో అచ్చు అయింది. దీనికి పీఠిక రాస్తూ బాలసుబ్రహ్మణ్యంగారు The News-paper dictionary belongs to the category of special dictionaries and restricted dictionaries in the typology of dictionaries' అని అన్నారు. దాన్ని ఇంకా వివరిస్తూ ఇవి సామాన్య భాషాప్రయోగంలో ఉండవని పేర్కొన్నారు. ఇందులో పదాలను marked vocabulary అనీ, neologisms అనీ వర్ణించారు. ఈ నిఘంటువులో ప్రభుత్వ పాలన భాషలో కనిపించే (విశేష పదావళి) కొంత ఉన్నా, విప్లవ కారులు అన్న అర్థంలో *అన్నలు, అడవి అన్నలు* వంటి (తాత్కాలిక ప్రయోగం కోసం కల్పించినవి) ఉన్నా ఈ నిఘంటువులో పదాలు సామాన్య లిఖిత భాషలో కనిపించేవే. ఆ మాటకొస్తే ఇవాళ పత్రికా భాషే చదువుకున్నవాళ్ల సామాన్యభాష అయింది. ఈ పదాలు మాట్లాడే భాషలో కూడా వినిపిస్తాయి.

పెద్దసైజులో తయారుకావాల్సిన సామాన్య బాషా నిఘంటువుకిది సూక్ష్మరూప ప్రతినిధిగా గ్రహించటానికి తగిన ఆధారాలున్నాయి. నేను ఈ నిఘంటువును ప్రారంభించి నప్పుడు ఆ ఉద్దేశంతోనే ప్రారంభించాను. ఇంగ్లీషులో వార్తా ప్రసారంలో వాడిన పదాలకు ఇట్లాంటి నిఘంటువు ఒకటి ఉంది. భారత భాషల్లో బహుశా ఇట్లాంటి నిఘంటువుల్లో తెలుగు విశ్వవిద్యాలయం వారిదే మొదటిది కావచ్చు. ఈ దృష్ట్యా ఈ నిఘంటువు తెలుగు నిఘంటు చరిత్రలో మరొక ఉజ్వల ఘట్టం.

భారతదేశంలో యూనివర్సిటీ స్థాయిలో నిఘంటు నిర్మాణశాఖ ఒక్క తెలుగు విశ్వవిద్యాలయంలోనే ఉంది. ఈ శాఖ ఇంకా పటిష్ఠం కావాల్సి ఉంది. తెలుగులో అవసరమైన పదకోశాలు చాలా రావాల్సి ఉన్నాయి. ఆ అవసరాలను కొన్నిటిని ముచ్చటించుకుందాం.

1. ప్రాచీన భాషా నిఘంటువులు : ఇప్పుడు మనకున్న కావ్యభాషా నిఘంటువులు మంచివే కాని సమగ్రమనలేం. ఏ మాటను ఏ కవి ఏ అర్థంలో ప్రయోగించాడో చెప్పే కోశాలు లేవు. అందువల్ల ఒక్కోకవి భాషకు ప్రత్యేక నిఘంటువు అవసరం. ముఖ్యంగా ప్రయోగ కోశాలు వచ్చిన నన్నయ్య, తిక్కన, శ్రీనాథుల భాషకు వేరువేరు నిఘంటువులు తయారు చెయవచ్చు. ఈ నిఘంటువుల వల్ల పదపరిణామం, అర్థ పరిణామం గ్రహించ టానికి వీలవుతుంది. ఆధునిక లిఖిత భాషకు ప్రాచీన భాషా భాండాగారం అవసరం ఎప్పుడూ ఉంటుంది.

2. ఆధునిక భాషా పర్యాయ పదకోశం : ఏ భాషలోనైనా వివిధ సందర్భాల్లో ఉపయోగించే భాషల్లో వేరువేరు పర్యాయపదాలు ఉపయోగిస్తారు. *అన్నం, బువ్వ, తిండి, కూడు, భోజనం, ఆహారం* అనేవి సమానార్థక పదాలయినా ప్రయోగంలో భేదాలున్నాయి. ఈ భేదాలు అమూర్తపదాల్లోనూ, మానవుల ఆవేశాలు (emotions) మనోభావాలు (feelings) తెలిపే పదాల్లో ఎక్కువ కనిపిస్తాయి. ఈ మాటల మధ్య సూక్ష్మమైన అర్థచ్ఛాయా ప్రయోగ భేదాలుంటాయి. *బాధపడు, కష్టపెట్టుకొను, నొచ్చుకొను, విచారించు, కుందు, చింతించు* వంటి క్రియలు సమానార్థకాలైనా వీటి మధ్య ప్రయోగ భేదాలున్నాయి. మంచి వచన రచనకు అవసరమైన ఈ రకం పదప్రయోగ కోశాలు ఇతర భాషల్లో usage dictionaries పేరుతో ఉన్నాయి. ఇది కూడా తెలుగులో తక్షణం ప్రారంభం కావాల్సిన పని.

3. పదజ్ఞాపిక కోశం (Thesaurus) : ఇది కూడా మంచివచన రచనకు అత్యంతావశ్యకమైన నిఘంటువు. మనకు తెలిసిన మాటలే మనకు అవసరానికి గుర్తు రావు. దానికి సన్నిహితమైన మాట గుర్తు రావచ్చు గాని అది మన అవసరానికి సరి పోకపోవచ్చు. అప్పుడు ఈ గుర్తున్న సన్నిహిత పద సహాయంతో సరైన పదాన్ని వెతుక్కోటానికి పనికొచ్చే పదనిధి ఇది. ఈ పదాలు వాటి అర్థసీమల (semantic fields) పద్ధతిలో ఏర్పాటవుతాయి. మాటలకు అకారాది క్రమంలో సూచిక ఉంటుంది. తెలుగు విశ్వవిద్యాలయం వారు వెంటనే చేపట్టదగిన మరో కోశం ఇది.

**4. వార్తా ప్రసార నిఘంటువులు :** వార్తా పత్రికలకులాగే రేడియో, టి.వి.ల వార్తా ప్రసారాలలో వచ్చే పదాలకు నిఘంటువులు కూరిస్తే పత్రికాభాషా నిఘంటువునే ప్రసార నిఘంటువుగా విస్తరించవచ్చు.

**5. విలోమక్రమ నిఘంటువు (Reverse dictionary ) :** అకారాది క్రమాన్ని వెనక నుంచి పాటిస్తూ నిఘంటువులు కూరిస్తే పదాంతం నుంచి పదాల క్రమం తెలుస్తుంది. దానివల్ల అంత్యప్రాసాదుల ప్రయోగానికే కాక వ్యాకరణ సూత్ర ప్రవర్తన గురించి కూడా కొత్త విషయాలు తెలుస్తాయి. ముఖ్యంగా వర్ణ సంయోజన నియమావళి (phonotactic constraints ) గురించి మరింత సమాచారం గ్రహించవచ్చు. అట్లాగే తెలుగుకు అక్షరాల (Syllable ) పరిమాణాన్ని బట్టి చేసే పట్టికలు కూడా ఉపయోగిస్తాయి.

**6. మాండలిక నిఘంటువులు :** వృత్తిపదకోశాల్లో ఆయా వృత్తులకు, సంబంధించిన పదజాలాన్ని వ్యవసాయ, వాస్తు, చేనేత, కమ్మరం, కుమ్మరం వడ్రంగం, జాలరి వంటి వృత్తులకు సంబంధించిన మాండలిక పదాలను గ్రంథస్థం చేశారు. ఇవికాక వాడుకలో ఉన్న సామాన్య మాండలిక పదాలను కోశస్థం చేయాల్సిన అవసరం ఉంది. ఆచార్య రవ్వా శ్రీహరిగారు నల్లగొండ జిల్లా మాండలికంపై అట్లాంటి కృషి ఒకటి చేశారు. ఇట్లాంటి నిఘంటువులు అన్ని జిల్లాలకు అవసరం. తెలుగు ఆకాడమీ వారు ప్రతి జిల్లాకు బులెటిన్‌లు తయారు చేయించారు. వారు విస్తృత ప్రాతిపదికపై సమాచార సంగ్రహణ చేయించి ఈ మాండలిక నిఘంటువుల తయారీకి ప్రయత్నించ వచ్చు. ఎట్లాగూ మాండలిక వ్యాకరణాలు రాయిస్తున్నారు. కనక, నిఘంటు నిర్మాణానికి కూడా వారే పూనుకోవచ్చు.

**7. శాస్త్ర పదకోశాలు :** ఒక భాష ఆధునికం కావటం అంటే ఆ భాషలో శాస్త్ర పరిభాష పెరగటం. అందుకు రకరకాల శాస్త్ర కోశాలు తయారు కావలసి ఉంది. ఆయా శాస్త్రాలతో పుస్తకాలు రాయించటం, పదపట్టికల తయారు చేయించటం పూర్వం తెలుగు అకాడమీ చేసింది. ఆ పదపట్టికలనే విస్తృత పరచి నిఘంటువులు తయారు చెయ్యవచ్చు.

**8. విశేష నామ నిఘంటువులు :** సాహిత్యంలోకాని, చరిత్రలో కాని, ప్రసిద్ధులైన వారు, వివిధ కళారంగాలలో కృషి చేసిన వారి గురించి విజ్ఞాన సర్వస్వాలుగా కాక లఘు సమాచారాన్ని అందించే నిఘంటువులు తయారుచేస్తే పత్రికల వారికి, విద్యార్థులకు పనికివస్తాయి. తెలుగు అకాడమీ వారు అట్లాంటి నిఘంటువును సాహిత్యానికి ఒకటి తయారు చేయించారు. అంతకన్నా ఎక్కువ ఆరోపాలతో లఘువుగా తయారు చేయించ వచ్చు. అట్లా ఇతర కళాకారుల గురించి కూడా సమాచారాన్ని సంగ్రహించి వివిధ కళలకు, శాస్త్రాలకు తయారు చేయించవచ్చు.

**9. సంగ్రహీకృత నామ నిఘంటువులు (Dictionary of Acronyms)** : తెలుగు పత్రికల్లోనూ, భారతీయాంగ్ల పత్రికల్లోనూ సంగ్రహీకృత నామాలు విరివిగా వాడతారు. అయితే ఈ సంగ్రహీకరణం ఇంగ్లీషు మాటలకే ఎక్కువ జరుగుతుంది. వాటిని తెలుగులోనూ వాడతారు. ఉదాహరణకు సి. ఆర్. అంటే చక్రవర్తుల రాజగోపాలాచారి, చంద్ర రాజేశ్వర రావుగారు, కె. ఎస్. అంటే కొండపల్లి సీతారామయ్యగారు, ఎస్. ఎమ్. అంటే కె.జి. సత్యమూర్తిగారు. వి.వి. అంటే పెండ్యాల వరవరరావు. ఇట్లా అనేక రకాల సంగ్రహీకృత నామాలకు ఒక నిఘంటువు పత్రికా రచయితలకు, పాఠకులకు ఉపయోగిస్తుంది. ఈ పని పత్రికలవారూ చెయ్యవచ్చు. పత్రికల ఆధారంగా ఇంకెవరైనా చెయ్యవచ్చు.

ఇట్లా ఆలోచిస్తూపోతే తెలుగులో రావలసిన నిఘంటువులు చాలానే ఉన్నాయి. జరిగింది. చాలా తక్కువ, జరగవలసింది అనంతం.

ఈ నిఘంటు నిర్మాణశాఖ కొన్నితరాల వరకు చెయ్యవలసిన నిఘంటువులున్నాయి. తెలుగు భాషాభివృద్ధి లక్ష్యంగా ఏర్పడ్డ తెలుగు విశ్వవిద్యాలయానికి అందులో నిఘంటు నిర్మాణశాఖకు చేతినిండా పని ! అయితే ఇందుకు తగిన వనరులు అవసరం. అటు కేంద్రంలోనూ, ఇటు రాష్ట్రంలోనూ ఏ అభివృద్ధి కార్యక్రమాలకైనా వనరులు కొరత తీవ్రంగా ఉన్న కష్టకాలంలో ఉన్నాం.

ఈ సమస్యను పరిష్కరించే మార్గాలు విశ్వవిద్యాలయాధికారులు ఆలోచించాలి. ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థల నుంచి వనరులను సంచయించే ప్రయత్నం తీవ్రంగా చేయాలి. ఆస్తి మూరెడు ఆశబారెడు అన్న చందంగా ఉంది విశ్వవిద్యాలయాల పరిస్థితి. ఈ సందర్భంగా నిఘంటు నిర్మాణ క్లేశాన్ని గురించి జుగుస్తా చెప్పిన ఒక ఛలోక్తి గుర్తు చేసి ముగిస్తాను. జె.జె. స్కాలిగేర్ అనే ఆయన (16-17 AD) ల్యాటిన్ పద్యాల్లో ఇట్లా అన్నాడట.

'........... the worst criminals should neither be executed nor sentenced to forced labour, but should be condemned to compile dictionaries, because all the tortures are included in this work.'

'.......ఘోర నేరస్తుల్ని ఉరితీయకూడదు. లేబర్ క్యాంపులకు పంపకూడదు. వాళ్ల చేత నిఘంటువులు తయారు చేయించాలి. ఇందులో అన్ని రకాల శిక్షలూ కలిసి ఉంటాయి.' [J. J. Scaliger (16th & 17th century)]

ఉపయుక్త ముఖ్యగ్రంథ, వ్యాస సూచిక

1. Aitchison, Jean, *Words in the Mind, An Introduction to Mental Lexicon.* Oxford : OX4, IJF, UK : Basil Blackwell, Inc. 1987.

2. Ascher, R. et al. *Encyclopaedia of Language and Linguistics,* Vol. 4.
3. Briscoe, Anne. et al. *Inheritage and the Lexicon.* Cambridge, UK : Cambridge University Press, 1991, 1993.
4. Chomsky, N.A. *Aspects of the Theory of Syntax,* Cambridge, Mass : The MIT Press, 1965.
5. Chomsky, N.A. *Remarks on Nominalizations, In Jacobs and Rosenbaum (eds) Readings in English Transofrmational Grammar,* Walthan, Mass : Braisdale, 1970. (pp. 184-221)
6. Fillmore, C. J. *The Case for Case. In Bach and Harms. Universals in Linguistic Theory,* New York : Holt, Rinehart and Winston.
7. Hartmann, R.R.K. *(ed.) Lexicography Principles and Practice.* London, New York, Academic Press, INC, 1983.
8. Kasimi, Ali M. Al. *Linguistics and Bilingual Dictionaries,* Leiden : E. J. Brill, 1977.
9. Wierz Dicka, Anna, *Lexicography and Conceptual Analysis.* Ann Arbor : Karman Publsihers Inc.
10. Zgusta, L. et. al. *A Manual of Lexicography.* The Hague : Mouton 1971.
11. కృష్ణమూర్తి, భద్రిరాజు (సం) మాండలిక వృత్తి పదకోశం, ప్రథమ సంపుటం, వ్యవసాయపదాలు, హైదరాబాదు, ఆంప్ర. సాహిత్య అకాడమి, 1962.
12. బాలసుబ్రహ్మణ్యం, కె. ఇతరులు. పత్రికాభాషా నిఘంటువు, హైదరాబాదు: తెలుగు విశ్వవిద్యాలయం, 1995.
13. వెంకటప్పయ్య, వెలగా. నిఘంటు వికాసం, హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1975.
14. సీతాపతి, గి. వేం. నిఘంటు రచనా పరిణామము. విలియం బ్రౌను తెలుగు-ఇంగ్లీష్ నిఘంటువు మద్రాసు : సంస్కృతి ప్రచురణ, 1953.


(తెలుగు విశ్వవిద్యాలయం, నిఘంటు నిర్మాణశాఖలో తెలుగులో నిఘంటు నిర్మాణం : సూత్రాలు, పద్ధతులూ అనే విషయంపై 1995 ఫిబ్రవరి 15-16 తారీకుల్లో జరిగిన జాతీయ సదస్సు ప్రారంభ సమావేశంలో ఇచ్చిన ప్రధాన ప్రసంగ పాఠం)

# నేటి తెలుగు : వర్ణం నుంచి వాక్యం వరకు

*వర్ణాలు, వాటి ఉచ్చారణ విశేషాలు :*

తెలుగుభాషకు భిన్న కాలాల్లో భిన్న భాషలతో సంబంధ బాంధవ్యాలేర్పడ్డాయి. అందువల్ల ఆయా భాషల్లోనుంచి చాలా పదజాలం తెలుగులోకి వచ్చి భాషా వ్యక్తీకరణను సంపన్నం చేసింది. చేరిన పదజాలం ఎంత అధికమైనా భాషలో మౌలికమైన మార్పులను అంత త్వరంగా కలిగించలేదు. తెలుగుకు మొదటి నుంచి సంస్కృత ప్రాకృతాలతో సాంస్కృతిక సంబంధాలున్నై. అందువల్ల తెలుగులో తత్సమ, తద్భవ శబ్ద విభాగం అర్థవంతమైనది. సంస్కృత ప్రాకృత సమాలు రెంటినీ తత్సమాలన్నా, ప్రాకృత సమపద రూపాలు దేశ్య శబ్దాల్లో వర్ణోచ్చారణకి భిన్నం కాక పోవటంవల్ల సంస్కృత సమాలనే తత్సమాలుగా పరిగణించటం సంప్రదాయం. సంస్కృత సమాల్లో పదరూపాలు సంస్కృత వర్ణ ఘటితాలు; దేశ్య శబ్దాల్లో లేని ఫ, భ, థ, ఠ, ఢ, ఛ, ఝ, ఖ, ఘ అనే మహాప్రాణ వర్ణాలు, ఙ, ఞ అనే అనునాసిక వర్ణాలు, శ, ష, హ అనే అంతస్థాలూ సంస్కృత శబ్దాల ద్వారా తెలుగులోకి చేరినై. 'హ' కారం కన్నడ హిందుస్తానీ మాటల ద్వారా కూడా ప్రవేశించింది. అయితే ఈ వర్ణోచ్చారణ ఆయా భాషల నుంచి వచ్చిన మూల పదాలకే పరిమితమయింది. అందులోను మూలపదాల ఉచ్చారణను యథాతథంగా నిలపాలనే వ్యవహర్తకే పరిమితంగా ఉంది. సంస్కృత శబ్దాల్లో ఉన్న మహాప్రాణోచ్చారణ చాలామంది తెలుగువారి వ్యవహారంలో వినిపించదు. అయినా వ్యవహార హానిలేదు. అర్థ భంగం కలగదు. వ్యవహర్తల సాంస్కృతిక స్థాయి తెలియపరచటమే ఈ వర్ణాల ఉచ్చారణకు ప్రధాన ప్రయోజనంగా కనిపిస్తుంది. వీటిల్లో 'శ' వర్ణోచ్చారణ దేశ్య శబ్దాల్లో ఇ, ఈ, ఎ, ఏలతో వచ్చే 'స' వర్ణోచ్చారణ కన్నా భిన్నం కాదు. అంటే శీతాకాలం-సీతాదేవి అన్న మాటల్లో మొదటి హల్లుల ఉచ్చారణలో భేదం వినిపించదని, ప్రయత్న పూర్వకంగా భేదం చూపించలేమని కాదు. భాషా వ్యవహారంలో భేదం మాసిపోయింది, 'ష' హిందూస్తానీ వంటి భాషలనుంచి కూడా రావడం వల్ల కాబోలు 'శ' వర్ణం కన్నా ఎక్కువగా వినిపిస్తుంది. ముఖ్యంగా విద్యావంతుల భాషలో అచ్చుల్లో ఋ, ౠ, ఌ ౡ అనే వర్ణాలు తెలుగువారు, విద్యాభ్యాసం చేసే వర్ణమాలలో కనిపించినా ఋ, ౠలకు మాత్రమే ప్రయోగం కనిపిస్తున్నది. అయితే దీని ఉచ్చారణ అతి ప్రాచీన కాలం నుంచీ రేఫోచ్చారణే ననటానికి *ఋత్విజుండని విచారించి పూజించితే ద్వైపాయనుండుండ ధర్మయుక్తి''* (భార, ఆది.

2-11)'' వంటి యతి ప్రయోగాలు ఆధారం. అయితే ఈ రేఫ మీది అచ్చు ప్రాచీన కాలంలో 'ఇ'కారంగా ఉండి ఉండవచ్చు. కాని నేటి భాషలో 'ఉ' ఎక్కువగా కనిపిస్తుంది.

f, అనే వర్ణం మొదట పార్సీ, ఉర్దూ భాషా పదాల ద్వారా ప్రవేశించి ఇంగ్లీషు భాషా పదాల ద్వారా నిలదొక్కుకుంది. ఇది దాదాపు అన్ని స్థాయిల వ్యవహర్తల ఉచ్చారణలోనూ ప్రవేశించింది. కొందరు విద్యావంతుల ఉచ్చారణలో సంస్కృత, దేశ్య శబ్దాల్లోకి కూడా ప్రవేశించింది. ఉదాహరణకు ఫలితం, కఫం అనే మాటల్లో మూల 'ఫ' వర్ణాన్ని, నలభై, యాభై మాటల్లో 'భ' వర్ణాన్ని, 'f' అనే దంతోష్ఠ్య ఊష్మంగా కొందరు ఉచ్చరిస్తున్నారు.

తెలంగాణాలో ఉర్దూ చదువుకున్నవారి భాషలో ఖ (خ) గ (غ) అనే కంఠ్యోష్మాల ఉచ్చారణ ఉర్దూ పర్షియన్ మాటల్లో వినిపిస్తుంది. సాధారణ వ్యవహారాల్లో వినపడదు. Z ఉచ్చారణ తెలుగు మాటల్లో గాజు, బూజు వంటి చోట్ల పదాల మధ్య వినిపిస్తుంది. తెలంగాణా వ్యవహర్తల్లో జరా, జరూరు వంటి ఉర్దూ మాటల్లో పదాదిన కూడా వినిపిస్తుంది.

ఇతర భాషల నుంచి వచ్చి తెలుగులో స్థిరపడిన అచ్చులు లేవు. 'ఎ' కార వివృతోచ్చారణ తెలుగులో 15, 16 శతాబ్దాల నాటికే ఉంది. ఈనాటి ఉత్తర తీరాంధ్రుల భూతకాల క్రియా రూపాల్లో చెప్పాడు. తన్నాడు అనే చోట్ల దీర్ఘ 'ఆ' కారంతో రాతలో సూచించిన దాని ఉచ్చారణ వివృతమైన 'ఏ' కారం, bank, cash, class, glass వంటి ఇంగ్లీషు మాటల తెలుగు ఉచ్చారణలో ఇది వినిపిస్తుంది.

ఈ రకమైన ఇతర భాషల స్వల్ప ప్రభావాన్ని వదిలేస్తే తెలుగు దేశ్య శబ్దాలకు ఈ కింది విధంగా వర్ణ నిర్ణయం చెయ్యవచ్చు.

*నేటి తెలుగు భాషలో వర్ణాలు :*

హల్లులు

| | | ఓష్ఠ్య | దంత్య | దంతమూలీయ | మూర్ధన్య | తాలవ్య | హనుమూలీయ (కంఠ్య) |
|---|---|---|---|---|---|---|---|
| స్పర్శ | శ్వాస | ప | త | | ట | | క |
| | నాద | బ | ద | | డ | | గ |
| స్పృష్టోష్మ | శ్వాస | | | | | చ | |
| | నాద | | | | | జ | |
| ఊష్మ | | | | స | | | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| అనునాసిక | మ | న | ణ | | |
| పార్శ్విక | | ల | ళ | | |
| కంపిత | | | | | |
| | వ | ర | | య | అంతస్థ |

అచ్చులు

| | ముందువి (front) | మధ్యవి (central) | వెనకవి (back) |
|---|---|---|---|
| పైవి (high) | ఇ ఈ | | ఉ ఊ |
| నడిమివి (mid) | ఎ ఏ | | ఒ ఓ |
| కిందివి (low) | | అ ఆ | |

*వర్ణాల ఉచ్చారణ :* హల్లు ఉచ్చారణ స్థాన, కరణ, ప్రయత్న భేదాల్ని బట్టి ఉంటుంది. అడ్డంగా చేసిన విభజన ప్రయత్న భేదాల్ని నిలువుగా చేసిన విభజన స్థానభేదాల్ని, సూచిస్తుంది. ఒక్క ఓష్ఠ్య ధ్వనులు తప్ప మిగతా హల్లులన్నిటికీ నాలుక కరణం. అంటే ముఖ వివరంలో పై నాలుక భిన్న ప్రదేశాల్లో తాకుతూ ఊపిరి తిత్తుల్లో నుంచి తీసుకున్న గాలిని వదలటం వల్ల వివిధ ధ్వనులుత్పన్నమవుతున్నై. ఓష్ఠ్య ధ్వనుల ఉత్పత్తిలో రెండు పెదవులూ సమభాగస్వాములు.

ఊపిరితిత్తుల నుంచి తీసుకున్న గాలిని స్థాన కరణాలు కలిసి పూర్తిగా నిరోధించి బయటికి వదలటం వల్ల స్పర్శ ధ్వనులేర్పడతై. ఉచ్చారణ స్థానం దగ్గర సన్నని గాలిని పూర్తిగా నిరోధించకుండా కరణంతో కొద్దిపాటి సందు చేసి ఒరపిడితో గాలిని వదిలితే ఊష్మధ్వనులేర్పడతై. నిరోధించిన గాలిని ఒక్కసారే వదలకుండా ఒరపిడితో వదిలితే స్పృష్టోష్మధ్వనులేర్పడతై. స్పర్శోచ్చారణకు తీసుకున్న గాలి కొంతభాగం నాసికాద్వారాల నుంచి వదలటంవల్ల మ, న, ణ అనే అనునాసిక వర్ణాలేర్పడుతున్నై. ఉచ్చారణ స్థానం నుంచి గాలిని కరణానికి ఒక పక్కనుంచిగాని, ఇరుపక్కల నుంచి వదిలితే పార్శ్వక ధ్వనులేర్పడతై. కరణం స్థానాన్ని వడివడిగా పలుమార్లు తాకటం వల్ల కంపితం ఏర్పడుతుంది. ఆయా స్థానాల వద్ద ఒరపిడి లేకుండా గాలిని వదలటంవల్ల య, వ, లు ఏర్పడతై. ఊపిరితిత్తుల్లో నుంచి గాలి వచ్చేటప్పుడు గొంతులో నాదతంత్రుల్ని కదలకుండా ఉంచితే శ్వాసధ్వనులూ, కదలనిస్తే అవి కంపించటం వల్ల నాదధ్వనులూ ఏర్పడతై. హల్లులన్నిట్లో శ్వాసనాద భేదం ఉండొచ్చు. కాని తెలుగులో అట్లాంటి భేదం ఒక్క స్పర్శధ్వనుల్లోనే

ఉంది. (స్పృష్టోష్మాలు కూడా స్పర్శాలుగా గ్రహించవచ్చు). 'స' వర్ణం ఎప్పుడూ శ్వాసంగానే ఉంటుంది. మిగతా హల్లులన్నిటికీ తెలుగులో నాదోచ్చారణే ఉంది.

గాలి వదిలేటప్పుడు నాలుకకీ మూర్ధానికీ ఉన్న అంతరాన్ని బట్టి నాలుకలో ముందు మధ్య వెనుక భాగాల పాత్రను బట్టి, పెదవులు ఉండే స్థితిని బట్టి అచ్చుల విభజన ఉంటుంది. తెలుగులో నాలుక ముందు భాగంతో ఉచ్చరించే *ఇ, ఈ, ఎ, ఏ* లను తాలావ్యాచ్చులనీ, వెనుక భాగంతో ఉచ్చరించే *ఉ, ఊ, ఒ, ఓ* లను పెదవుల స్థితిని పరిగణిస్తే ఓష్ఠ్యాచ్చులనీ, నాలుక కదలకుండా ఉండటం వల్ల *అ, ఆ* లను కంఠ్యాచ్చులనీ అంటారు. ఒక్కో స్థానంలో ఇచ్చిన జంట అచ్చుల్లో మొదటిది హ్రస్వం, రెండోది దీర్ఘం. సాంప్రదాయికంగా *ఐ, ఔ* లను రాసే పద్ధతిని బట్టి వక్రతమాలని వ్యవహరిస్తారు. అయితే వీటిని క్రమంగా *అయ్, అవ్* లుగా రాయవచ్చు. *య, వ* ల మీద అచ్చులు వికల్పంగా లోపించడంవల్ల ఇవి ఏర్పడతై. వీటికి *ఐ, ఔ*లు కేవలం వికల్ప చిహ్నాలు మాత్రమే. ఉదా: పయిన - పైన అయితే - ఐతే, అవును - ఔను, కవులు - కౌలు.

*వర్ణాల పరిసర నియతోచ్చారణ :* పదంలో ఒక వర్ణం ఒకటికన్నా ఎక్కువచోట్ల వచ్చినప్పుడు ఆ వర్ణానికి ఆ పరిసరాన్ని బట్టి ఉచ్చారణలో భేదం ఉంటుంది. ఇవి పరిసర నియతోచ్చారణ భేదాలు. సాధారణంగా ఈ భేదాలు వ్యవహర్తలు గుర్తించలేరు. ఈ భేదాలు పరిసర ధ్వన్యుచ్చారణకు కొంత అనుకూలంగా ఉంటై. కొన్ని భేదాలు ధ్వన్యుత్పత్తి విధాన విహితాలై ఉంటై. వ్యవహర్తలు పైకి గుర్తించకపోయినా, ఈ భేదాలను నియతంగానే ఉచ్చరిస్తారు గనుక వాటిని గురించి కూడా తెలుసుకోటం అవసరం.

*హల్లుల ఉచ్చారణ భేదాలు :* దాదాపు అన్ని హల్లులకూ, ముఖ్యంగా స్పర్శాలకు, పదాదిన, ద్విరుక్తిలో, వ్యంజన సంయోగంలో, అధిక స్పృష్టోచ్చారణ, అచ్చుల మధ్య అల్ప స్పృష్టోచ్చారణ ఉంది. ఉచ్చరించే అవయవాల కండరాలు అధిక స్పృష్టోచ్చారణలో బిగుసుకొని ఉంటై, అల్ప స్పృష్టోచ్చారణలో వదులుగా ఉంటై. ఈ భేదం నాద ధ్వనుల్లో బాగా గుర్తించవచ్చు. ఉదా: గనులు-పగలు - పగ్గం, దరువు - చెదలు - గద్ద అనే మాటల్లో గ, ద ల ఉచ్చారణను పోల్చి చూసుకోవచ్చు. ఈ రకమైన ఉచ్చారణ భేదం కొన్ని భాషల్లో అర్థభేదాన్ని కలిగించవచ్చు.

స్పృష్టోష్మాల్లో 'జ' వర్ణానికి అచ్చుల మధ్య ఉచ్చారణ శైథిల్యం ఉంది. గాజు, బాజు వంటి మాటల్లో 'జ' కారోచ్చారణ ఇంగ్లీషులో 'Z' అనే గుర్తుతో సూచించే ధ్వనికి

సమానం. అచ్చుల మధ్య అద్విరుక్త 'చ' వర్ణం రావటం తక్కువ. వచ్చినా, దానికి స్థైర్యం లేదు. స్పృష్టోష్మ ఉచ్చారణ శిథిలమైతే స్పర్శత్వం పోయి ఊష్మలక్షణం మిగులుతుంది.

ప్రాచీన వ్యాకర్తలు పేర్కొన్నట్లు చ, జ లకు పరంలో వచ్చే అచ్చులను బట్టి రెండేసి ఉచ్చారణ భేదాలున్నై. ఇ, ఈ, ఎ, ఏల ముందు తాలవ్యోచ్ఛారణ అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ ల ముందు దంత్యోచ్చారణ ఉంది. తొలుత ఉన్న అచ్చు సంధిలోపోయినా ఈ దంత్య, తాలవ్య భేదం ఉంటుంది.

తెలుగు దేశ్య శబ్దాల్లో 'స' వర్ణమొక్కటే ఊష్మం. తాలవ్యాచ్చుల ముందు తాలవ్యోచ్చారణ ఉంది. ఈ రకపు ఉచ్చారణకు 13వ శతాబ్దినాటికే శాసన లేఖనంలో 'శ' కార ప్రయోగాన్ని బట్టి చెప్పవచ్చు.

స్పర్శ వర్ణాల ముందు వచ్చే అనునాసికోచ్చారణ ఆస్పర్శ స్థానికమే. దాన్ని ఏదో అనునాసిక వర్ణంతో ముడి పెట్టడం అంత సులభమైన పనికాదు. మిగిలిన పరిసరాల్లో 'మ' వర్ణానికి కొన్ని మండలాల్లో - ముఖ్యంగా తీరాంధ్రంలో - రెండు రకాల ఉచ్చారణలున్నై. పదాదిన, ద్విరుక్తిలో పెదవులు పూర్తిగా మూసిన ఉచ్చారణ ఉంది. అచ్చుల మధ్య, పదాంతంలో అనునాసిక వకారోచ్చారణతో తుల్యమైన ఉచ్చారణ ఉంది. ఈ రకమైన ఉచ్చారణ తెలుగు సంస్కృత శబ్దాల భేదం లేకుండా వ, స, హల ముందు కూడా ఉంది. ఉదా: సంవత్సరం, కంసాలి, మాంసం, సింహం మొ॥ ఇందులో కంసాలి దేశ్య శబ్దమే. దీని పూర్వ రూపం కమసాలి. దేశ్య శబ్దాల్లో అనునాసిక వర్ణం స్పర్శ వర్ణాల ముందు తప్ప ఇతర హల్లుల ముందు రాదు. ఇదొక్కటి అపవాదం. 'మ' వర్ణానికి అనునాసిక వకారోచ్చారణ 16-17 శతాబ్దుల నాటికే ఉన్నట్లు శాసనాధారలున్నై.

సంస్కృత, హిందూస్తానీ మాటల్లో అచ్చుల మధ్య వచ్చే మ వర్ణానికి అనునాసిక 'వ' కారోచ్చారణ లేదు. కాని కొందరు వ్యవహర్తలు ఈ భేదాన్ని విస్మరించి సామాను, ప్రమాదం, సమితి వంటి ఇతర భాషా పదాలను కూడా అనునాసిక 'వ' కారంతో ఉచ్చరిస్తారు.

కొందరు వ్యవహర్తలు ఇతర భాషా పదాల వ్యవస్థను భిన్నంగా ఉంచే ప్రయత్నం చేస్తే, మరికొందరు వాటిని తమ భాషా వ్యవస్థలో కలుపుకొనే ప్రయత్నం చేస్తారు. అందువల్లనే తత్సమ తద్భవ విభాగం వ్యవహర్తలను బట్టి భేదిస్తుంది.

వాక్యంలో పరోక్ష విధిలో అని శబ్దానికి ముందు వచ్చే ఆగమ మ కారానికి అచ్చుల మధ్య అయినా పెదవులు మూసిన ఉచ్చారణే ఉంది. ఉదా. వాళ్ళు ఇంటికి

*వెళ్ళం* అన్నారు. *వాళ్ళు ఇంటికి వెళ్ళమన్నారు.* అనేచోట్ల మొదటి వాక్యం వ్యతిరేకార్థకం. అక్కడ మ కారానికి అనునాసిక వకారోచ్చారణ ఉంది. కాని రెండో వాక్యంలో మ కారం అగమంగా వచ్చింది. ఇది పరోక్ష విధి. ఇక్కడ పెదవులు మూసిన ఉచ్చారణ ఉంది. బహుశా ప్రాచీన భాషా వ్యవస్థలో వెళ్లుము, చూడుము అనే విధంగా విధి ప్రత్యయంగా ఉన్న ము ఆధునిక భాషలో ఈ ఉచ్చారణతో ఈ ఒక్కచోట ఇట్లా మిగిలిందేమో.

*వ* వర్ణానికి పదాదిన, ద్విరుక్తిలో అచ్చుల మధ్య దంత మూలీయోచ్చారణ ఉంది. సంధిలో దంత్య వర్ణం ముందు దంత్యంగా మారుతుంది. *దాని+తో* అనే పదాన్ని సంధి చేసి, చెయ్యకుండా ఉచ్చరించి చూస్తే ఈ భేదాన్ని గుర్తించవచ్చు. ణ వర్ణానికి గుర్తించదగిన ఉచ్చారణ భేదాలు లేవు.

*ల* వర్ణం *న* వర్ణం లాగే సంధిలో పరవర్ణంతో సమీకృతమవుతుంది. *పాల+తో* అనే పదాన్ని సంధితో ఒకసారి, సంధిలేకుండా ఒకసారి ఉచ్చరించి చూస్తే ఈ భేదం తెలుస్తుంది. సంధిలో ఇక్కడ దీనికి దంత్యోచ్చారణ ఉంది. *న, ల,ళ* పరంలో మూర్ధన్యంతో సమీకృతమయినప్పుడు వాటికి మూర్ధన్యోచ్చారణ వస్తుంది. అంతస్థల్లో 'వ' కారానికి *ఇ, ఈ, ఎ, ఏ* ల ముందు దంతోష్ఠ్య ఉచ్చారణ, *ఉ, ఊ, ఒ, ఓ* ల ముందు ఉభయోష్ఠ్య ఉచ్చారణ ఉంది. *అ, ఆ* లముందు కూడా ఉభయోష్ఠ్య ఉచ్చారణ ఉన్నా ఒక్కోసారి దంతోష్ఠ్య ఉచ్చారణ వినిపించవచ్చు.

*య* వర్ణానికి గుర్తించదగిన ఉచ్చారణ భేదాలు లేవు.

*అచ్చుల ఉచ్చారణ భేదాలు :* అచ్చులన్నిటికి ఏకధాతుక పదా (monomorphic words ) ల్లో సంవృత వివృత ఉచ్చారణ భేదాలున్నై. పరాక్షరంలో *ఇ, ఈ, ఉ, ఊ* అనే అచ్చులున్నప్పుడు వాటితో సమమైన ఎత్తు కలిగిన సంవృతోచ్చారణ ఉంటుంది. పరంలో *ఎ, ఏ, ఒ, ఓ* లున్నప్పుడు కొద్దిపాటి వివృతోచ్చారణ ఉంటుంది. పదాక్షరంలో అ, ఆ లున్నప్పుడు అధిక వివృతోచ్చారణ ఉంటుంది.

ఈ వివృతి *ఎ, ఏ* వర్ణాల్లో వచ్చినప్పుడు చాలా మంది వ్యవహర్తలు గుర్తిస్తారు. ఉదా: మేకు-*మేక*. పరాక్షరంలో *ఎ* ఉన్నప్పుడు వచ్చే వివృతోచ్చారణను చాలా మంది శాస్త్రజ్ఞులే గుర్తించ నిరాకరించారు. ఉదా: కోడె, పాడె మొ॥ పరాక్షరంలో అ వర్ణం ఉన్నప్పుడు పూర్వాచ్చులో వచ్చే వివృతిని గిడుగు రామమూర్తి వంటి వారు చాలా పూర్వమే గుర్తించారు. అయితే ఈ స్వర వివృతి మధ్యాంధ్రం కన్నా మధ్య తీరాంధ్రంలో, అంతకన్నా ఎక్కువ ఉత్తర తీరాంధ్రంలో, ఉన్నట్లు గుర్తించగలుగుతాం. సాధారణంగా ఈ వివృతి ఇతర

భాషా పదాల్లో ఉండదు. కాని పేపరు, ప్రేమ వంటి ఇంగ్లీషు, సంస్కృత శబ్దాలకు కూడా ఈ వివృతోచ్చారణ కొందరు వ్యవహర్తల్లో వ్యాపించినట్లు గుర్తించవచ్చు.

దీర్ఘాచ్చులు మొదటి అక్షరంలోనే ఉంటై. పద మధ్యంలో అరుదు. పదాంతంలో అత్యంత విరళం. ఓ వర్ణం నేటి భాషలో ప్రథమేతరాక్షరాల్లో రాదు.

పదాంతంతో *ఇ, ఉ,* అలు అన్ని పరిసరాల్లో వస్తయ్. ఎ వర్ణం మొదటి అక్షరంలోనూ, పదం చివరనూ వస్తుంది. పదం చివర వచ్చినప్పుడు కూడా దీనికి వివృతోచ్చారణ ఉంది. *చెంబు-మంచె-ఎన్ను-గిన్నె* అనే మాటల్లో ఎ వర్ణోచ్చారణ భేదాన్ని గుర్తించవచ్చు. పదాంతంలో చివరి మ కారం ముందు (అంటే 'సున్న'కు ముందు) వచ్చినప్పుడు కూడా ఎ వర్ణానికి వివృతోచ్చారణ ఉంది. వ్యాకరణ కార్యంలో ఇది దీర్ఘమై. ఈ వివృతి అధికమవుతుంది. *పందెం+లు* > *పందేలు.* దీని ఉచ్చారణను *కుందేలు* అనే మాటతో పోల్చి చూస్తే ఈ భేదం బాగా తెలుస్తుంది.

*ఇ, ఈ, ఎ, ఏ* లు తాలవ్యాచ్చులు. *ఉ, ఊ, ఒ, ఓ* లు ఓష్ఠ్యాచ్చులు. పదాది తాలవ్యాచ్చుల ముందు *య* వర్ణం, ఓష్ఠ్యాచ్చుల ముందు *వ* వర్ణం వికల్పంగా వస్తుంది. ఉదా: ఇక్కడ - *యిక్కడ*, ఎప్పుడు - *యెప్పుడు*, ఉంది - వొంది, ఒకటి - వొకటి. ఈ రకమైన ఉచ్చారణ అలవాటువల్ల చాలామంది తెలుగు వారు ear-year; oats-votes అనే ఇంగ్లీషు మాటల మధ్య ఉచ్చారణ భేదాన్ని చూపించలేక పోతారు. ఈ *య, వ* ల ఆగమం అజాది పదాలు వాక్య మధ్యమైనప్పుడు నిత్యంగా వస్తుంది; మా యిల్లు, మా వూరు. కొందరి ఉచ్చారణలో సంబంధ బోధక అకారాది శబ్దాలు వాక్య మధ్యమైనప్పుడు కూడా 'య' కారం వస్తుంది; మాయమ్మ, మా యన్న.

## వర్ణవ్యాప్తి

ఏ భాషలో అయినా అన్ని వర్ణాలకు ఒకే శక్తి, ఒకే వ్యాప్తి ఉండవు. ఒక పదంలో వర్ణాల వ్యాప్తి మీద రకరకాలయిన విధి నిషేధాలను భాష ఏర్పరచుకుంటుంది. రెండు భాషల మధ్యే కాక రెండు మాండలికాల మధ్య కూడా ఈ రకం భేదం ఉండవచ్చు.

ఈ కింద చెప్పబోయే వర్ణవ్యాప్తి విశేషాలు తెలుగు దేశ్య శబ్దాలను మాత్రమే ఉద్దేశించి చేసినవి. ఇతర భాషా శబ్దాల ద్వారా ఆయా నియమాలు ప్రవేశించినా అవి ఆ పదాలకే పరిమితం.

(1) *య* పదాదిన ఉండదు. యాభై, యాస అనే మాటల్లో కనిపించే *య* కారం రాత అలవాటు వల్ల వచ్చింది. వర్ణ విధాయకంగా రాస్తే ఏభయ్, ఏస అని రాయాల్సి

ఉంటుంది. పదాది వ కారంలో పరంలో నిరోష్ఠ్యాచ్చులున్నప్పుడే - అంటే ఇ, ఈ, ఎ, ఏ, ఆ లున్నప్పుడు మాత్రమే ఉంటుంది. వుంది, వూరు అనే మాటల్లో అప్పుడప్పుడు రాతలో కనిపించే వ కారానికి వర్ణత్వం లేదు. అంటే అర్థభేదక శక్తి లేదు.

(2) తెలుగు మాటల్లో మూర్ధన్య వర్ణాలు సహజంగా పదాదిన ఉండవు. కాని చాల అరుదుగా ట, డలు పదాదిన కనిపిస్తున్నై. ఉదా: టక్కరి, టెంకాయ, టెంకె, డేకు, డోకు, డెక్క, డెబ్బై, డేగ, తెలంగాణాలో కొన్ని చోట్ల తొంభై శబ్దానికి తొంభై అనే రూపం ఉంది. ణ, శ వర్ణాలు పదాదిన లేవు.

(3) పదాదిన ద్విరుక్త సంయుక్త వ్యంజనాలుండవు. ప్రాచీన భాషలో వర్ణవ్యత్యయం వల్ల ఏర్పడ్డ క్రంత, గ్రద్ద, త్రుప్పు, ప్రాత, బ్రతుకువంటి మాటల్లో రెండో వ్యంజనమైన రేఫ చాలాకాలం క్రిందటనే లోపించింది; కాని సాహిత్యంలో చాలాకాలం నిలిచింది. సాహిత్య పరిచయం వల్ల కొందరి భాషలో పునః ప్రవేశం చేసి ఉండవచ్చు.

(4) స్పర్శాల ముందు స్పృష్టోష్మాల ముందు అనునాసిక వర్ణం ఆవర్గజమై ఉంటుంది, కాన్పు, పాన్పు అనే అపవాదాలు న కారం మీది స్వరం లోపం వల్ల ఏర్పడ్డయ్. స్పర్శేతర వ్యంజనాల ముందు అనునాసిక వర్ణం ఉండదు.

(5) త్ర, ంద్ర అనే సంయోగాలు నేటి తెలుగులో కనిపిస్తున్నై. పాత్రం అనే మాటకు *పాత్తరం* అనే రూపాంతరం ఉంది. కొండ్ర, తండ్రి, మండ్రగబ్బ అనే మాటలో డ వర్ణాన్ని ణ-ర ల సంయోగంలో వచ్చిన ధ్వన్యాగమంగా గ్రహించవచ్చు. అప్పుడు తెలుగులో మూడు హల్లుల సంయోజన లేదనవచ్చు.

తెలంగాణాలో అర్క, ఎన్క, చెల్క, గట్కి వంటి మాటల్లో వర్ణ సంయోజనలు మధ్య స్వర లోపం వల్ల ఏర్పడ్డయ్. ఇట్లా అచ్చుకు పూర్వం ఉన్న హల్లు దంతమూలీయ, మూర్ధన్య వర్ణాల్లో ఒకటయి ఉంటుంది. (ట, డ, న, ల, రలు).

(6) మ, య వర్ణేతర వ్యంజనాలు పదాంతంలో రావు. య వర్ణమైనా సంఖ్యా పదాల చివరే కనిపిస్తున్నది; ఇరవై, ముప్ఫై, నలభై, యాభై, అరవై, డెబ్బై, ఎనభై, తొంభై, ఇక్కడ ఐ = అయ్.

(7) ఏక శబ్దంలో స, ణ వర్ణాలకు ద్విత్వం లేదు - కస్సు, బుస్సు అనే ధ్వన్యనుకరణాలకు ఇక్కడ పరిగణన లేదు. తెలంగాణాలో కొన్నిచోట్ల లెస్స అనే మాట వాడతారు. ణ

వర్ణానికి ద్విత్వం అరుదుగా కొన్ని మాటల్లో ఉంది. ఉదా: గొణ్ణెం, దణ్ణం, దణ్ణెం వంటివి కొద్దిగా ఉన్నై. గొణ్ణెం శబ్దానికి గొళ్ళెం అనేది రూపాంతరం ఉంది. దణ్ణం < దండం నుంచి, దణ్ణెం < దండెం నుంచి ఏర్పడ్డయ్.

(8) ఏకశబ్దంలో ళ్ళ అనే సంయోజన చాలా అరుదుగా ఉంది. నామాలు : కళ్ళం, కళ్లె, కళ్లెం, గొళ్లెం, పళ్లెం; ముళ్ళు, వేళ్ళు, క్రియలు; కుళ్లు, తుళ్లు. వీటిల్లో ఎక్కువ భాగం హల్సమీకరణం వల్ల ఏర్పడ్డాయ్. పదాది దీర్ఘాచ్చు తరవాత ఏకశబ్దంలో ద్విత్వహల్లూ, సంయుక్త హల్లూ ఉండవు. అమ్మ, నాన్న, బొమ్మ, మామ్మ వంటి సంబంధ బోధక శబ్దాలు ఇందు కపవాదాలు.

(9) ధాతువుల్లో మొదటి అక్షరంలో మాత్రమే దీర్ఘాచ్చు ఉంటుంది. నిజానికి నామాల్లోనూ అంతే. కాని, కొన్ని జంతు, పక్షి, వృక్ష, నగర వాచక శబ్దాల్లో ఊ, ఏ, ఓ, ఆ, అనే దీర్ఘాచ్చులు మధ్యలో కనిపిస్తున్నై. ఇవి ఒకప్పుడు పదాది స్వరాలే అయి, కాలక్రమాన పూర్వశబ్దంతో సమ్మిశ్రితమై విడదీయరాని ఏకపదాలయినాయి. ఉదా: ఇల్లూరు, కల్లూరు, కుందేలు, తాబేలు, పొట్టేలు, పూరేడు, గన్నేరు, తంగేడు, నేరేడు, పల్లేరు, మారేడు, చెంబేడు, ఒంగోలు, అడ్డాడ, తల్లాడ మొ॥ వీటిలో మొదటి అక్షరం గురువు కావటం గమనించదగింది.

(10) ''ఒ'' వర్ణం కూడా మొదటి అక్షరంలోనే ఉంటుంది.

(11) మూడక్షరాల మాటల్లో మధ్యాచ్చు అ, ఇ, ఉ, అనే హ్రస్వాచ్చు మాత్రమే ఉంటుంది. చివరి అచ్చు వీటితో బాటు 'ఎ' వర్ణం కూడా కావచ్చు. చివరి అచ్చు 'ఉ' అయితే మధ్య అచ్చు 'ఇ' ఉండదు.

(12) ధాతువుల్లో మొదటి అచ్చు మాత్రమే దీర్ఘాచ్చు. అన్నిటినీ అజంతాలుగా గ్రహిస్తే చివరి అచ్చు ఎప్పుడూ 'ఉ' వర్ణమే. మూడక్షరాల ధాతువుల్లో ఒక్క తెలియు మినహాయిస్తే అన్నీ ఉన్మధ్యాలే. ఇన్మధ్య ధాతువు లెప్పుడూ పరిమితమే. అన్మధ్య ధాతువులు ప్రాచీన భాషలో ఎక్కువగా ఉండేవి. శ్రీనాథుడి కాలానికే ( 14వ శతాబ్దం) అవి ఉన్మధ్యాలుగా మారిపోయినై.

ఈ పై నియమాలు ఏకశబ్ద పరిమితికే వర్తిస్తయ్. భిన్న శబ్దాలు కలిసిన మాటల్లో ప్రకృతి ప్రత్యయ సమ్మేళనవల్ల ఎన్నో వర్ణ సంయోజనాలు సాధ్యం. వస్తాడు, చెప్తుంది, చేద్దాం, వచ్చుద్ది, కొట్టుద్ది మొ॥.

## సంధి

ప్రాచీన కావ్యభాషలో 'ఉ'కార సంధి నిత్యం గానూ, 'అ' కార సంధి విరళంగానూ, ఇ కార సంధి వికల్పంగానూ ఉండేవి. అనంతర కావ్యభాషలో 16వ శతాబ్దం నుంచి అన్ని రకాల సంధులూ కనిపిస్తున్నై. శాసన భాషలో ఇంకా పూర్వం నుంచే కనిపిస్తున్నై. ఆధునిక వ్యవహార భాషలో అన్ని అచ్చులకూ ఉచ్చారణ వేగాన్ని అనుసరించి సంధి జరుగుతుంది. ఈ స్థితి అతి ప్రాచీన కాలం నుంచి ఉండి ఉండాలి. అచ్చు లోపాన్ని సంధిగా పరిగణిస్తారు. తత్పర్యవసానంగా హల్లుల్లో వచ్చే మార్పులను హల్సంధిగా పరిగణించాలి.

1. దగ్గరగా వచ్చిన రెండచ్చుల్లో పూర్వ హ్రస్వాచ్చు లోపిస్తుంది. ఉదా: ఆయన+ ఎవరు = ఆయనెవరు, వారు+ఉన్నారు = వారున్నారు మొ॥

2. లోపించిన హ్రస్వాచ్చు తాలవ్యమైతే పరాచ్చుకు తాలవ్యత ప్రాపిస్తుంది. ఈ తాలవ్య భేదాలను సూచించటానికి తెలుగులో గుర్తుల్లేవు. చెప్పి+ఉంటాడు, చెప్పి+ఒచ్చాడు, బండి+అంతా మొ॥

3. స్వరాది ప్రత్యయం పరమైనప్పుడు సంధికి వికల్పత లేదు. ఉదా: వాడు+ఏ= వాడే, మూర+ఎడు = మూరెడు, వచ్చింది+ఆ=వచ్చిందా ?

4. రెండు హల్లుల మధ్య ఈ కింది పరిసరాల్లో హ్రస్వాచ్చు లోపిస్తుంది.

a. శ్వాసనాద భేదం తప్పించి మిగతా అన్ని అంశాల్లోనూ సమమయినప్పుడు.

b. పూర్వహల్లు ల, నలలో ఒకటయి పరహల్లు దంత్య, దంతమూలీయ, తాలవ్య, మూర్ధన్యాల్లో ఒకటైనప్పుడు.

c. పూర్వహల్లు మూర్ధన్యమై పరహల్లు దంతమూలీయమయినప్పుడు.

d. పూర్వహల్లు దంత్యమై పరహల్లు చ, జ లయి నప్పుడు.

ఉదా : (a) చేప+పిల్ల = చేప్పిల్ల; ఇరుకు+కంత = ఇరుక్కంత; పిరికి+గుండె= పిరిగ్గుండె; (b) కాలి+తో = కాల్తో; నూనె+లో=నూన్లో, తల+నూనె=తల్నూనె. పాల+డబ్బు = పాల్డబ్బు, పాల+చెంబు = పాల్చెంబు (c) నోటి+లో= నోట్లో, వాడి+ని = వాణ్ణి; (d) పాత+చింతకాయ = పాచ్చింతకాయ.

ఈ సంధివల్ల పూర్వపరాచ్చుల్లో అచ్చుతో అంతకు ముందే ఉన్న తాలవ్య, వివృతి భేదాలు స్వర లోపంతో భేదక లక్షణాలుగా మారతై.

పరవ్యంజనం తరువాత ఉన్న అచ్చుకు కూడా ఈ లక్షణాలు వ్యాపిస్తయ్. వీటన్నిటినీ చూపించటానికి తెలుగు లిపిలో గుర్తులు లేవు.

5. స్వర లోపానంతరం హల్లుల్లో కొన్ని సమీకరణాలు జరుగుతై.

a. మూర్ధన్యీకరణ: మూర్ధన్య వర్ణానికి పూర్వపరాల్లో ఎక్కడ వచ్చినా ల, నలు మూర్ధన్యత్వాన్ని పొందుతై.

b. అన్యోన్య సమీకరణ: డ+ల > ళ్ళ, డ+న > ణ్ణ, వ్యాకరణ కార్యంవల్ల కాక తొలి నుంచీ అద్విరుక్తమైన 'డ' వర్ణమున్నప్పుడు ఈ సమీకరణ జరుగుతుంది.

c. స్పృష్టోష్మత : స్పృష్టోష్మ హల్సంయోగంలో దంత్య త, దలు స్పృష్టోష్మాలుగా అంటే చ, జలుగా మారుతై.

d. శ్వాసనాద పరవర్ణ సమీకరణ : పరహల్లు శ్వాస నాదాల్లో ఏది అయితే పూర్వహల్లు అదే అవుతుంది.

ఉదా: పాల+డబ్బా = పాళ్డబ్బా; కోడు+లు = కోళ్ళు, నూనె+డబ్బా = నూణ్డబ్బా, వాడి+ని = వాణ్ణి, పాత+చెప్పు = పాచ్చెప్పు, పాత+జల్లెడ = పాజ్జల్లెడ, ఇరుకు+గది = ఇరుగ్గది, సంధి జరగటానికి వీలున్న రెండు పరిసరాలు వెంట వెంటనే ఉండి సంధి జరిగితే మూడు హల్లుల సంయోగం వస్తుంది. అట్లాంటి చోట్ల పరసంధి ముందుగా జరిగి పూర్వ సంధిని నిరవకాశం చేస్తుంది.

ఉదా : మాట+లు = మాట్లు

మాట + లు + రావు = మాట్లావు

గుడ్డ + లు = గుడ్లు

గుడ్డ + లు + లేవు = గుడ్లల్లేవు

(గుడ్లు+లు+లేవు అనేచోట్ల మొదటి పరిసరం సంధీతర వ్యాకరణ పరిసరం. అక్కడ స్వరలోపం వికల్పం కాదు. అందువల్ల 'గుడ్లు లేవు' అనే ఉంటుంది). కొన్ని చోట్ల పూర్వపర సంధుల్లో ఏదన్నా జరగవచ్చు. ఉదా: దారి+లు+లేవు = దార్లులేవు; కారు+లు+లో = కార్లలో, కారుల్లో. సంధికి ప్రమేయం ఉన్న హల్లులు ఏకస్థానికాలయి నప్పుడు పూర్వపర సంధుల్లో ఏ ఒకటైనా జరగవచ్చు.

6. ద్విరుక్త హల్లు ఇంకో హల్లుముందు అద్విరుక్తమవుతుంది. బహువచనాది ప్రత్యయాలు చేరినప్పుడు స్వరలోపం వల్ల ఈ రకం పరిసరం ఏర్పడుతుంది.

చెట్టు + లు = చెట్లు
గుడ్డు + లు = గుడ్లు
తొట్టి + లో = తొట్లో

## నామపద నిష్పత్తి

తెలుగు నామాలు చాలా వరకు సిద్ధాలు. ఇతర భాషా భాగాల నుంచి కొన్ని ప్రక్రియల ద్వారా నామాలను నిర్మించుకునే ప్రక్రియ అన్ని భాషలలాగే తెలుగులో కూడా ఉంది.

*బహువచనం :* నేటి భాషలో అరుదుగా 'రు' అనే ప్రత్యయం మనుష్య వాచక శబ్దాల్లో కనిపిస్తుంది. నలుగురు, ముగ్గురు, ఇద్దరు, ఒకరు వంటి పదాల్లో రు బహువచన ప్రత్యయమే. ప్రాచీన భాషలో దీని ప్రవర్తన అధికంగా ఉన్నట్టు కొంత శాసన భాషను బట్టి, అంతకన్న ఎక్కువగా కావ్యభాషను బట్టి ఊహించవచ్చు. ఆధునిక భాషలో లు బహువచన ప్రత్యయం.

సాంప్రదాయిక వ్యాకర్తలు గుర్తించినట్టుగా తెలుగులో కొన్ని ద్రవ్య, సస్య, వాచక శబ్దాలు నిత్య బహువచనాంతాలు, పాలు, పెసలు, ఉసిళ్ళు, పేలాలు. వీటికి వ్యస్తంగా ఏక వచన ప్రయోగం లేదు. సర్వనామాల బహువచన రూపాల నిర్మాణం వేరుగా ఉంటుంది. వాటిలో బహు వచన ప్రత్యయం వేరు చెయ్యలేం.

మిగిలిన శబ్దాలకు **లు** ప్రత్యయం చేర్చటం వల్ల బహువచన నామాలేర్పడతై. **లు** - ళు అనే రూపాల్లో ళు ప్రాచీన మైనా **లు**, ప్రత్యయమే అధిక వ్యాప్తిని చెంది పరిసర స్వతంత్ర ప్రతిపత్తిని పొంది రూపసాధన ప్రక్రియలో ప్రాథమిక సపదాంశం (basic allomorph) కాగలిగింది. బహువచన ప్రత్యయం చేరినప్పుడు నామ ప్రాతిపదికలో కొన్ని మార్పులు జరుగుతై.

(1) దీర్ఘాంత శబ్దాల్లో ఎటువంటి మార్పు ఉండదు. ఇవి సాధారణంగా ఇతర భాషా పదాలు. ఉదా: లంగాలు, లుంగీలు. కొన్ని తాలవ్య హలంతమైన ఇతర భాషా పదాలకు ఇ వర్ణం చేరి బహువచనంలో దీర్ఘమవుతుంది; చర్చీలు, వాచీలు. కొందరి భాషలో సంచి - సంచీలు అని ఉంటుంది. *సంచులు* అనే రూపం కూడా ఉంది.

(2) *అ, ఎ* లు అంతంలో ఉన్న శబ్దాల్లో ఈ అచ్చులు సంహితోచ్చారణలోనే లోపిస్తాయి. లోపించినప్పుడు *గోడలు, కోడెలు* అనే విధంగా రూపాలుంటై. లోపిస్తే

సంధిలో పేర్కొన్న అన్యోన్య సమీకరణం, అచ్చుల వివృతీ, తాలవ్యతల్లో మార్పులు జరుగుతై.

(3) కొన్ని శబ్దాలలో జరిగే వ్యాకరణ కార్యాలు సూత్ర నిబద్ధాలు కావు.

చేను, పేను, వేయు, పూవు శబ్దాలలో తుది అక్షరం లోపించి చేలు, పేలు, వేలు అనే రూపాలేర్పడతై.

కొందరి భాషలో పూవుకు పువ్వు అనే ఏకవచనం ఏర్పడి, పువ్వులు అనే బహువచం రూపం నిర్మితమవుతుంది.

తెలంగాణంలో చేను, పేను అనే నామాలకు చేండ్లు, పేండ్లు అనే బహువచన రూపాలున్నై. ఈ ప్రక్రియ అచ్చులతో అంతమయ్యే నకారోపధ నామాలకు వ్యాప్తి చెంది బాసెన - బాసెండ్లు అనే రూపాలేర్పడ్డాయ్. ఎద్దుకు ఎద్దులు, ఎడ్లు అని రెండు బహువచన రూపాలున్నై.

(4) ఇదంత శబ్దాల్లో అకారేతర దీర్ఘ స్వరపూర్వకమైన *య* కారం *త* కారంగా మారుతుంది.

చేయి - చేతులు, గోయి - గోతులు, నూయి - నూతులు, వాయి, అబ్బాయి, అమ్మాయి అనే తెలుగు మాటల్లోనూ స్థాయి అనే సంస్కృతం మాటలోనూ ఎట్లాంటి మార్పూ జరగదు. ఏకవచనంలో దీర్ఘాచ్చూర్వక య కారోచ్చారణ నేటి భాషలో చెయ్యి, నెయ్యి అనే విధంగా హ్రస్వాచ్చూర్వక ద్విరుక్త య కారం ఉంది. పొయ్యి కి పొయ్యి లు అనేది బహువచన రూపం.

(3) ల్లు, న్ను అంతంలో గల ఔపవిభక్తి నామాలకు *ండు* ఆదేశమవుతుంది. కన్ను+లు కండులు > కండ్లు; పల్లు + లు > పండులు > పండ్లు. నిమ్నార్థకమైన పల్లు, మద్యార్థకమైన కల్లు, అనౌపవిభక్తికాలు; వీటికి ఈ ఆదేశం రాదు. స్వరలోపం రాని రూపాలు ఇండులు, విండులు వంటివి సాహిత్యభాషలో ఉన్నై.

(6) లి, అంతంలో వచ్చే చతుర్మాత్రాక శబ్దాల్లో *లి* కి *ండి* ఆదేశమవుతుంది. రోకలి - రోకండ్లు, తిరగలి - తిరగండ్లు, కౌగిలి - కౌగిండ్లు, నాగలి - నాగండ్లు. ఇవి ఔపవిభక్తికాలు. కొందరి భాషలో త్రిమాత్రాక లి వర్ణాంత అనౌపవిభక్తిక శబ్దాల్లో ఈ ఆదేశం జరుగుతుంది. మొసలి - మొసండ్లు, నెమలి - నెమండ్లు.

కొందరి భాషలో ఈ ఔపవిభక్తిక అనౌపవిభక్తిక భేదం పోతున్నది. వారిభాషలో ఈ ఆదేశం కూడా కనపడదు. అప్పుడు ద్వ్యక్షరాధిక ఇదంత శబ్దాల్లో చివరి హల్లు ల కారానికి మూర్ధన్యతను చెప్పుకోవాలి.

ఉదా: మొసలి + లు > మొసళి + లు > మొసళ్లు, నాగలి + లు > నాగళి + లు > నాగళ్లు. మూర్ధన్యీకరణం తరువాత స్వరలోపం, మూర్ధన్యసమీకరణం జరుగుతై. ఉలి, పులి, పిల్లి వంటి రెండక్షరాల మాటల్లో మూర్ధన్యీకరణం జరగదు.

ప్రాచీన భాషలో కన్ను శబ్దానికి *కన్నులు* అనే బహువచనమే ఉండేది. ఇల్లు, పల్లు వంటి శబ్దాలకే ఈ ఆదేశం జరుగుతుంది.

(7) ండి, ండు అంతంలో గల మాటల్లో అనునాసిక వర్ణానికి కొందరి భాషలో లోపం జరుగుతుంది. అప్పుడు అన్యోన్య సమీకరణానికవకాశం కలుగుతుంది.

పండ్లు - పండ్లు, పళ్ళు; బండి - బండ్లు, బళ్లు

5, 6 సూత్రాల ద్వారా నిష్పన్నమైన శబ్దాల్లో కూడా ఈ మార్పు జరుగుతుంది.

తిరగండ్లు - తిరగళ్లు; నాగండ్లు - నాగళ్లు.

తిరగళ్లు నాగళ్లు, అనే బహువచన రూపాలకు రెండు రకాల వ్యాకరణ ప్రక్రియలుండటం గమనించదగింది. వ్యవహర్తలను బట్టి వీటి ప్రవర్తన ఉంటుంది.

(8) ఉదంత శబ్దాల్లో చివరి స్వరానికి ముందున్న వర్ణం మూర్ధన్యమవుతుంది. ఉదా: కాలు + లు > కాళులు > కాళ్లు, కుందేలు + లు > కుందేళులు > కుందేళ్లు.

(9) కొన్ని చోట్ల చివరి అచ్చుకు ముందున్న రేఫం కూడా మూర్ధన్య - లకారం అవుతుంది. ఉదా : వేరు + లు > వేళులు > వేళ్ళు, ఊరు + లు > ఊళులు > ఊళ్ళు, గోరు + లు > గోళులు > గోళ్లు, పందిరి+లు > పందిళులు > పందిళ్లు, వెదురు + లు > వెదుళులు > వెదుళ్లు. త్రిమాత్రాక శబ్దాలే ఇట్లాంటివి ఎక్కువ కనిపిస్తయ్. పందిరి కి పందిలి అనే రూపాంతరం ఉంది. స్వరలోపం జరగని రూపాలు ఒకప్పటి భాషలో ఉన్నాయేమో.

(10) ఏకవచనంలో లేని అనునాసిక వర్ణం బహువచన ప్రయోగంలో కనిపిస్తుంది. అట్లాంటి శబ్దాలు నేటి భాషలో *కాడి + లు > కాండ్లు, తూడు + లు > తూండ్లు,* (వర్షార్థక మైన) *ఏడు + లు > ఏండ్లు* అనేవి కనిపిస్తున్నై. వీటి ప్రాచీన రూపాలు కాండి, *తూండు, ఏండు* అనేవి.

ప్రాచీన కావ్యభాషలో అనటి+లు > అనంట్లు, తేటి + లు > తేంట్లు అనే విధంగా ఇంకా ఉండేవి.

(10) తెలంగాణాలో కాడికి కాణి అనే ఏకవచన రూపం ఉండి. కాండి > కా౦డి > కాడి అని తీరాంధ్రంలో మారితే. తెలంగాణాలో కాండి > కాణి అని మారింది. రెండు చోట్లా కాండ్లు అనే విధంగా ప్రాచీన వర్ణ సంయోజన 'ండ' మిగిలింది.

(11) యకారేతర వ్యంజన పూర్వకమైన నామాంత ఇ వర్ణం ఉ వర్ణంగా మారుతుంది. 'గది+లు > గదులు, కాకి + లు > కాకులు, పొయ్యి + లు > పొయ్యిలు.

(12) దంత మూలీయ మూర్ధన్యేతర ప రకమైన నడిమి ఇ వర్ణం మూడు నాలుగక్షరాల మాటల్లో ఉ వర్ణంగా మారుతుంది. ఉదా: *ములికి + లు > ములుకులు, అడివి + లు > అడువులు. అవిరులు, ఊపిరులు,* కావిళ్లు, వేవిళ్లు, పిడికిళ్లు అనే మాటల్లో కాదు.

ఈ మార్పు తత్సమాల్లో జరగదు. అతిథులు, సమితులు. కాని కొందరి భాషలో సముతులు అని ఉంది. అప్పుడు సమితి శబ్దం వారి భాషలో తత్సమం కాదన్నమాట.

(13) నామాంతంలోని ఉ (మారక ముందటి 'ఇ' కూడా) మూర్ధన్య పూర్వకమైతే లోపిస్తుంది. చెట్టు+లు > చెట్లు, చోటు+లు > చోట్లు, గుడి+లు > గుళ్లు, గుడ్డు + లు > గుడ్లు, పండు+లు > పండ్లు, బండి + లు > బండ్లు. రెండక్షరాల మాటల్లో అద్విరుక్త డ వర్ణం ఉన్నచోట స్వరలోపం జరక్కుండా నిష్పన్నమయే *గుడి+లు > గుడులు, దడి+లు > దడులు, బడి+లు > బడులు* అనే రూపాలు అసాధువులుగా కనపడటం లేదు. గుడి+లు + లో > గుళ్ళలో, గుడుల్లో, బడి+లు+లో>బళ్లలో, బడుల్లో అనే రెండు రూపాలూ సాధువుల్లాగా కనిపిస్తున్నయ్. కాని

పండు+లు+లో > పండ్లలో, గుడ్డు+లు+లో > గుడ్లలో అనే ఉండాలి. పండులు, పండుల్లో, గుడ్డులు, గుడ్డుల్లో, చెట్టులు, చెట్టుల్లో అనేవి ఆధునిక భాషలో అసాధువులు.

(14) తత్సమశబ్దాల్లో మహద్వాచక డు ప్రత్యయం లోపిస్తుంది. ఉదా: స్నేహితుడు+లు > స్నేహితులు, పండితుడు+లు > పండితులు. కొందరి భాషలో ఈ లోపం దేశ్యశబ్దాల్లో కూడా జరుగుతుంది. తమ్ముడు+లు > తమ్ములు, లోపం జరగనప్పుడు తమ్ముళ్లు.

(15) అకార, ఎకార పూర్వకమైన మకారాంత శబ్దాల్లో తుది మకారానికి (సున్నకు)

లోపం, పూర్వస్వరానికి దీర్ఘమూ వస్తాయ్. ఉదా: *గు(రం+లు > గు(రాలు, కళ్లెం+లు > కళ్లేలు*. తుది మకార పరకమైన ఏ వర్ణానికి మొదటే వివృతోచ్చారణ ఉంది. దీర్ఘమైనప్పుడు వివృతి అధికమయింది.

## ఔపవిభక్తికాలు

'ఇ, టి, తి, వర్ణంబులు వక్ష్యమాణంబులు ఔపవిభక్తి కంబులు'. 'ఇవి ద్వితీయాద్యేక వచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు (బాల అచ్చిక 28, 29) అని బాలవ్యాకరణం నిర్వచించింది.

కొన్ని నామాలకు ప్రథమేతర విభక్తులు (non nominative) పరమైనప్పుడివి చేర్చితే, సమాసంలో కూడా చేరతై. వీటిలో ఇ, టి, తి అనేవి ప్రధానమైనవి. ఆధునిక భాషలో ద్వితీయాది ప్రత్యయాలు పరమైనప్పుడు నామంలో కలిగే వికారాలను ఔపవిభక్తికాలుగా పరిగణించవచ్చు. ఏక, బహువచన విభాగం కూడా చెప్పనక్కర్లేదు.

(1) బహువచనలు ప్రత్యయం ఇతర ప్రత్యయాల ముందు ల అవుతుంది. ఉదా: పుస్తకాలనూ, పుస్తకాలతో, పుస్తకాల మీద మొ॥

(2) మకార లోపం జరిగి పూర్వస్వరం దీర్ఘం వచ్చిన రూపాలు బహువచన ప్రత్యయం ముందేకాక కు, ను విభక్తుల ముందు కూడా ప్రయుక్తమవుతై. అప్పుడు 'ని' ఆగమంగా వస్తుంది. అప్పుడు స్వరసమీకరణం వల్ల కు, నులు కి,నిలుగా మారతై. ప్రక్రియ ఇట్లా ఉంటుంది. దేశం + కు > దేశా + కు > దేశా + ని + కు > దేశానికి; మంచం + ను > మంచా+ను > మంచా+ని+ను > మంచానిని > మంచాన్ని.

(3) 'మ' కారాంత శబ్దాలు విశేషణాలుగా వచ్చినప్పుడు 'పు' ఆదేశం ఆధునిక భాషలో నిత్యం కాదు.

ఉదా : బియ్యం + గింజ > బియ్యపు గింజ, బియ్యం గింజ; మంచం+కోడు > మంచపుకోడు, మంచంకోడు.

(4) ఇల్లు, పన్ను (పల్లు) వంటి శబ్దాలకు మొదటి అచ్చుమీది వర్ణాలకు 'ంటి' ఆదేశమవుతుంది. ఈ రూపాలు ద్వితీయా విభక్తులన్నిటి ముందూ సమాసాల్లోనూ ప్రయుక్తాలవుతాయి. ఇంటికి, ఇంటిపని, పంటికి, పంటినొప్పి, కంటికి, కంటిరెప్ప. ఈ ఔపవిభక్తిక రూపం మిగతావాటి కన్నా ఎక్కువ స్థిరంగా ఉంది.

(5) కొన్ని *ర, రు, లు, డు* అంతంతో ఉన్న శబ్దాల చివరి అక్షరానికి 'టి' ఆదేశమవుతుంది. ఉదా: పడమర, పడమటిల్లు, గోరు : గోటితో, నోరు:నోటి నిండా,

ఏరు:ఏటి ఒడ్డు, రోలు:రోటిలో, పాడు: పాటిమట్టి, పెరడు: పెరటిచెట్టు, తాబేలు: తాబేటికాయ, కుందేలు: కుందేటి కొమ్ము.

(6) చివరి వ్యంజనం దంతమూలీయ మూర్ధన్య వర్ణాలలో ఒకటైన ఇదంత చతుర్మాత్రాక శబ్దాల్లో చివరి అక్షరానికి 'టి' ఆదేశమవుతుంది. ఉదా. పందిరి: పందిట్లో, వాకిలి: వాకిటికి, నాగలి: నాగటికర్ర, రోకలి:రోకటిపోటు, చావిడి:చావిట్లో, పిడికిలి: పిడికిట్లో.

(7) ఇదంతమైన రెండచ్చుల మాటల్లో దీర్ఘ స్వరపూర్వక 'య' వర్ణానికి, 'త' వర్ణం ఆదేశం అవుతుంది. ఉదా: చేయి: చేతికి, చేతిపని; రాయి: రాతిలో, రాతిగోడ; గోయి:గోతిలో; నేయి:నేతిమిఠాయి; 'నోరు' అనే అర్థంలో వాయి 'నోరూ వాయీ లేనివాడు' అనే నుడికారాల్లోనే మిగిలింది. వేరే 'వాయి' శబ్దం అనౌపవిభక్తికం. దాయి అనే శబ్దానికి దాతి అనే రూపమే ప్రథమంలో స్థిరపడినట్టుంది.

(8) అఱ్రు వంటి మాటల్లో చివరి అక్షరానికి 'తి' అదేశం అవుతుంది. ఉదా: అఱ్రు: అర్తిపుండు; గొఱ్రు: గొర్తి అడ్డ.

(9) ఈ కిందివి 'టి' ఆగమంగా వచ్చే వాటిలో కొన్ని:

a. మారుటి తల్లి, పొద్దుటి పూట, మాపటివేళ, రేపటికి, చాలా సేపటికి.

b. నిన్నటి పత్రిక, మొన్నటిపని, ఇవ్వాళ్టి.

c. పుల్లటి మజ్జిగ, తియ్యటి రసం, చప్పటి కూర, చక్కటి అమ్మాయి.

(10) ను,రు,లు,డు అంతంలో ఉన్న శబ్దాల్లో చివరి 'ఉ' ' ఇ'గా మారింది. మనుష్యవాచక శబ్దాల్లో ఈ మార్పు క్రమబద్ధంగా కనిపిస్తుంది. ఉదా. చేను-చేనికి (కాని చేలో) ఊరు; ఊరికి (కాని ఊళ్లో), కాలు: కాలికి, వారు: వారికి, వాడు; వాడికి, అతను: అతనికి, అల్లుడు; అల్లుడికి: కోడలు, కోడలికి మొ॥

(11) భిన్నార్థాల్లో టి, ఇంటి అని ప్రత్యయాలు సంఖ్యావాచకాలకు చేరతై. ఉదా: రెండింటికి ఒక రూపాయి, మధ్యాన్నం రెండింటికి వస్తానన్నాడు.

(12) సర్వనామాలకు విశేషణ రూపాలు ఇట్లా ఉంటై :

| ప్రథమ | విశేషణ |
|---|---|
| నేను | నా |
| మేము | మా |

| | |
|---|---|
| మనము | మన |
| నువ్వు | నీ |
| మీరు | మీ |
| తమరు | తమ(రి) |
| వాడు | వాడి |
| వారు | వారి |
| వాళ్ళు | వాళ్ళ |
| అది | దాని |
| అవి | వాటి |

ఆమె, ఆపె వంటి శబ్దాల్లో మార్పుండదు.

సర్వనామాల్లోను, విశేషార్థాల్లోను ప్రయోగించే సంఖ్యా వాచక శబ్దాల్లోనూ తప్ప ఔపవిభక్తికత నేటి భాషలో క్షీణిస్తున్నట్లు కనిపిస్తున్నది. నామాల ఔప - అనౌపవిభక్తి కతలను సూత్రబద్ధం చేయటం సులభం కాదు. వాటిని జ్ఞాపకం పెట్టుకోవడమే మార్గం.

## నామవిభక్తులు

అతిప్రాచీన కాలం నుంచి తెలుగులోను, ఇతర ద్రావిడ భాషల్లోనూ కనిపించే నామ విభక్తులు, ను - కు. సర్వ నామాలకు ను చేర్చినప్పుడు కొన్ని మార్పులు జరుగుతై. నా+ను > నన్ను, నీ+ను > నిన్ను, మా+ను > మమ్మల్ని, మీ+ను > మిమ్మల్ని, మన+ను > మనను, మనని. నా, నీ, మా, మీ,ల తరువాత ఎప్పుడూ కు, ను లే వస్తయ్. మిగతా శబ్దాల్లో ఇకారాంత శబ్దాల తరవాత కి,నిలు మిగిలిన శబ్దాల తరవాత కు,కి లలో ను,ని లలో ఏదైనా రావచ్చు.

ప్రాచీన భాషలో ఇకారాంతాల మీద కి,నిలు మిగతా అన్ని చోట్ల కు,ను లుండేవి. ఆధునిక భాషలో కి,నిలు సర్వనామాలు తప్ప మిగతా అన్ని రకాల శబ్దాలకు వ్యాపించినై.

అవుకు, ఆవుకి అని రెండు రకాలుగా అనొచ్చు. కాని నీకు, మీకు అనే అనాలి. నీకి, మీకి అని అనకూడదు. ఆంధ్రేతరుల భాషలో అరుదుగా వినపడే నీకి, మీకి అనే రూపాలు కు కన్న-కి కి ఉన్న అధికవ్యాప్తిని తెలియపరుస్తాయి.

ను కర్మకు చేర్చే విభక్తి; అయితే తెలుగులో అప్రాణివాచక శబ్దానికి కర్మను సూచించే ప్రత్యయం చేరదు. ప్రాణివాచక శబ్దాల్లోనూ క్రియలను బట్టి ఉంటుంది.

ఉదా: బ్రాహ్మడు/డి కి అవును దానమిచ్చాడు.

అతను ఆవును కొట్టాడు.

రెండో వాక్యంలో ను విభక్తిని వదలటానికి వీల్లేదు. ప్రాణిని గౌరవాగౌరవభావాలతో ప్రభావితం చేసే క్రియలున్నప్పుడు ను అవసరమతుంది. ఈడ్చు, కొట్టు, చంపు, తన్ను, వెళ్ళగొట్టు, పూజించు, గౌరవించు వంటి క్రియలతో ప్రాణివాచక శబ్దాలకు ను విభక్తి చేర్చాల్సి వస్తుంది. ఒకవేళ అప్రాణి వాచకాలను ఈ క్రియలతో వాడినా ను విభక్తి తప్పకుండా వాడాలి. ఉదా: వాడు బల్లను తన్నాడు.

ను ముఖ్యకర్మను సూచిస్తే కు అముఖ్యకర్మను సూచిస్తుంది.

కు విభక్తి చాలా అర్థాల్లో ప్రయుక్తమవుతుంది. ఈ కిందివి ఉదాహరణ ప్రాయాలు: స్వామ్యార్థం: నాకు కళ్ళజోడుంది. స్థితిబోధకం: వాడికి కోపంగా ఉంది. కాంక్షార్థం: నాకు వెళ్ళాలని ఉంది. మార్పిడి : రూపాయికి రెండుపండ్లు, బాంధవ్యం: వాళ్ళకు ఇద్దరు పిల్లలు. ప్రయోజనార్థకం: చల్లకు వచ్చి ముంతదాచటం ఎందుకు. గమ్యార్థం: ఊరికి వెళ్తున్నాడు. హేత్వర్థం: చలికి వణుకుతున్నాడు. కాలార్థం: రేపటికి వస్తాడు. అముఖ్యకర్మ: వాడికి చెప్పాను, ఆమెకు ఇచ్చాను.

ఈ అర్థాలు ఇతర ద్రావిడ భాషల్లోనూ కనిపిస్తయ్. అందువల్ల ఇవి తెలుగులో అతి ప్రాచీనకాలం నుంచీ ఉన్నట్టు ఊహించవచ్చు.

తో: కరణార్థంలో ప్రధానంగా ఉపయోగిస్తారు. ఇది కాక ఇంకా చాలా అర్థాల్లో ప్రయోగిస్తున్నట్టు ఈ కింది ఉదాహరణలను బట్టి గ్రహించవచ్చు.

కరణార్థం : వాడు ముక్కుతో మాట్లాడుతాడు.

సహార్థం: ఆయన భార్యతో సినిమాకి వెళ్లాడు. అముఖ్య కర్మ (వచ్యర్థ ధాతువుతో) నీ విషయం మంత్రిగారితో మాట్లాడాను; నేనా విషయం నీతో చెప్పలేదు. (చెప్పు దాతువుతో కు కూడా ప్రయోగించవచ్చు).

రీత్యర్థం: భక్తితో పూజ చేస్తుంది, శ్రద్ధతో చదువుతాడు. కర్తృవిశేషణం: అతను ఆకలితో వచ్చాడు, ఆమె జ్వరంతో పరీక్ష రాసింది. ప్రతిక్రియార్థం: ఆమె పక్కవాళ్ళతో ఎప్పుడూ పోట్లాడుతుంది. మూలపదార్థార్థం : కట్టెతో చేసిన మంచం, పిండితో చేసిన రొట్టె, మట్టితో పెట్టిన గోడ.

లో: దీన్ని అధికరణార్థంలో ప్రయోగించే సప్తమీ విభక్తి ప్రత్యయంగా ప్రౌఢవ్యాకర్త భావించాడు. అధికరణం : ఆంధ్రలో వరిపండుతుంది. ఇంట్లో బియ్యం లేవు, అతనికి సాహిత్యంలో ప్రవేశం ఉంది. కాలార్థం : సెప్టెంబర్లో వానలెక్కువ. 1977 నవంబరు నెలలో తుఫాను వచ్చింది. నిర్ధారణార్థం : వాళ్ళందరిలో ఇతను తెలివైనవాడు.

నుంచి : దీనికి పూర్వరూపం నుండి, దీని విభాగం న్+ ఉండి, న్ + ఉంచి, నుండి 12వ శతాబ్దం నుంచి కనిపిస్తుంది. నుంచి అనే రూపం 17వ శతాబ్దం నుంచి శాసన భాషలో కనిపిస్తున్నది. దీన్ని పంచమీవిభక్తి ప్రత్యయంగా పరిగణిస్తారు.

వ్యాపారాది : ఊరి నుంచి వస్తున్నాడు, 11 గంటల నుంచి చదువుతున్నాడు. పర్యంతార్థం : 10 ఏళ్ల నుంచి మెడిసిన్ చదువుతున్నాడు. హేత్వర్థం: నీ నుంచి ఈ అవస్థ వచ్చింది. ఇవికాక గురించి, దగ్గర, పట్టి మీద, పైన, కింద, పక్క, వల్ల, మొదలైన శబ్దాలు ఆధునిక భాషలో విభక్త్యర్థాల్లో ప్రయుక్తమవుతై. ప్రాచీన భాషలో కనిపించే కోలెన్, పాంటెన్ అనేవి ఆధునిక భాషలో లేవు.

*క్రియలు*

తెలుగులో క్రియలు సహజంగానే కొన్ని అకర్మకాలు, మరికొన్ని సకర్మకాలు. కొన్ని ప్రత్యయాల ద్వారా అకర్మకాలను సకర్మకాలుగానూ, సకర్మకాలను ప్రేరకాలుగానూ మార్చవచ్చు. ఇంచు అనే ప్రత్యయం ఈ ప్రక్రియకు చాలా ఎక్కువగా ఉపయోగిస్తుంది. ఇతర పద్ధతులు సాంప్రదాయిక వ్యాకరణాల్లో వివరంగానే చర్చించారు. నామం నుంచి క్రియను తయారు చెయ్యటానికి కూడా ఇంచు ఉపయోగపడుతుంది : సంతోషించు, వడ్డించు, చేయు, వేయు, కొట్టు, పెట్టు, తీయు అనే ధాతువుల కనుబంధించటం వల్ల సకర్మక ప్రేరణార్థక శబ్దపల్లవాలేర్పడతై.

క్రియాపదాలు : క్రియా పదాలు సమాపక అసమాపక భేదాలతో రెండు విధాలు. సమాపక క్రియ వాక్యాన్ని పూర్తి చేస్తుంది. ధాతువుతో పాటు కాలవాచి ప్రత్యయమూ, క్రియా విభక్తులూ ఉంటై, అసమాపక క్రియతో వాక్యం పూర్తికాదు. ఉపవాక్యాంతంలో (subordinate clause) వస్తుంది. దీనికి క్రియా విభక్తులు చేరవు. కాల సంబంధి (tense) ప్రత్యయం ఉంటుంది.

అసమాపక క్రియా ప్రత్యయాలు :

| | నిశ్చయార్థక | వ్యతిరేక |
|---|---|---|
| క్త్వార్థక : | ఇ | అక (హేత్వర్థం) |

| | | |
|---|---|---|
| శత్రర్థక : | తూ / టూ<br>తా / టా | అకుండా (వ్యాపార క్రమం) |
| చేదర్థక : | (ఇ) తే / టే | అకపోతే |
| అప్యర్థక : | (ఇ) నా | అకపోయినా |
| భావార్థక : | అటం / ఆడం | అకపోవటం (డం) |
| అన్నంతం: | ఆ(న్) | |

ఈ పైన ఉపయోగించిన పారిభాషిక పదాలు సాంప్రదాయిక వ్యాకరణాల్లోవి. వీటిలో క్త్వార్థక ప్రత్యయాలు, అన్నంత ప్రత్యయం ప్రాచీన కాలం నుంచి ఉన్నై. మిగతావి వేరు వేరు కాలాల్లో వచ్చినై. చేదవ్యర్తకాలంలో ఇనన్ ప్రత్యయం ప్రాచీన భాషలో ఉంది. ప్రాచీన భాషలో ట భావార్థక ప్రత్యయం.

| | | |
|---|---|---|
| ఉదా : | అడిగి | అడగక |
| | అడగుతూ | అడగకుండా |
| | అడిగితే | అడగకపోతే |
| | అడిగినా | అడగకపోయినా |
| | అడగటం | అడగకపోవటం |
| | అడగ (న్) | |

సమాపక క్రియలు కొన్ని ధాతువులను కాలాది బోధకత లేకుండానే సమాపక క్రియలుగా వాడవచ్చు.

ఉదా: నీకు తెలుగు వచ్చు (వ్యతి : రాదు)

నాకు ఆయన తెలుసు (వ్యతి : తెలియదు) అనుబంధ క్రియలలో కొన్నింటికి కాలబోధకత ఉండదు. కాలబోధకత ఉన్నప్పుడు క్రియావిభక్తులుంటై. తెలుగు క్రియలలో ధాతు ప్రత్యయ విభాగం రకరకాలుగా చెయ్యవచ్చు. ఈ కిందిది ఒక పద్ధతి.

కాలబోధక ప్రత్యయాలు :

భూత : ఇన, వర్తమాన : తున్న/తున్ (అన్వాదుల తరవాత టున్న/టున్), భావి: త/తున్ (అన్వాదుల తరవాత ట/టున్), ఉభయ ప్రార్థన : దాం, విధ్యర్థకానికి ప్రత్యయాలు లేవు.

క్రియా విభక్తులు

| | ఏకవచన | బహువచన |
|---|---|---|
| ఉత్తమ | ను | ము |
| మధ్యమ | వు | రు (మహన్మహతి) |
| ప్రథమ మహత్తు | డు | ,, ,, |
| ఇతర | ది | వి/యి (అమహత్తు) |

ఇవే క్రియావిభక్తులు వ్యతిరేక క్రియలోను ఉంటై అక్కడ ది,వి లు దు,వు లవుతై. కొన్ని తెలంగాణా మాండలికాల్లో పరిస్థితి కొంత భిన్నంగా ఉంది. దీర్ఘ స్వరాంతక్రియా రూపాల తరువాతనే అక్కడ ఈ మార్పు జరుగుతుంది. ఉదా: చెయ్యది - రాదు.

**వ్యతిరేక క్రియలు :**

భూతకాల వ్యతిరేక క్రియ, అన్నంత క్రియకు అన్ని పురుషల్లోనూ లేదు అనే వ్యతిరేకబోధక శబ్దం చేరిస్తే తయారవుతుంది.

ఉదా : నేను, ఆయన (మొ) రాలేదు.

వర్తమాన వ్యతిరేక క్రియ అటమంత భావార్థక రూపానికి అన్ని పురుషల్లోను లేదు అనే వ్యతిరేక బోధక శబ్దం చేరిస్తే తయారవుతుంది.

ఉదా : ఆమె, మీరు, నేను (మొ॥) రావటం లేదు.

భవిష్యద్బోధక వ్యతిరేక క్రియ అన్నంత రూపానికి క్రియా విభక్తులు చేర్చటం వల్ల ఏర్పడుతుంది.

ఉదా: రాను, రాము, రాడు, రాదు, రారు, రావు

వ్యతిరేక విధి, అన్నంత రూపానికి వద్దు అనే వ్యతిరేక బోధక శబ్దం చేర్చడం వల్ల ఏర్పడుతుంది. ఉదా: రావద్దు, వ్యతిరేక విధికి భిన్న మండలాల్లో భిన్న వ్యవహర్తల్లో ఇంకా చాలా రూపాలు వాడుకలో ఉన్నై. ఉదా: రాకు, రాబాకు, రాబోకు, రామాకు, రామోకు

ఈ పై రూపాల్లో వ్యతిరేక క్రియల్లో ఉపయోగించిన ధాతురూపాన్ని అన్నంత క్రియ అనటం కన్నా అదంత క్రియ అనటం సబబు. పైన అన్నంత క్రియ అన్నచోట నకార విరహిత అన్నంత క్రియారూప సమమైన ధాతురూపం అని అర్థం చేసుకోవాలి.

అన్నంత క్రియ : ధాతువుకు అన్ అనే ప్రత్యయం చేర్చటం వల్ల అన్నంత (అన్+అంత) క్రియ ఏర్పడుతుంది. ఈ క్రియాంతంలో ఉండే నకారం అజాది ప్రత్యయాలు, అనుబద్ధ పదాలు, ధాతువుల ముందే కనిపిస్తుంది. ఈ న కారం పదంలో వచ్చే శ్వాసవర్ణాన్ని నాదంగా మార్చి తరువాత తాను మాయమవుతుంది.

అన్నంత క్రియకు భిన్నార్థాల్లో భిన్నక్రియలు అనుబద్ధమవుతై :

సామర్థ్యార్థం : *కల, కలుగు, లే,* ఉదా: *రాగలడు, రాగలుగుతాడు, రాలేడు, కల* ప్రయోగించినప్పుడు కాల బోధ లేదు. కాలబోధక ప్రత్యయ యోగంలో *కలుగు* ఆదేశం అవుతుంది. *కల*కు వ్యతిరేకంలో *లే* ఆదేశం.

సాధ్య, అనుమత్యర్థాలు : వచ్చు. ఉదా: మీరు లోపలికి రావచ్చు. నేను రేపు ఊరికి వెళ్ళవచ్చు.

నిషేధార్థం :- కూడదు, రాదు; ఉదా: అబద్ధమాడ రాదు, నిజం చెప్పగూడదు.

''తప్పనిసరి'' : వలయు >ఆలి. ఉదా: అందరూ కష్టపడాలి. కాలబోధకత అవసరమైనప్పుడు రూపాలకు *ఉండు, వచ్చు* అనుప్రయుక్త మవుతై. *ఆల ఆల్సి* అవుతుంది. (వలయుకు క్త్వార్థకరూపం వలసి) వెళ్ళాల్సి వచ్చింద. చెయ్యాల్సి ఉంటుంది.

సామర్థ్యార్థం : చాలు > చాల. ఈ పని నేను చెయ్యజాలను. చాల ప్రయోగం వ్యతిరేకానికి పరిమితం. ప్రాచీన భాషలో ప్రశ్నార్థకాల్లో కూడా ఉండేది. ఈ క్రియా రూపం ఇప్పుడ తెలంగాణాలోనే వినబడుతుంది.

ప్రారంభార్థం : పట్టు : ఉదా: *వాడేందో వరలబట్టె* (ఏదో వాగటం ప్రారంభించాడు): *నువ్వేందో లొల్లి చెయ్యబడితివి.* (ఏదో అల్లరి చెయ్యటం మొదలు పెట్టావు). ఈ ప్రయోగాలు తెలంగాణంలో మాత్రమే వినపడుతున్నె.

తీరాంధ్రంలో *పట్టి* అనే క్త్వార్థక రూపం అన్నంత క్రియకు అనుబంధింప బడుతుంది. ఉదా: *వాడు చదవబట్టి పదేళ్ల అయింది.* ఇది పై అర్థానికి సన్నిహితమే ''నువ్వు చెయ్యబట్టి ఈ పని అయింది.'' అనే ఉదాహరణలో హేత్వర్థం ఉంది. ఈ రెండూ ఏకమూలకాలు అవునో కాదో తెలీదు.

ఉపేక్షార్థం : ఇచ్చు దీనికి దానార్థంలో ఇచ్చు రూపాల్లాగే ప్రత్యయాదులు చేరతై ఉదా: రానిచ్చారు, రానియ్యలేదు, రానిస్తారు.

ఇంకా పడు చేర్చటంవల్ల కర్మణి వాక్యాలు, పో చేర్చటం వల్ల సమీపభవిష్యదర్థం, అవసరం, అక్కర శబ్దాలు చేర్చటం వల్ల ప్రయోజనార్థాలు వస్తయ్.

క్రియా ధాతువుల్లో మార్పులు : ప్రత్యయాలు చేరినప్పుడు ధాతువుల్లో కొన్ని మార్పులు జరుగుతై. ఈ మార్పులు ప్రత్యయ వర్గాలను బట్టి జరుగుతై.

మొదటి వర్గం : విధ్యాదులు - విధి, అన్, అక, అటం, ప్రత్యయాలు, విధి తప్ప మిగతావన్నీ అకారాది ప్రత్యయాలు, ధాతువులకు అనియత పర్యాయ రూపాలన్నీ (irregular alternations) ఈ ప్రత్యయాల ముందే వస్తయ్.

రెండో వర్గం : ఇదాది ప్రత్యయాలు - క్త్వార్థకం, భూతకాల అవ్యర్థకాలు ఈ ప్రత్యయాలు చేరినప్పుడు చేయువంటి ధాతువుల్లో య > స అవుతుంది.

మూడో వర్గం : వర్తమాన, చేత్, ఉభయ ప్రార్థనలు. వీటిని హలాది ప్రత్యయాలుగా గ్రహించవచ్చు. ద్విరుక్త ట్ట కారానికి డా దేశం వంటివి ఈ వర్గం ముందు అవుతై. వీటినే భద్రిరాజు కృష్ణమూర్తిగారు A, B, C, ప్రత్యయాలన్నారు. ఇక ధాతువుల్లో మార్పులు:

1. మూడోవర్గ ప్రత్యయాల ముందు *ఉండు* ధాతువుకు *ఉన్* ఆదేశమవుతుంది.

2. అనుబంధ క్రియలుగా వచ్చిన *ఉండు, కొను* ధాతువులకు మొదటి వర్గం ప్రత్యాయాల ముందు ఓ, కో శబ్దాలు ఆదేశాలవుతై. ఉదా: కూర్చుండు - కూర్చో, నిలుచుండు నిల్చో. చేసుకొను - చేసుకో.

3. అనుబద్ధమైన *కొను* భూతాది ప్రత్యయాల ముందు కునుగా మారుతుంది. ఉదా: చేసుకున్నాడు.

4. ధాతువు చివరి *యులోని య* కు రెండో మూడో వర్గ ప్రత్యయాల ముందు సా దేశం జరుగుతుంది. చేయు : చేసి, చేస్తాడు, చేస్తే.

5. ధాత్వంతంలోని ''చు, చ్చు'' లకు ఇంచు ప్రత్యయంలోని ం చు కు మూడో వర్గ ప్రత్యయాల ముందు ' కారాదేశమవుతుంది. వచ్చు : వస్తాడు, పిలుచు : పిలుస్తాడు, చేయించు : చేయిస్తాడు.

'గిచ్చు, గుచ్చు, నచ్చు, నొచ్చు, పుచ్చు, మెచ్చు అనే ధాతువుల్లో ఈ మార్పు రాదు. కొన్ని వర్గాల వ్యవహారంలో నొచ్చు కు ఈ మార్పు కనిపిస్తుంది. ఈ మార్పు కనిపించే క్రియలు ఇచ్చు, చచ్చు, తెచ్చు, వచ్చు అనేవి.

6. పై విధంగా ఆదేశంగా వచ్చిన సకారం ఉభయ ప్రార్థన ప్రత్యయం ముందు ద కారంగా మారుతుంది. చేద్దాం, చూద్దాం : చేయిద్దాం, తెలంగాణాలో చేజ్దాం, చూజ్దాం, చేయిజ్దాం, అనే విధంగా Z ఉచ్చారణ ఉంది. బహుశా ఈ ఉచ్చారణ ప్రాచీనం కావచ్చు.

7. మూడక్షరాల ధాతువుల్లో చివరిహల్లు డ వర్ణానికి మొదటివర్గ ప్రత్యయాల ముందు వ కారాదేశమవుతుంది. ఉదా: పిలుచు : పిలువు, పిలవటం. ప్రత్యయంగా విడదీయ దగిన 'చు' లో చ వర్ణానికి కొందరి భాషలో ఈ మార్పు జరగదు. ఇక్కడ మారని రూపాలే ప్రామాణికంగా కొందరు పరిగణిస్తారు. *కాలు+చు - కాల్చు, కాల్చటం, కాల్చలేదు*, మారితే, *కాలువు, కాలవటం, కాలవలేదు.*

8. ధాతువు చివరి ద్విరుక్త ట కారానికి మూడో వర్గ ప్రత్యయాల ముందు *డ*కారా దేశమవుతుంది. *కొట్టు, కొడితే, కొడతాడు, కొడుతున్నాడు* మొ॥ నట్టు, మెట్టు లకు ఈ మార్పు కలగదు. ఉదా: *నట్టుతూ మాట్లాడతాడు. మెట్టితే.*

9. న్ను, ప్పు, ళ్లు అంతంలోగల కొన్ని ధాతువుల్లో మూడోవర్గ ప్రత్యయాల ముందు అద్విరుక్తత వస్తుంది. ఉదా: తన్ను : *తంతే, తంతాడు.* చెప్పు *: చెపితే, చెపుతాడు.* వెళ్ళు*: వెళితే, వెళతాడు.* చెప్పుకు కొందరి భాషలో అద్విరుక్తితో పాటు నాదత రావచ్చు. ఆ తరవాత స్పర్శత లోపించవచ్చు. ఉదా: చెపితే > చెబితే > చెవితే.

ఈ అద్విరుక్త సూత్రం ఈ మూడు మాటలకు మాత్రమే వర్తిస్తున్నది మారని ధాతువులే అధికం. *దున్ను, మన్ను, కప్పు, తప్పు, తిప్పు, దెప్పు, రొప్పు, విప్పు. కుళ్లు, తుళ్లు,* మళ్లు వంటి చాలా ధాతువుల్లో ఈ మార్పు జరగదు.

ఈ సూత్రాల్లో 5 (వచ్చు > వస్), 8 (కొట్టు > కొడు) 9 (తన్ను > తన్, చెప్పు > చెపు, వెళ్లు > వెళు) సంఖ్య గల సూత్రాలను ఒకటిగా పరిగణించవచ్చు. ద్విరుక్తి అద్విరుక్తం కావటం ఈ మూడిట్లోనూ సమానం. ఈ సూత్రాలు ఆ రకపు పదాలన్నిటికీ ఇప్పుడు వర్తించకపోయినా, ఇక ముందు వర్తించటానికి వీలున్న సూత్రాలు. 8వ సూత్రం వర్తించని రూపాలు తక్కువ. 5వ సూత్రం నొచ్చుకు కొందరి భాషలో వర్తిస్తుంది. బహుశా ఉచ్చారణత్వరలో ఈ సూత్రం వర్తించి కాలక్రమేణా ఒక కాలానికి స్థిరమైన సూత్రం కావచ్చు. మార్పు ప్రారంభ విస్తరణలను ఈ సూత్రాలు ప్రతిఫలిస్తున్నయ్.

10. ధాతువుల్లో స్వరసమత : ప్రాచీన కాలపు ధాతువుల్లో ఇన్మధ్య. అన్మధ్య, ఉన్మధ్య ధాతువులుగా మూడక్షరాల ధాతువులు మూడు రకాలు. ఇన్మధ్య ధాతువు లెప్పుడూ తక్కువే. ప్రిదిలు అనే ధాతువుకు ప్రిదులు అనే రూపం సాహిత్యంలో అధికంగా కనబడుతున్నది. అన్మధ్య ధాతువులు సాహిత్య భాషలో అధికంగా ఉన్నయ్. అయినా అవి 14వ శతాబ్దికే ఉన్మధ్యాలుగా మారినట్టు లేక మారటం ప్రారంభించినట్టు శ్రీనాథుడి భాషలో సాక్ష్యం దొరుకుతున్నది. ధాతు మధ్యాచ్చు ఉత్తు అయినప్పుడే సమస్వరతను

పొందుతుంది. ప్రత్యయంలో అచ్చుననుసరించి ధాతువుల్లో అచ్చు మారటం అతి ప్రాచీన కాలం నుంచి ఉండి ఉండాలి.

ఈ స్వరసమత భిన్న మండలాలలో భిన్న పద్ధతుల్లో ఉంది : 1. మూడచ్చుల ధాతువుల్లో ప్రథమేతరాచ్చులు (అవి ఉత్తులు) ఇదాది ప్రత్యయాలు ముందు ఇత్తుగాను అ దాది ప్రత్యయాల ముందు అత్తుగా మారుతుంది.

అడుగు + ఇ > అడిగి

+ అ > అడగ

చేదర్థకాన్ని ఇతే అని గ్రహిస్తే పై సూత్రీకరణ సరిపోతుంది. లేకపోతే హలాది ప్రత్యయాల ముందు కూడా జరిగిందని చెప్పాల్సి ఉంటుంది.

2. కొందరి భాషలో రెండక్షరాల ధాతువుల చివరి అక్షరంలో హల్లు దంత మూలీయ, మూర్ధన్య వర్ణమైతే ధాత్వంత స్వరం పరంలో హలాది ప్రత్యయం మీది ఆ అనే దీర్ఘాచ్చువల్ల కూడా సమీకరణం చెందుతుంది.

ఆడు + తాం > ఆడతాం

ఆడు + దాం > ఆడదాం

చేరు + తాడు > చేరతాడు

చేరు + దాం > చేరదాం

తేలు + తాడు > తేలతాడు

తేలు + దాం > తేలదాం

నాను + తాడు > నానతాడు

నాను + దాం > నానదాం

పై రూపాల్లో ల, నల మీద అచ్చు సంధిలో లోపించవచ్చు.

3. ఈ స్వరసమత రాయలసీమ భాషలో అక్షర సంఖ్యా భేదం అక్షర నిర్మాణ భేదం లేకుండా అన్ని ధాతువులకూ వ్యాపించింది.

పొగుడు + తాడు > పొగడతాడు

అడుగు + తాడు > అడగతాడు

వాగు + తాడు > వాగతాడు

రాయలసీమభాషలో ఆదిస్వరంకాని దీర్ఘాకారం అన్ని ధాతువుల్లో సమీకరణను కలిగించగలగటం పై ఉదాహరణలో గమనించగలం.

తెలియు ధాతువుకు రూపాలు భిన్నంగా ఉంటై. తెలిసి, తెలీలేదు, తెలవలేదు, తెలియలేదు.

11. కొన్ని ధాతువులకు మొదటి వర్ణం ప్రత్యయాల ముందు ఆదేశరూపాలున్నై. ఆవు: కా, అవ; చూచు : చూడు, చూడ; లేచు : లే, లేవ; పోవు : పో; ఇచ్చు : ఇయ్యి, ఇవ్వ; తెచ్చు : తే, చచ్చు; చావు, చావ; వచ్చు : రా.

12. పడు, చెడు లకు రెండో హల్లు ద్విత్వం భూతకాలంలో వస్తుంది. నకార లోపం జరుగుతుంది. పడు : పడ్డాడు, పడ్డా, ప్రాచీన భాషలోని ఇడు ఈ తరగతికి చెందినదే.

ప్రత్యయాల్లో మార్పులు : అన్వాది ధాతువుల తరవాత ప్రత్యయంలో త వర్ణం మూర్ధన్య ట వర్ణమవుతుంది. అను, కను, కొను, తిను, విను - ఇవి అన్వాదులు. అను: అంటాడు, అంటే.

విశాఖపట్నం వైపు కొందరి భాషలో ఈ సూత్రం వర్తించక అంతాడు, అంతే అనే విధంగా రూపాలుంటై.

2. కాలబోధక ప్రత్యయాల్లో చివరి ఆ కారానికి ది, వీ తర ప్రత్యయాల ముందు రాయలసీమ సర్కారు జిల్లాల వ్యవహారంలో దీర్ఘం వస్తుంది. ఉదా: చేయు, చేసినాడు, చేస్తాడు - తెలంగాణంలో దీర్ఘం రాదు. కొన్ని చోట్ల అచ్చు లోపిస్తుంది. చేయు : చేసిండు, చేస్తడు. విశాఖమాండలికంలో చేస్తాది, అనే రూపం ఉంది.

3. సర్కారు జిల్లాల వ్యవహారంలో సమాపక క్రియల్లో ది, వీ తర ప్రత్యయాల ముందు భూతకాల బోధలో షవర్ణం లోపిస్తుంది. చేయు; చేస్+ఇనా+ డు > చేస్ + ఏ +డు > చేశాడు. ఇ + ఆ > ఏ (æ) విశాఖ జిల్లాల్లో చేశాది, చేశాయి అనే రూపాలున్నై.

4. దీర్ఘ స్వరాంత ధాతురూపాలకు అటం చేరినప్పుడు 'వ' కారం ఆగమంగా వస్తుంది. ఉదా : రా + అటం > రావటం, తీసుకో + అటం > తీసుకోవటం.

5. దీర్ఘ స్వరాంత ధాతు రూపాల తరవాత స్వరాది ప్రత్యయాల స్వరానికి లోపం అవుతుంది. అప్పుడ పై సూత్రంలో వచ్చే వ కారాగమం కొందరి భాషలో రాదన్న మాట; ఉదా : రా + అటం > రాటం; రా + అక > రాక, తే + అక > తేక.

6. అన్నంత క్రియారూపాల తరవాత పరుషాలు సరళాలవుతై. తదనంతరం హల్లుల ముందు ఆ న కారానికి లోపం జరుగుతుంది. ఉదా: రాన్ + కలడు > రాగలడు, రాన్ + వచ్చు > రావచ్చు. రావొచ్చు అనే రూపం వ > ఒ > వొ అనే ప్రక్రియలవల్ల వచ్చింది. కొన్ని స్వరాది పదాలు పరమైనప్పుడు కూడా ఈ నకారానికి లోపం జరుగుతుంది. ఉదా: చెప్పన్ + అక్కర లేదు > చెప్పనక్కరలేదు, చెప్పక్కరలేదు; చెయ్యన్ + అవసరం లేదు > చెయ్యనవసరం లేదు, చెయనవసరం లేదు.

కొన్ని స్వరలోప సమీకరణ కార్యాలు భిన్న మాండలికాల్లో భిన్నవిధాలుగా ఉన్నై.

అన్వాది ధాతువులకు పరంగావచ్చిన భూతకాల బోధకమైన ఇన ప్రత్యయంలో ఇ లోపిస్తుంది.

అను + ఇనా + డు > అన్నాడు.

ది ప్రత్యయం ముందు ఇన ప్రత్యయంలో అత్తు దీర్ఘం రానప్పుడు స్వరలోపానికి రెండుచోట్ల అవకాశం ఉంటుంది.

ఉదా : అను + ఇన + ది > అన్నది, అనింది.

అనింది, తినింది, కొనింది వంటి రూపాలు రాయలసీమలో ఉన్నై.

భవిష్యత్తులో కూడా కొన్ని గుర్తించదగిన మాండలిక భేదాలున్నై.

వచ్చు + త + ది > వస్ + త + ది, వస్తది.

మరికొన్ని చోట్ల వచ్చుద్ది అని అవుతుంది. పోతది, పోద్ది, పోయిద్ది వంటి క్రియా రూపాలు కూడా వినబడతాయ్.

పై క్రియారూపాల్లో చేసినాడు వంటి భూతకాల రూపాలు ప్రాచీన కావ్య భాషలో కూడా కనిపిస్తయ్.

చేయుచున్నాడు వంటి రూపాలకన్న చేస్తున్నాడులో తు ప్రత్యయమే ప్రాచీనమని భద్రిరాజు కృష్ణమూర్తి గారు తులనాత్మక పద్ధతి వల్ల నిరూపించినారు. ఏ అనే భూతకాల ప్రత్యయరూపానికి , చేశాడు, చెప్పాడు అనే భూతకాలక్రియా రూపాలకూ ప్రాచీన లిఖితాధారాలు లేవు. ఇవి ఎంత ప్రాచీనమో నిర్ణయించలేము.

అన్నమాచార్యుల కీర్తనల ద్వారా చేసేవు. వచ్చేవు వంటి క్రియాపదాలు పద సాహిత్యంలో ప్రవేశించి ఆ సాహిత్య ప్రత్యేక క్రియారూపాలుగా తరవాత పదకర్తల కీర్తనలకు కూడా ఎక్కినై.

''వస్తూ చూస్తిమి, రోస్తిమిన్'' అని శ్రీనాథుని చాటువును బట్టి చేస్తూ వంటి రూపాలు ఇంకా ప్రాచీనాలుగా నిర్ణయించవచ్చు.

క్రియాజన్య విశేషణాలు :

| | నిశ్చయ | వ్యతిరేక |
|---|---|---|
| భూత : | ఇన | |
| వర్తమాన : | తున్న | అని |
| భవిష్యత్తు : | ఏ | |

ఉదా : చేసిన, చేస్తున్న, చేసే, చెయ్యని.

ఈ విశేషణాల్లో భూతకాల విశేషణం ప్రాచీన కాలం నుంచీ ఉన్నది. భవిష్య రూపం ఎడు అని ప్రాచీన కాలంలో ఉండేది; 14వ శతాబ్దాకి ఏ అయింది. వ్యతిరేక రూపం పూర్వం నుంచీ ఉంది. భూతకాల క్రియారూపాలు క్రియాజన్య విశేషణాల మీద నిర్మిత మయినాయని పరిశోధకులూహిస్తున్నారు. చేసిన వాడు > చేసినాడు.

## వాక్య నిర్మాణం

ప్రపంచ భాషలన్నిటి మధ్యా వాక్యనిర్మాణంలో పోలిక లెక్కువ కనిపిస్తయ్. ఇందుకు కారణం మానవ మేధా నిర్మాణంలోనే ఉండవచ్చు. అంటే మానవజాతి ఒక జాతిగా పరిణామం చెందేటప్పుడు పరిణామావసరాలూ, నియమాలూ బట్టి ఏర్పడ్డ మానవమేధా నిర్మాణం వల్ల ఆలోచనల్లో సామ్యం ఉండటం సహజం. అందువల్ల భాషాయంత్రాంగంలో కూడా అట్లాగే సామ్యాలుండటం ఆశ్చర్యం కాదు.

అన్ని భాషల్లో సామాన్య, సంశ్లిష్ట, సంయుక్త వాక్యభేదాలూ, అకర్మక, సకర్మక, ద్వికర్మక క్రియాభేదాలూ, నామ, క్రియా, విశేషణ, అవ్యయాది శబ్ద భేదాలూ; విధి, ప్రశ్న, నిశ్చయ, వ్యతిరేక, వాక్యభేదాలూ ఉంటై. అయితే వాటి నిర్మాణంలో మాత్రం కొన్ని భేదాలను గుర్తించవచ్చు. ఆ భేదాలే ఆయా భాషల్ని వేరు వేరు కూటములు గానూ, లేక భిన్న భాషలను గానూ వేరుచేసి వాటి వైవిధ్యాన్ని, ప్రత్యేకతను నిలబెడతై.

క్రియలేని వాక్యాలు : అన్ని భాషలకు లాగే తెలుగులో సమీకరణ వాక్యాలని శాస్త్రజ్ఞులు పిలిచే వాక్యాలున్నై. ఈ రకపు వాక్యాల్లో మొదటిదళం నామబంధం అయి ఉంటుంది. రెండోదళం విశేషణంగానీ, నామబంధం కాని కావచ్చు. రెండోదళంలోని పదబంధం

మొదటిదళంలోని నామబంధం గురించి ఏదో ఒక అంశాన్ని సూచిస్తుంది. ఆ అంశం ఆ నామబంధపు గుణాది విశేషాణాల్లో ఏదైనా కావచ్చు. అయితే తెలుగు సమీకరణ వాక్యాల్లో రెండోదళం సాధారణంగా నామబంధమే ఉంటుంది. విశేషణం ప్రయోగించినా దాన్ని నామబంధంగా మార్చవలసిందే.

ఉదా: ఎ. ఆయన డాక్టరుగారు

బి. ఆమె టీచరు

సి. ఆ డాక్టరు మంచివాడు

డి. ఆ టీచరు మంచిది

ఈ పై వాక్యాల్లో ఎ, బి లలో రెండోదళం స్వతహాగా నామబంధం. సిడిలలో విశేషణం నామబంధంగా మార్చబడింది. ఇట్లా మార్చటానికి సర్వనామాలు ప్రత్యయాలుగా ఉపయోగపడ్డయ్.

తెలుగు సర్వనామాల్లో వక్త దృష్టిననుసరించి సామీప్యాన్ని, దూరాన్ని సూచించే శబ్ద భేదాలున్నై. దూరాన్ని సూచించే పదాల్లో అకారం, దగ్గర్ని సూచించే పదాల్లో ఇకారం విడదీయటానికి వీలున్నా లేకపోయినా కనిపిస్తయ్. ఈ భేదం సర్వనామాల్లోనూ, అవ్యయాల్లోనూ కనిపిస్తుంది. ఉదా : *వాడు - వీడు, ఆమె - ఈమె, అది - ఇది, అప్పుడు - ఇప్పుడు, అక్కడ - ఇక్కడ.* సర్వనామాల్లో వాడు మనుష్య పురుష బోధకం. వాళ్లు - మనుష్య బహుత్వబోధకం. అది - మనుష్య స్త్రీ, మనుష్యేతర ఏకవచన బోధకం. అవి మనుష్యేతర బహుత్వ బోధకం. ఈ శబ్ద విశేషణాల నుంచి నామాలు నిష్పన్నం చెయ్యడానికి ఉపయోగిస్తయ్. ఉదా : *మంచివాడు, మంచివాళ్లు, మంచి + అది > మంచిది, మంచి + అవి > మంచివి.* చివర రెండు పదాల్లో అది, అవి శబ్దాలు బదులు, ది, వి అనే ప్రత్యయాలు ఉన్నయ్యన్నా చిక్కులేదు. కాని ఇక్కడ అకారం ఉన్న శబ్దాలు కేవలం ప్రత్యయ సూత్రాలనీ, వాటిల్లో విశేషణాలు తర్వాత వచ్చినప్పుడు దూరబోధకత ఉండదనీ గ్రహించాలి.

క్రియావాక్యాలలాగే ఈ రకపు వాక్యాలలోనూ అఖ్యాత పదం (ఈ వాక్యాల్లో ఇది నామం) కర్తృ విశేషాలను సూచిస్తుంది. అయితే ఇది మధ్యమ, ఉత్తమ పురుషలకు మాత్రమే పరిమితం. ఉదా: అతను టీచరు, ఆమె టీచరు, వాళ్లు టీచర్లు, నేను టీచరును, మేము టీచర్లం. నువ్వు టీచరువు - మీరు టీచర్లు. మధ్యమ పురుష బహువచన బోధకు ఉత్తమ పురుషకులాగే ప్రత్యేక ప్రత్యయం లేదు.

ఈ రకపు వాక్యాల్లో కాలబోధకత ఉండదు. కర్తృపద స్థితి మాత్రమే ఈ వాక్యాల్లో సూచితమవుతుంది. ఈ వాక్యాలకు వ్యతిరేక రూపం కాదు అనే రూపం అనుసంధించటం వల్ల ఏర్పడుతుంది. వికల్పంగా అవు ధాతువుకు ఆదేశంగా వచ్చే కా అనే శబ్ద రూపం మీద క్రియావిభక్తులు కూడా చేరవచ్చు. ఉదా: *అతను మంచివాడు కాదు/కాడు; వాళ్లు మంచివాళ్లు కాదు/కారు, నేను చెడ్డవాడిని కాదు/కాను మొ॥*

క్రియలేని వాక్యాలను ఆపి, చేదాద్యర్థాల్లో ప్రయోగించాలంటే అవు ధాతు నిష్పన్న రూపాలను ఆయా అర్థాల్లో అనుసంధించుకోవాలి. ఉదా : ఆయన మంచివాడు అయితే/అయినా, మొ॥

తెలుగులో ద్విదళ వాక్యాలు క్రియా సహిత వాక్యాల నుంచి కూడా నిష్పన్నమవుతై. క్రియా సహిత వాక్యాల్లో క్రియను నామ్నీకరించి వాక్యంలో ఏదయినా ఒక పదాన్ని క్రియకు తర్వాతి స్థానానికి జరపటం ద్వారా ఈ వాక్యాలు ఏర్పడతై. ఉదా: *ఆయన నిన్న బెజవాడ నుంచి వచ్చాడు. ఆయన బెజవాడ నుంచి వచ్చింది నిన్న, నిన్న బెజవాడ నుంచి వచ్చింది* ఆయన. ఆపి, చేదాద్యర్థాల్లోనూ, వ్యతిరేకార్థంలోనూ ఈ నిష్పన్న ద్విదళ వాక్యాలు మొదటి రకం ద్విదళ వాక్యాల్లాగే ప్రవర్తిస్తయ్. క్రియా వాక్యాల్లో క్రియేతర శబ్దానికి ప్రాధాన్య వివక్షకోసం ఈ పద్ధతి ఉపయోగిస్తుంది. మొదటి రకం ద్విదళ వాక్యాలలో దళ వ్యత్యయం ద్వారా రెండోరకపు ద్విదళ వాక్యాలు తయారవుతై. ఉదా : *ఆయన కలెక్టరు → కలెక్టరు ఆయన.*

క్రియా లోపం వల్ల కూడా కొన్ని క్రియారహిత వాక్యాలు ఏర్పడతై. మీకెంత మంది పిల్లలు ? వాళ్ళకు ఇద్దరు ఆడపిల్లలు వంటి వాక్యాల్లో *ఉండు* అనే క్రియ లోపించింది. ఇట్లాంటి వాక్యాలు అపి చేదాద్యర్థకాల్లో ఉండు అనే క్రియను చేర్చుకోవాలి.

ధాతుజ విశేషణానికి మిగతా విశేషణాలకు లాగే సార్వనామిక ప్రత్యయాలు చేర్చటం వల్ల నామబంధాలవుతై. ఈ నాటి తెలుగు భూతక్రియా రూపాలు కొన్ని వాటి నుంచి పరిణామం చెందినవేనని శాస్త్రజ్ఞులు నిరూపించారు *వచ్చిన వాడు > వచ్చినాడు*, వచ్చినవాడవు వచ్చినావు మొ. వచ్చిన అది > వచ్చినది > వచ్చింది.

అయితే నేటి తెలుగులో భవిష్యబోధకమైన క్రియా విశేషణం మీద సార్వనామిక శబ్దాలు చేర్చటంవల్ల ఏర్పడ్డ రూపాలు క్రియాస్థానంలో ఉండి అవ్యవహిత భూతకాల (inceptive) బోధ చెయ్యటం విశేషం. ఈ రకపు వాక్యాల వ్యతిరేకబోధ పైన చర్చించిన క్రియా రహిత వాక్యాల్లాగే కాదు చేర్చటం ద్వారా ఏర్పడుతుంది. ఉదా: *అతను పదేళ్ళ*

*కిందట రోజూ వ్యాయామం చేసేవాడు. ఆమె పెళ్ళికాక ముందు రోజూ వీణ వాయించేది. అతను పూర్వం పెందలాడే నిద్రలేచేవాడు కాదు. ఆమె పెళ్లికాక పూర్వం వంట చేసేది కాదు* ఈ వాక్యాలకు భూతకాలిక రూపాలకు భిన్నమైన అపి, చేదాద్యర్థక క్రియారూపాలు లేవు.

ఈ వాక్యాల ప్రభావం వల్లనే కాబోలు, కొన్ని మండలాల్లో భూతకాల వ్యతిరేక రూపాలు భూతకాల నిశ్చయార్థకాలకు కాదు చేర్చడం వల్ల ఏర్పడుతున్నై. ఉదా: *రాలేదు* అనే అర్థంలో *వచ్చాడు కాదు. తినలేదు* అనే అర్థంలో *తిన్నాడు కాదు* అని ప్రయోగాలున్నై. భూతకాల నిశ్చయార్థకం మీద కాదు చేర్చిన వ్యతిరేక రూపాల్లో మామూలు వ్యతిరేక క్రియల్లో లేని కర్తృబోధ ఉంది. రెండురకాల క్రియలూ వాడుకలో ఉన్నచోట అర్థ విశేషం ఉండవచ్చు.

**క్రియా సహిత వాక్యాలు :** క్రియా సహిత సామాన్య వాక్యాల్లో క్రియ వాక్యాంతంలో వస్తుంది. వాక్యంలో ప్రవర్తించే భేదాలను బట్టి క్రియలను ఎన్నో రకాలుగా విభజించ వచ్చు. స్థితి, గతి, వ్యాపార, జ్ఞాన మొదలైన రకాలు విభజించటం ఒక పద్ధతి. సకర్మక, అకర్మక భేదం సాంప్రదాయికంగా వ్యాకర్తలందరూ చేస్తున్నదే. కర్మపదాపేక్షక క్రయలు సకర్మక క్రియలు. ఉదా: కొను, తిను, చేయు మొ॥ కర్మపదం అవసరం లేనివి అకర్మకాలు. ఉండు, పోవు, వచ్చు మొ॥. అడుగు, చెప్పు వంటివి ద్వికర్మకాలు, ద్వికర్మకాల్లో ముఖ్య కర్మతో పాటు అముఖ్యకర్మ అదనంగా ఉంటుంది.

వాక్యంలో కర్త, కర్మ, క్రియలతో పాటు రకరకాల కాలదేశ బోధక అవ్యయాలూ, విభక్తి బంధాలూ ఉంటై. ఇవన్నీ వాక్యంలో వచ్చినప్పుడు వీటి ప్రయోగం క్రమ నిరపేక్షకం కాదు. కర్త వాక్యంలో సాధారణంగా ముందు వస్తుంది. క్రియ చివర వస్తుంది. కర్మ పదం క్రియకు పూర్వమూ, అంతకు పూర్వం అముఖ్యకర్మా వస్తయ్. దానికంటే ముందు స్థలబోధకం, అంతకంటే ముందు కాలబోధకం వస్తయ్. క్రియావిశేషణం క్రియకంటే ముందు కర్మపదం తరవాత వస్తుంది. ఈ పైన చెప్పిన వరసలో పదక్రమం ఉంటే క్రియేతరమైన ఏ శబ్దానికీ ఎక్కువ ప్రాముఖ్యం ఉండదు. ప్రత్యేకమైన ప్రాధాన్యాన్ని చెప్పవలసి వచ్చినప్పుడు ఆ పదాన్ని క్రియాపదానికి సన్నిహితంగా జరపటం ఒక పద్ధతి. ఉదా: *నేను మొన్న కాలేజీలో సుజాతకు ఇంగ్లీషు పుస్తకం ఇచ్చాను. నేను మొన్న కాలేజీలో ఇంగ్లీషు పుస్తకం సుజాతకు ఇచ్చాను. నేను మొన్న సుజాతకు ఇంగ్లీషు పుస్తకం కాలేజీలో ఇచ్చాను. నేను కాలేజీలో సుజాతకు ఇంగ్లీషు పుస్తకం మొన్న ఇచ్చాను - మొన్న కాలేజీలో సుజాతకు ఇంగ్లీషు పుస్తకం నేను ఇచ్చాను.*

పై వాక్యాల్లో క్రియకు దగ్గరగా జరిగిన పదానికి ప్రాధాన్యం రావటం గమనించవచ్చు. ఇట్లా జరిగిన పదానికి ఉచ్చారణలో ఊనిక ఉంటుంది. ఇట్లా ప్రాధాన్య నిర్దేశం జరిగిన పదాలు శ్రోతకు కొత్త విషయం తెలియ జెప్పటానికి ఉద్దేశించినవి. శ్రోత ఎరగడని ప్రత్యేకంగా ఉద్దేశించిన వాక్యభాగాన్ని విధేయమనీ, వక్తృశ్రోతలిద్దరికీ తెలిసిన భాగాన్ని ఉద్దేశ్యమనీ సాంప్రదాయికంగా వ్యవహరిస్తారు. క్రియను నామ్నీకరించటం ద్వారా ఏర్పడే ద్విదళ వాక్యాల ప్రయోజనం కూడా అదే. నామ్నీకృత క్రియకు తర్వాతి స్థానానికి జరిగిన పదం విధేయాన్ని సూచిస్తుంది.

కొన్ని వాక్యాలకు కర్తృపద నిర్ణయం కష్టం. ఉద్దేశ్య పద నిర్ణయం చెయ్యవచ్చు. విశేష పదక్రమం లేనిచోట వాక్యాదిన వచ్చే పదం సాధారణంగా ఉద్దేశ్యమవుతుంది. ఉదా: *నాకు చలిగా ఉంది; వాడికి ఆకలిగా ఉంది, ఆమెకు కోపంగా ఉంది.* ఇట్లాంటి వాక్యాలు దేహ మనస్స్థితి బోధక శబ్ద సహితాలు. ఈ వాక్యాల్లో కు విభక్తి బంధాన్ని కర్తగా ప్రతిపాదించేవారున్నారు.

ఈ రకపు వాక్యాల్లోను, మరికొన్ని ఇతర వాక్యాల్లో కు - విభక్తి బంధాన్ని తెలుగులోనే కాక ఇతర ద్రావిడ భాషల్లోనూ, చతుర్థీ విభక్తికర్త (Dative subject) గా కొందరు పరిశోధకులు వ్యవహరించారు. మరికొందరు వ్యతిరేకించారు. వాక్య నిర్మాణంలో కర్తకుండే ప్రవర్తన కు-విభక్తి బంధానికి ఉందని ఈ ప్రతిపాదనల సారాంశం. వీటిల్లో ఒక అంశంలో మాత్రమే ఈ రకమైన వాదానికి కొంత ఆధారం కనిపిస్తుంది. ఉదా : ఎ. అతను కాఫీ లాగి బజారుకు వెళ్లాడు; బి. ఆమెకు జ్వరం వచ్చి ఇంట్లో పడుకుంది. పై రెండు వాక్యాల్లోనూ క్త్వార్థకం తరవాత వాక్యభాగంలో కర్తృపదం అంతకు పూర్వభాగంలో ఉన్న కర్తృపద సామ్యంవల్ల లోపించింది. (ఎ) లో రెండుచోట్ల అతను అనే శబ్దం కర్తృపదంగా భావించటంలో ఇబ్బంది లేదు; కాని (బి) వాక్యంలో ఆమెకు అనేది కర్తృ పదం కాదు. లోపించింది ఆమె అనే పదం. అది (బి) వాక్యంలో రెండో భాగానికి కర్త. ఇట్లాంటి ప్రక్రియను సనామబంధ లోపం అంటారు. ఎ, బి, అనే రెండు వాక్యాల్లోనూ ఒకే ప్రక్రియ జరిగిందనుకుంటే రెండో వాక్యంలో ఆమెకు అనే పదాన్ని కర్తగా అంగీకరించాల్సి వస్తుంది. అయితే (ఈ) వాక్యంలో జరిగిన ప్రక్రియ ఇతరచోట్ల కూడా జరిగితే అప్పుడు దీన్ని కర్తగా గుర్తించక్కర్లేదు.

ఇంగ్లీషు భాషలో కార్యకర్త (Agent) తో పాటు, కరణకారకాన్ని బోధించే పదం కూడా వ్యక్త నిర్మాణపు కర్త (Surface Subject) కాగలుగుతుంది. ఉ: Sita opened

the door with a key. The key opened the door. The door opened. కాని తెలుగులో *'తాళం చెవి తలుపు తెరిచింది'* అనే రకపు వాక్యం సాధారణ వ్యవహారంలో ఉండదు. తాళం చెవి మీద ప్రాణితత్వారోపణ జరిగితేనే - అంటే ఈ రకపు పదాలను ప్రాణివాచకాలుగా సంభావిస్తేనే - ఈ రకపు వాక్యాలు కుదురుతై. * తలుపు తెరిచింది అనే వాక్యం వ్యాకరణ విరుద్ధం. తలుపు తెరుచుకుంది అనే విధంగా క్రియాధాతువుకు ఆత్మార్థ ప్రత్యయం చేరిస్తే వ్యాకరణ సమ్మతమవుతుంది. ఆత్మార్థ ప్రత్యయం (లేక ప్రత్యయ తుల్యమైన అనుబంధధాతువు) చేర్చటం వల్ల 'తనంతట తాను' అనే అర్థం వస్తుంది. అయితే *ఈ కత్తిపీట బాగా తెగుతుంది, ఈ కారు బాగా నడుస్తుంది. ఇవ్వాళ పరీక్షల్లో నా కలం బాగా రాసింది* - అనే వాక్యాల్లో వ్యక్త నిర్మాణ కర్తలుగా కనిపించే కత్తిపీట, కలం గుప్త నిర్మాణంలో కరణకారకాలను బోధిస్తయ్. కారు కర్మకారకం. ఆత్మార్థక బోధక క్రియారూపం లేకుండా వాక్యం సాధ్యమయింది. వాడిన క్రియలను బట్టి ఈ భేదం ఉన్నట్టు కనిపిస్తున్నది. వ్యాకరణంలో వాటి ప్రవర్తనను బట్టి క్రియలను రకరకాలుగా విభాగించవలసి ఉంటుంది.

ఆఖ్యాత బంధంలో ప్రధానమైనది క్రియాబంధం. క్రియ స్థూలంగా భూత, భవిష్య ద్వర్తమానం వంటి కాలాలను బోధిస్తుంది. భవిష్యత్క్రియ తద్ధర్మబోధ కూడా చేస్తుంది. ఆమె పొద్దున్నే స్నానం చేస్తుంది అనే వాక్యంలో చేస్తుంది అనే క్రియలో తద్ధర్మబోధను గుర్తించవచ్చు. వర్తమానార్థక క్రియ భూతకాల అవ్యవహిత (continuous) వ్యాపారాన్ని కూడా సూచిస్తుంది. ఉదా: *అతను మొన్న బెజవాడ నుంచి రైలులో వస్తున్నాడు.* కథన శైలిలో భవిష్యత్క్రియకు భూతార్థంలో ప్రయోగం ఉంది. ఉదా: *రాజకుమారుడు వేటకు వెళ్తాడు. అక్కడ ఒంటరిగా ఒక సుందరి కనిపిస్తుంది. సుందరి రాజకుమారుణ్ణి చూసి సిగ్గు పడుతుంది. రాజకుమారుడు ఆమెను చూట్టం తోటే ప్రేమించేస్తాడు...* ఈ పై వాక్యాల్లో క్రియలు భవిష్యత్క్రియలే. కాని భూతార్థంలో ప్రయుక్తమయినై.

కర్మణి వాక్యాలు : నేటి నోటిభాషలోగాని ప్రాచీనభాషలో గాని కర్మణి వాక్యాల ప్రయోగం అరుదు. సాహిత్య భాషలో దీని ప్రయోగం ఎక్కువ.

ఇప్పటి కాలంలో రాజకీయ నాయకుల ఉపన్యాసాల్లో ఈ రకపు వాక్యాలు వినిపిస్తుంటై. నేటి రచనాభాషలో వీటి ప్రయోగం ఎక్కువవుతున్న సూచన్లు కనిపిస్తున్నై. అయితే గణాంక పరిశోధన వల్ల తేల్చాల్సిన విషయాలివి.

అన్నంత క్రియకు పడు ధాతువును చేర్చడం వల్ల కర్మణి క్రియాప్రాతిపదిక ఏర్పడుతుంది. కర్తకు చేత అనే ప్రత్యయం చేరుతుంది. కర్మకున్న ద్వితీయావిభక్తి పోతుంది. ఉదా: *పాలకులు ప్రజాస్వామ్యాన్ని హత్య చేస్తున్నారు – ప్రజాస్వామ్యం పాలకుల చేత హత్య చేయ్యబడుతున్నది.*

ఈ పద్ధతి సంస్కృతం నుంచి తెలుగులోకి ప్రవేశించినట్టుగా కొందరు పరిశోధకులు భావిస్తున్నారు. ఇతర ద్రావిడ భాషల్లో కూడా ఈ పద్ధతి కనిపిస్తున్నది. అక్కడ కూడా ఈ ప్రక్రియ ఇట్లాగే ఉంది. భిన్న భాషలు ఒకే అంశాన్ని ఇతర భాషల నుంచి ఒకే ప్రక్రియ ద్వారా గ్రహించడం కొంచెం ఆశ్చర్యకరమే. ఈ రకపు వాక్యనిర్మాణం ద్రావిడ భాషల్లో మొదలే ఉండి సంస్కృతాది భాషల ప్రేరణ వల్ల వీటి ప్రయోగం కొన్నిచోట్ల అధికమయి ఉండవచ్చు.

క్రియాసృష్టి గారడీ : కర్మణి వాక్యాలలో కర్తృ ప్రాధాన్యం తగ్గుతుంది. కర్మ ప్రాధాన్యం పెరుగుతుంది. క్రియా ప్రాధాన్యాన్ని పెంచే ప్రక్రియ తెలుగులో ఒకటి ఉంది; ఉదా: *నేను బజారుకు వెళ్లాను → నేను బజారుకు వెళ్లటం జరిగింది. ఆమె పెళ్లి చేసుకున్నది → ఆమె పెళ్లి చేసుకోవటం జరిగింది.*

ఈ రకపు వాక్యాలను పరిశీలిస్తే కొన్ని ప్రక్రియా విశేషాలు గుర్తించవచ్చు. వాక్యాలలో క్రియ అటం శబ్దంతో నామ్నీకరించబడి, తాను కర్త కావటం కోసమా అన్నట్టు గతి (process) బోధక క్రియను ఒక దాన్ని సృష్టించుకుంది. అంతకు ముందు లేని క్రియను సృష్టించుకోటమే ఇక్కడ 'గారడీ'. ఈ రకపు వాక్యాలు ఈ నాటి వార్తాపత్రికల భాషలోనూ, రాజకీయోపన్యాసాల్లోనూ, కనిపిస్తయ్. ఆ ప్రభావం ఎక్కువగా ఉన్న వక్తల వ్యవహారంలోను వినిపిస్తుంది. ఈ రకపు వాక్యాలు భాషలో ఎప్పుడు ప్రవేశించినయ్యో చెప్పటానికి ఆధారాలు దొరకటం లేదు. శాసన భాషమీద కృషి చేసిన పరిశోధకులకీ వాక్యాలు దొరకలేదు. సాహిత్య భాషలోను కనపట్టం లేదు.

ఈ 'గారడీ' వాక్యాలు మూలవాక్యంలో స్థితి బోధక క్రియ ఉన్నప్పుడు సాధ్యం కాదు.

ఉదా : ఆమె అందంగా ఉంది → - *ఆమె అందంగా ఉండటం జరిగింది; ఆమెకు జ్వరంగా ఉంది → - *ఆమెకు జ్వరంగా ఉండటం జరిగింది.

ప్రేరణార్థకం : సకర్మక క్రియను కొన్ని ప్రత్యయాల ద్వారా కాని, అనుబంధ క్రియల ద్వారా గాని ప్రేరణార్థక క్రియగా మార్చవచ్చు. సకర్మక క్రియా వాక్యంలో కర్తకు ప్రేరణంలో

చేత వర్ణకం చేరుతుంది. దీన్నే బాలవ్యాకర్త 'కర్తకు చేతవర్ణకంబగు' అనే సూత్రం ద్వారా సూచించాడు. ఉదా: *గూండాలు కార్మిక నాయకుణ్ణి చంపారు. యజమాని గూండాల చేత కార్మిక నాయకుణ్ణి చంపించాడు.*

కర్మణిలోనూ ప్రేరణలోను చేత ప్రత్యయం గుప్త నిర్మాణపు (మూల) కర్తకు చేరుతుంది. ప్రేరణ వాక్యాలను కర్మణి వాక్యాలుగా మార్చినప్పుడు గుప్త నిర్మాణపు కర్త లోపిస్తుంది.

ఉదా : కార్మిక నాయకుడు యజమాని చేత చంపించబడ్డాడు. కాని * *కార్మిక నాయకుడు గుండాల చేత యజమాని చేత చంపించబడ్డాడుఅనే వాక్యంలో మూలవాక్యపు కర్త లోపించకపోవటం వల్ల తప్పు అవుతుంది.*

ఒక్కోసారి భిన్న విభక్తి యోగంలో ప్రేరణార్థక వాక్యాల క్రియలు విభక్తి బంధాలతో భిన్నసంబంధాలను చూపిస్తయ్. ఉదా: *a. సుబ్బారావు రామారావుని చదివిస్తున్నాడు. b. సుబ్బారావు రామారావు చేత చదివిస్తున్నాడు. c. సుబ్బారావు రామారావుని బజారుదాకా నడిపించాడు. d. సుబ్బారావు రామారావు చేత బజారుదాకా నడిపించాడు.* ద్వితీయావిభక్తి ఉన్న నామబంధాన్ని మూలవాక్యంలో కర్తృపదం కాదనలేం. అయితే తృతీయా విభక్తి యోగంలో కర్తృత్వానికి లోపంలేదు. ద్వితీయా విభక్తి యోగంలో కర్తృత్వం న్యూనీకరించ బడింది.

**ఆత్మార్థకాదులు :** ధాతువుకు *కొను* అనే ధాతువును, అనుబంధించటం వల్ల, ఆత్మార్థక క్రియా ప్రాతిపదిక ఏర్పడుతుంది. కొన్ని ధాతువుల కిది అసలు చేరదు. మరికొన్ని ధాతువు లిది లేకుండా ప్రయోగించటానికి వీల్లేదు. మిగతా ధాతువులకు కొన్నిటికి ఇది చేరవచ్చు. *ఊరుకొను, పుచ్చుకొను* ధాతువులలో కొను నిత్యంగా ఉండాలి. *ఎరుగు, కూర్చుండు, తిను, పెరుగు, పోవు, వచ్చు,* వెళ్లు వంటి ధాతువుల కిది అసలు చేరదు. ధాతువుల అర్థపరిశీలన విశేషంగా జరిగినప్పుడు ఏ రకపు ధాతువులకు ఇది చేరుతుందో చెప్పటం సాధ్యం అవుతుంది. కొన్ని సకర్మక ధాతువుల కిది చేరటం వల్ల ఆత్మార్థకతతో పాటు, అకర్మకతను కూడా సంతరించుకొంటుంది. ఉదా : *అతను తలుపు తెరిచాడు. తలుపు తెరుచుకొన్నది. అతను తలుపు మూశాడు, తలుపు మూసుకొన్నది.* కాని అన్ని క్రియలకూ ఇది సాధ్యం కాదు. 'అతను తలుపు వేశాడు' ఉంది కాని 'తలుపు వేసుకొన్నది' తనంతట తాను అనే అర్థంలో లేదు.

కొన్నిచోట్ల ఈ రకపు క్రియలు స్వప్రయోజనాన్ని సూచిస్తయ్.

ఉదా: అతను నాకు తనగోడు చెప్పాడు. అతను నాకు తన గోడు చెప్పుకున్నాడు.

పారస్పర్యార్థం ఉన్న క్రియలతో ప్రయోగించినప్పుడు పారస్పర్యార్థాన్ని బోధిస్తుంది.

ఉదా : వాళ్ళు కొట్టుకున్నారు, తిట్టుకున్నారు, మాట్లాడుకున్నారు, తన్నుకున్నారు మొ// సహజంగా వీటిల్లో కర్త బహువచనంలో ఉండాలి. ఏకవచన కర్త ఉన్నప్పుడు ఆత్మార్థం వస్తుంది. ఉదా : *తన్ను తాను కొట్టుకున్నాడు, తిట్టుకున్నాడు తనలో తాను మాట్లాడుకున్నాడు మొ.* కొన్ని క్రియలకిట్లా సాధ్యం కాదు. ఉదా : వాళ్ళు పోట్లాడుకున్నారు. కాని *అతను (తనలో తాను)* పోట్లాడుకున్నాడు అనే వాక్యం లేదు.

కొను చేర్చిన ధాతువులు కొన్ని అర్థ విశేషాలు సంతరించుకున్నాయ్. ఉదా : అడుగు- అడుక్కొను, పడు - పడుకొను.

వివిధార్థాలలో పెట్టు, వేయు, వేయు, పోవు, కొట్టు, తీయువంటి ధాతువులు అనుబంధించటం వల్ల విశేషార్థాల్లో భిన్న ప్రాతిపదికలు నిష్పన్నమవుతయ్.

అన్నంత క్రియలకు ధాతువులను చేర్చటం ద్వారా, సామర్థ్యార్థకాది వివిధ ప్రాతిపదికలు తయారవుతై.

*వాక్యవిశేషార్థ బోధ* : తెలుగు వాక్యాల్లో కొన్ని అర్థ ప్రభేదాలను కలిగించగల శబ్దాలు కొన్ని ఉన్నై. వీటిల్లో కొన్ని పదాలు, మరికొన్ని అపదాలు. 1. అంట > అట > ట; 2. కదా, కదూ, కదే. గా. 3. ఏ, వే, రా, రోయ్, ఓయ్ 4. అండి; 5. లే; 6. ఏమో, ఓ; 7. ఆ (ప్రశార్థకం) 8. ఏ (అవధారణార్థకం) వీటిని క్రియలకే కాక వాక్యంలో ఏ పద బంధానికయినా తగిలించవచ్చు. ఇవి చేర్చిన పదాలు ప్రాముఖ్యాన్ని చెందుతై. అందువల్ల ఇంతకు ముందు సూచించినట్లుగా విధేయాలవుతై. క్రియ కూడా నామ్నీకృత మవుతుంది. ఈ శబ్దాలు చేరిన పదబంధాలు నామ్నీకృత క్రియను దాటుకొని చివరికి జరగవచ్చు.

ఉదా : *ఆయన ఊరి నుంచి వచ్చాడట, ఆయనట ఊరి నుంచి వచ్చింది. ఊరి నుంచి వచ్చింది ఆయనట.*

*సంబంధబోధక వాక్యాలు :* వీటినే ఇంగ్లీషులో relative clauses అంటారు. వీటిల్లో యత్తదర్థ బోధక వాక్యాలు సంస్కృతం నుంచి వచ్చినయ్యని శాసన పరిశోధకులు కొందరూహించారు. కాని విరళమైనంత మాత్రాన ఇతర భాషల నుంచి వచ్చినట్లుగా ఊహించటం సమంజసం కాదు. ఉదా: ఏం తెచ్చావో అది చూపించు, ఎవరిక్కావాలో వాళ్ళే వస్తారు.

లుప్త విభక్తిక నామ్నీకరణ ప్రణాళిక తెలుగు మొదలయిన ద్రావిడ భాషల్లో విస్తృతంగా ఉంది. ఈ ప్రణాళిక కొద్దిపాటి భేదాలతో ఒరియా, బెంగాలీ, నేపాలీ భాషల్లో కూడా ఉండటం విశేషం. నేపాలీ ప్రణాళిక బెంగాలీ కన్నా తెలుగుకు ఎక్కువ సన్నిహితంగా ఉండటం మరీ విశేషం. అతి విస్తృతమైన ఈ ప్రణాళికను స్థూలంగా మాత్రమే ఇక్కడ ప్రదర్శిస్తాను.

ఈ ప్రక్రియలో వాక్యంలో క్రియ ధాతుజ విశేషణంగా మారి వాక్యంలో ఒక పదాన్ని విశేష్యంగా గ్రహిస్తుంది. ఆపదాలకు విభక్తి ప్రత్యయాలు ధాతుజ విశేషణ యోగంలో లోపిస్తయ్.

ఉదా : (1) అతను బెల్లం తిన్నాడు → బెల్లం తిన్న అతను, అతను తిన్న బెల్లం.

ఈ పైన కర్తృ, కర్మ పదాలు క్రమంగా ధాతుజ విశేషణాలకు విశేష్యాలయినై. ఈ ప్రక్రియ ఉన్న అన్ని భాషల్లో కర్తృ, కర్మ పదాలతో ఇట్లాంటి నామబంధాలు సాధ్యం. తెలుగులో సాధ్యమయిన మరికొన్ని :

కరణార్థంలోతో : సుజాత కలంతో పరీక్ష రాసింది ⇒ సుజాత పరీక్ష రాసిన కలం.

అముఖ్య కర్మ : నేను ఆ అమ్మాయితో ఒక రహస్యం చెప్పాను → నేను రహస్యం చెప్పిన అమ్మాయి.

గమ్యార్థం : ఆమె ఊరికి వెళ్లింది → ఆమె వెళ్లిన ఊరు.

సామాన్య అధికరణం : మా ఆవిడ భరిణలో డబ్బు దాస్తుంది → మా ఆవిడ డబ్బు దాచే భరిణ.

విశేషాధికరణం ఉన్న చోట ఈ రకం ప్రక్రియ పొసగదు.

మా ఆవిడ పరుపు కింద డబ్బు దాస్తుంది →

* మా ఆవిడ డబ్బు దాచే పరుపు.

ఈ రకపు వాక్యాల మీద విశేషంగా పరిశోధన జరిగింది. వీటిమీద ఇతరత్రా చాలా చర్చ జరిగింది. కేవల ప్రక్రియా సూచనే ఇక్కడి ప్రయోజనం. (చూ. తెలుగులో వెలుగులు)

సంశ్లిష్ట వాక్యాలు : తెలుగులో రకరకాల సంశ్లిష్ట వాక్యాలున్నై. వీటి మీద కూడా కొంత విశేషమైన పరిశోధన జరిగింది. అయితే అన్ని విషయాలు స్పష్టపడినయ్యని కాదు. కనీసం కొన్ని సమస్యలు బయటికి వచ్చినై. కొన్నిటిని గురించి మన అవగాహన పెరిగింది.

తెలుగులో క్త్వా, శతృ, అపి, చేదాద్యర్థకాలు అసమాపక క్రియల ద్వారా వ్యక్తమవుతై; ద్రావిడ భాషలన్నిటిలోనూ అదే పద్ధతి ఉంది.

క్త్వార్థకం : కాలక్రమాన్ననుసరించి జరిగే వ్యాపారాల్ని ఆ క్రమాన్ననుసరించి భాషలో వ్యక్తం చేసే పద్ధతిలో క్త్వార్థకం వచ్చింది. ఈ పద్ధతి అన్ని భాషల్లోనూ లేకపోవచ్చు. కాలక్రమాన్ననుసరించిన వ్యాపారాలను ఆ వరసలో అసమాపక క్రియల ద్వారా వ్యక్తం చెయ్యటం ఒక పద్ధతి. పూర్వ పూర్వ వ్యాపారాలను పూర్వ పూర్వ క్రియలను క్త్వార్థక క్రియలు చెయ్యటం ద్వారా ఈ పనిని సాధించటం ఈ ప్రక్రియలో విశేషం. ధాతువుకు ఇ అనే ప్రత్యయం చేర్చటం ద్వారా ఈ క్రియా రూపం ఏర్పడుతుంది. క్త్వార్థక క్రియా ప్రయోగాలను గురించి బయట పడిన విశేషాలను ఈ కింది విధంగా సూక్ష్మీకరించవచ్చు.

( 1 ) క్త్వార్థక క్రియ పూర్వ వ్యాపారాన్ని సూచించేట్టయితే క్త్వార్థక క్రియలకూ, ప్రధానక్రియలకూ కర్తృపదం ఒకటే అవుతుంది. దీన్ని సమాన కర్తృక నియమం అనవచ్చు.

ఉదా : సుజాత అన్నంతిని నిద్రపోయింది. కాని **సుజాత అన్నంతిని సుశీల నిద్రపోయింది* అనే *వాక్యం తప్పు*.

( 2 ) సమాన కర్తృక శబ్దాల్లో ఒకటి తప్పనిసరిగా లోపించాలి.

ఉదా : * సుజాత అన్నంతిని సుజాత నిద్రపోయింది అనే వాక్యం తప్పు. సుజాత *అన్నం తిని నిద్రపోయింది, అన్నం తిని సుజాత నిద్రపోయింది* - అనే వాక్యాలు వ్యాకరణ సిద్ధాలు.

( 3 ) సమాన కర్తృక నియమం గుప్త నిర్మాణంలోదీ కాదు, వ్యక్త నిర్మాణంలోదీ కాదు. క్త్వార్థక క్రియ ఏర్పడే సమయంలో వాక్యంలో సమాన కర్తృక నియమం వర్తిస్తుంది. అంటే ఉపవాక్యాల్లో ఒకటి కానీ, కొన్ని కానీ, అన్ని కానీ కర్మణి వాక్యాలై ఉండవచ్చు. ఉదా: *సుబ్బారావు సుజాతను తిరస్కరించి అవమానించాడు. సుజాత సుబ్బారావు చేత తిరస్కరించబడి అవమానించింది. సుజాత సుబ్బారావు చేత తిరస్కరించబడి అవమానించ బడింది.*

( 4 ) స్వతంత్రమైన భిన్న వ్యాపార బోధలో సమాన కర్తృక నియమం అవసరమైనా పరస్పర విరుద్ధ బోధ ఉన్న క్రియలు (polar verbs ) వాడినప్పుడు విషమ కర్తృకతను క్త్వార్థక వాక్యాలు సహిస్తయ్. ఉదా: *బెంగాలులో కాంగ్రెసు వాళ్ళు ఓడిపోయి కమ్యూనిస్టులు గెల్చారు. ఆంధ్రలో ప్రతియేటా పాత ముఖ్య మంత్రి పోయి కొత్త ముఖ్యమంత్రి వస్తాడు.*

ఈ వాక్యాల్లో ఓడిపోవు - గెల్చు, పోవు - వచ్చు అనే క్రియల్లో ఉన్న వైరుధ్యం స్పష్టమే. అయితే ఈ రకమైన వైరుధ్యం ఉన్న వాక్యాలన్నీ వ్యాకరణ సమ్మతమవుతాయా ? అంటే గట్టిగా చెప్పలేము. (?) ఆమె లోపలికి వచ్చి నేను బయటికి వెళ్ళాను, (?) ఆమె నిద్రపోయి, నేను మేలుకున్నాను. వంటి వాక్యాలు అంత సహజంగా కనపట్టం లేదు.

(5) క్త్వార్థక వాక్యాలు ఆనుపూర్విక సంబంధాన్ని తెలుపుతూ ప్రధాన క్రియకు అవ్యవహితంగా వచ్చినప్పుడు రీత్యర్థాన్ని బోధిస్తయ్. అయితే ఈ అర్థం ఎప్పుడు వస్తుందో చెప్పడం కష్టం.

ఉదా : a. *సుజాత ఆఫీసుకు జడవేసుకొని వెళ్లింది* (ముడివేసుకొని వెళ్లలేదు); b. *సుజాత జడ వేసుకొని* (తరవాత) *ఆఫీసుకు వెళ్లింది.* పై వాక్యాల్లో వ్యక్తమైన వ్యాపారాలు వేర్వేరైనా ఒకదానికొకటి సంబంధమున్నవి. మొదటి వ్యాపార ఫలితమైన స్థితి, రెండో వ్యాపారం సాగుతున్నప్పుడు కూడా ఉంటుంది. నిజానికి ఇది వ్యాపార రీతిని బోధిస్తుందనటం కన్నా కర్తృ స్థితిని బోధిస్తుందనటం సమంజసం. ప్రాచీన కావ్య భాషలో కూడా ఈ పద్ధతి ఉంది. ఉదా : వదన సరోజంబు వస్త్రాంతమున గప్పికొని యేగె ధర్మనందనుడు (భార, సభా 2-302).

(6) ధాతువుకు అకుండా (<అక + ఉండా) ప్రత్యయం చేరిస్తే వ్యతిరేక క్త్వార్థకం తయారవుతుంది. ఈ క్రియ సర్వత్రా స్థితిబోధకంగానే కనిపిస్తుంది. ఉదా : *సుజాత స్నానం చెయ్యకుండా ఆఫీసుకు వెళ్లింది; సుబ్బారావు అన్నం తినకుండా కాలేజీకి వెళ్లాడు.* అనుపూర్విక సంబంధానికిక్కడ ప్రాముఖ్యం లేదనాలి. అంటే జరిగిన వ్యాపారాల మధ్యనే ఆనుపూర్విక సంబంధం ఉంటుంది కాని, వ్యాపార భావాభావాల మధ్య అట్లాంటి సంబంధం ఉండదనాలి.

(7) వ్యతిరేక క్త్వార్థకక్రియ ఉన్నప్పుడు భిన్నకర్తృకత సహ్యమే. అప్పుడు వ్యతిరేక క్త్వార్థకం లక్ష్యార్థాన్ని బోధిస్తుంది. ఉదా : గొడ్లు లోపలికి రాకుండా ఆ ఇంటికి ప్రహారీ గోడ కట్టించారు : ప్రజలు తిరగబడకుండా మిలిటరీ అడ్డుకుంటుంది.

(8) క్త్వార్థక క్రియ ఉన్న వాక్యాల్లో ప్రధాన క్రియ వ్యతిరేక క్రియ అయితే వ్యతిరేక తాప్తతివల్ల భిన్నార్థ బోధకత వస్తుంది. ఉదా : *సుబ్బారావు అన్నం తిని కాలేజీకి వెళ్లలేదు* అనే వాక్యానికున్న రెండర్థాలు ఈ తరవాత వాక్యాల్లో విశదమవుతై. a. సుబ్బారావు *అన్నం తిని కాదు కాలేజీకి వెళ్లింది, (పెసరట్లు తిని)* : b. సుబ్బారావు అన్నం తిన్నాడు కాని కాలేజీకి వెళ్ల లేదు.

(9) క్త్వార్థక క్రియ ఒక్కోసారి ప్రధాన వ్యాపార రీతిని బోధిస్తుంది. ఉదా : ఆ ఇంజనీరు లంచాలు తిని సంపాయించాడు. ఆ పంతులుగారు ప్రైవేట్లు చెప్పుకొని బతుకు తున్నాడు.

పై సూత్రీకరణలో స్థూలదృష్టికి రీతి అన్నా, దీనికి వేరే వివరణ ఇయ్యటం సాధ్యమే. వ్యాపార సాధనాన్ని సూచించేది కరణ కారకం. ఇది నామం ద్వారా వ్యక్త మవుతుంది. అట్లా కాకుండా ఒక వ్యాపారం, ఇంకో వ్యాపారానికి సాధనం (means) అయితే దీన్ని క్రియా సాధనం అనుకోవచ్చు. *సుజాత బస్సెక్కి బెజవాడ వెళ్ళింది* అనే వాక్యంలో కూడా ఇట్లాంటి అర్థమే కనిపిస్తుంది. *సుజాత బస్సు దిగి ఇంటికి వెళ్లింది* అనే వాక్యంలో ఈ అర్థం లేకపోవటం గమనించవచ్చు.

నడిచి వెళ్ళు, లాగి తన్ను వంటి వాటిలో కనిపించే క్త్వార్థకం వాక్య మూలకం కాదు. పదనిర్మాణ ప్రక్రియకు సంబంధించింది. భారతంలో ''పావనములైన శిరోజము లందెమల్చి పాపావహు డీడ్చి తెచ్చె'' (భార. సభా. 2-216) అనే ప్రయోగం ఉంది.

10. క్త్వార్థక క్రియ ప్రధాన క్రియకు హేత్వర్థక మవుతుంది. ఉదా : *సుజాత భర్తమీద అలిగి పుట్టింటికి వెళ్లింది, సుబ్బారావు కోడిగుడ్లు తిని బలిశాడు.* హేత్వర్థం వచ్చినప్పుడు ఏదో ఒక క్రియ దేహ మనస్స్థితి పరిణామాలను సూచించటం మనం గమనించ వచ్చు.

11. హేత్వర్థ బోధలో వ్యతిరేక క్త్వార్థకం వేరుగా ఉంటుంది. ఉదా :- *సుజాత అన్నం తినక చిక్కిపోయింది.* ఆధునిక భాషలో *సుజాత అన్నం తినక ఆఫీసుకు వెళ్ళింది* అనే వాక్యం వ్యాకరణ సమ్మతం కాదు. పై వాక్యంలో *తినకుండా* అనే క్రియ వాడితే సమ్మతమవుతుంది. కాని ప్రధాన క్రియ విధ్యర్థకమైనప్పుడు అక ప్రత్యయాంత క్రియలతో వాక్యాలు సాధ్యం - ఉదా : *ఊరికే నసపెట్టక బయటికి వెళ్ళు; పిచ్చివేషాలు వెయ్యక బుద్ధిగా చదువుకో.*

12. కాలబోధలో క్త్వార్థక క్రియా ప్రయోగం ఉంది. ఉదా : *సుజాత నిద్రపోయి వారం రోజులయింది.* ఈ రకం వాక్యాల్లో వారం రోజులు బహువచనంలో ఉండి ప్రధానక్రియ ఏకవచనంలో ఉండటం విశేషం. *వారం రోజుల కాలపరిమితి* అని అర్థం చెప్పుకోవాలి. కాల పరిమాణాన్ని సూచించే నామాలే ఈ వాక్యాల్లో ఉంటై. నిన్న మొన్న వంటి మాటలుండవు. పైన ఉదాహరించిన వాక్యం ''*సుజాత వారం రోజుల క్రిందట నిద్రపోయింది*'' అనే వాక్యంతో సమానార్థక మవుతుంది.

13. వ్యాపారాభావాన్ని సూచించటానికి అక ప్రత్యయాంత వ్యతిరేకక్త్వార్థకం ఉపయోగిస్తుంది.

ఉదా : *సుజాత నిద్రపోక వారం రోజులయింది. నిద్రపోకుండా* అనే రూపం వాడితే వాక్యం తప్పు అవుతుంది.

శత్రర్థకం : ధాతువు కు తూ అనే ప్రత్యయం చేరిస్తే శత్రర్థక రూపం వస్తుంది. క్త్వార్థక క్రియకున్న విశేష ప్రయోజనాలు శత్రర్థక క్రియకు లేవు. ఏకకాలంలో జరిగే వ్యాపారాల్ని బోధించటం శత్రర్థక క్రియ ప్రధాన ప్రయోజనం. ఉదా : *సుజాత వంట చేసుకుంటూ కబుర్లు చెపుతుంది.* ఒక్కోసారి శత్రర్థక క్రియ అవ్యవహిత పూర్వ వ్యాపారాన్ని సూచిస్తుంది. ఉదా : *సుబ్బారావు నవల చదువుతూ నిద్రపోతాడు.* కొన్నిచోట్ల శత్రర్థక క్రియకు కూడా రీత్యర్థ బోధ ఉంది. ఉదా : *సుజాత నవ్వుతూ మాట్లాడుతుంది. సుబ్బారావు ఏడుస్తూ పాఠం చెపుతాడు.*

*శత్రర్థక వాక్యాలకు కూడా సమాన కర్తృక నియమం ఉంది.*

చేదర్థకం : సాంప్రదాయికంగా చేదర్థకం అని పిలిచే క్రియారూపం ధాతువుకు (ఇ) తే అనే ప్రత్యయం చేరటం వల్ల ఏర్పడుతుంది. దీని వ్యతిరేక రూపం అక ప్రత్యయాంతానికి పోతే అనే రూపాన్ని తగిలిస్తే ఏర్పడుతుంది. ఉదా : *పాలకులకు అవసరం వస్తే ఉపన్యాసాల జోరు పెరుగుతుంది; పోలీసులకు కరుణ కలిగితే జైల్లు ప్రజలకు స్వాగతం చెప్తై.* ఈ వాక్యాలతో భవిష్యద్బోధక క్రియ ఉండటం గమనించ దగింది. విధ్యర్థక క్రియను భవిష్యత్కాల బోధకంగానే గ్రహించాలి. ఉదా : *మంచి ఉద్యోగం వస్తే వెళ్ళిపో.*

చేదర్థకంలో గర్భితంగా వ్యాపార క్రమానుగతి ఉంది. ప్రధాన క్రియ భూతకాలిక మైనప్పుడు ఈ క్రమం పైకి వస్తుంది. క్త్వార్థక క్రియ ఏక కర్తృక వ్యాపార క్రమాన్ని సూచిస్తే చేదర్థక క్రియ భిన్న కర్తృక వ్యాపార క్రమాన్ని సూచిస్తుంది. ఉదా : *సుబ్బారావు వస్తే సుజాత చివాట్లు పెట్టింది, సుబ్బారావు రాకపోతే సుజాత బాధపడింది.*

సంభావ్యమాన వ్యాపారాల మధ్యనేగాని, సమాప్తి నందిన వ్యాపారాల మధ్య చేదర్థ బోధకత లేదు. తెలుగులో భూతకాలంలో సంభావ్యయోగ్యమైన ప్రత్యేక క్రియా రూపం లేదు. క్రియాజన్య విశేషణం మీద నిర్మించబడ్డ నామమే ఈ పనిని నిర్వహిస్తుంది. భూత కాల సంభావనలో సమాపక, అసమాపక క్రియల్లో కొన్నిటికి గాని అన్నిటికి గాని *ఉండు* ధాతువు అనుప్రయుక్తం కావచ్చు. అప్పుడు ప్రధాన ధాతువు క్త్వార్థక సమరూపకమవుతుంది.

ఉదా : జ్వరం తగ్గితే కాలేజీకి వెళ్ళేవాడు; *జ్వరం తగ్గి ఉంటే కాలేజీకి వెళ్ళేవాడు;*

*జ్వరం తగ్గితే కాలేజీకి వెళ్ళి ఉండేవాడు; జ్వరం తగ్గి ఉంటే కాలేజీకి వెళ్ళి ఉండేవాడు.*

ఈ వాక్యాల్లో ప్రధానాఖ్యాతానికి వ్యతిరేక రూపం సమీకరణ వాక్యాలకు లాగే ఉంటుంది.

పూర్వం ప్రస్తావించిన విశేషార్థ బోధక శబ్దాలు (కా, కదా, ఆ మొ॥) చేదర్థక క్రియకు చేరొచ్చు. అప్పుడు అఖ్యాతంలో లింగ, వచన, కాలబోధకతలు, లుప్తమవుతై.

ఉదా : జ్వరం తగ్గితే కదా మేం ఊరికి వెళ్ళేది.

ప్రధానాఖ్యాతం ఇక్కడ భవిష్యద్బోధకం కూడా కావచ్చు.

చేదర్థక వాక్యాల్లో ఏక, భిన్న కర్తృక నియమం లేదు, ఏక కర్తృకమైనప్పుడు ఒక కర్త లోపిస్తుంది. ప్రధాన క్రియ భూతకాలికమైతే సమాన కర్తృకత సహ్యం కాదు. ఉదా: సుబ్బారావు హోటలు కెళ్తే పెసరట్టు తింటాడు. * *సుబ్బారావు హోటలు కెళ్తే పెసరట్టు తిన్నాడు.*

ఇట్లాంటిచోట్ల చేదర్థక క్రియబదులు క్త్వార్థక క్రియ ఉపయోగిస్తారు. అయితే చేదర్థక క్రియ హేత్వర్థకమైతే ప్రధాన క్రియ భూతకాలికం కావచ్చు. అప్పుడు సమాన కర్తృకత కూడా సాధ్యమే. ఉదా : *సుబ్బారావు కోడి గుడ్లు తింటే బలిశాడు. తింటే* బదులు *తిని* అని ఉపయోగించినా ఇక్కట అర్థ భేదం రాదు.

ఇంతవరకు చర్చించిన చేదర్థక వాక్యాల్లో పూర్వ పరవ్యాపారాల మధ్య ఒక లంకె ఉంది. చేదర్థక రూపం తరువాత *తప్ప*, *కాని* శబ్దాలు వాడితే ఆ లంకెకు వైరుద్ధ్యం ఏర్పడుతుంది. ప్రధాన క్రియను వ్యతిరేక క్రియగా మారిస్తే ఈ వైరుద్ధ్యం పోతుంది.

ఉదా : ప్రజలు మేలుకుంటే తప్ప, (కాని) పౌర హక్కులుండవు.

ఈ రకపు వాక్యాల్లో ప్రధాన క్రియ భూతకాలంలో ఉండవచ్చు.

ఉదా : కార్మికులు సమ్మెచేస్తే గాని యజమానులు లొంగి రాలేదు.

అప్యర్థకం : ధాతువుకు *ఇనా* అనే ప్రత్యయం చేర్చటం వల్ల అప్యర్థక, క్రియ ఏర్పడుతుంది. చేదర్థకం వ్యాపారానుబంధతను సూచిస్తే అప్యర్థకం వ్యాపార నిరనుబంధ తను సూచిస్తుంది. అందుకే రెండు వ్యాపారాల మధ్య వైరుద్ధ్యం కూడా ఉంటుంది.

ఉదా : *సుజాత ఆకలి అయినా అన్నం తినదు; సుబ్బారావు ఆకలి కాకపోయినా అన్నం తింటాడు.* పై వాక్యాల్లో అప్యర్థక క్రియ తర్వాత అర్థసువ్యక్తత కోసం కూడా అనే అవ్యయాన్ని చేర్చుకోవచ్చు. కాని అనే శబ్దాన్ని చేర్చినా అర్థంలో మార్పు రాదు.

ఈ కాని శబ్దాన్ని క్త్వా, శతృ, చేదర్థక క్రియల తరవాత వాడితే ప్రధాన క్రియ వ్యతిరేకంగా మారాల్సి ఉంటుంది. అప్యర్థక వాక్యాల్లో అట్లా జరగదు. అందువల్ల క్త్వా, శతృ, చేదర్ధక వాక్యాలను సానుబద్ధ వాక్యాలని, అప్యర్థక వాక్యాలను నిరనుబద్ధ వాక్యాలనీ పిలవవచ్చు.

అసమాపక క్రియలు వ్యతిరేకంలో ఉంటే కాని, తప్ప అనే శబ్దాలు చేర్చటానికి వీల్లేదు.

సమాపక క్రియలకు లాగా అసమాపక క్రియల నిశ్చయార్థక - వ్యతిరేకార్థక రూపాల మధ్య సమ సంబంధం లేకపోవటం తెలుగులో ఒక విశేషం.

ఇవికాక వ్యాపారాల మధ్య కాలవ్యవధిని, అవ్యవధిని, హేతువును సూచించే వివిధ ప్రక్రియలు తెలుగులో ఉన్నై. వాటిమీద ఇంకా పరిశోధన జరగాల్సి ఉంది. ఈ వాక్యాలు ఉదాహరణ ప్రాయాలు.

ఉదా : 1. సుబ్బారావు నిద్రలేవగానే కాఫీ తాగుతాడు.

2. సుజాత నిద్రలేవటంతోటే మొహం కడుక్కుంటుంది.

3. సుబ్బారావు కాఫీ తాగేక (తాగినాక, తాగిన తరవాత) వక్కపొడి వేసుకుంటాడు.

4. సుజాత అన్నం తినకముందు స్నానం చేస్తుంది.

5. సుబ్బారావు స్నానం చేసేటప్పుడు కూనిరాగాలు తీస్తాడు.

6. సుజాత స్నానం చేసే ముందు జుట్టుముడి వేసుకుంటుంది.

ఈ పై వాక్యాల్లో వ్యాపారాల మధ్య కాలసంబంధాలు సూచితమవుతున్నయ్. వీటిల్లో ఏక భిన్న కర్తృక నియమం లేదు. ఏకకర్తృకమైనప్పుడు సమానకర్తృశబ్ద లోపం జరుగు తుంది.

హేత్వర్థకం : క్త్వార్థక వాక్యాల్లో కొన్ని వ్యాపారాల మధ్య ఉన్న సంబంధాన్ని బట్టి హేత్వర్థం రావచ్చు. అక్కడ హేతువుకన్నా వ్యాపారాను పూర్వబోధ ప్రధానం. అన్నంత క్రియకు బట్టి (పట్టి) అనే రూపాన్ని సంధించటం ద్వారా హేత్వర్థక క్రియ తయారవు తుంది. ఉదా : *సుజాతకు ఫస్టుక్లాసు రాబట్టి ఉద్యోగం వచ్చింది; సుబ్బారావుకు రికమండేషన్ ఉండబట్టి ఉద్యోగం దొరికింది.*

ఈ *బట్టి* వాక్యాలతో క్త్వార్థక క్రియకులాగే కాలపరిమాణ బోధలో ప్రయోగం ఉంది. ఉదా : సుబ్బారావు సిగరెట్లు కాల్చబట్టి ఎన్నాళ్ళయింది ? సుజాత ఉద్యోగం

చెయ్యబట్టి ఐదేళ్ళయింది. క్త్వార్థక క్రియకు కాలబోధలో ఉన్న విధి నిషేధాలే ఇక్కడా ఉన్నై.

వ్యాపార పరిసమాపక కాలాన్ని క్త్వార్థక క్రియ సూచిస్తే వ్యాపార అవిచ్ఛిన్నతను ఈ బట్టి - క్రియ సూచిస్తుంది. క్త్వార్థక క్రియలు కిందట - వాక్యాలతో సమానార్థకాలయితే బట్టి-వాక్యాలు నుంచి-వాక్యాలతో సమానం. ఉదాహరణలను పోల్చి చూస్తే విషయం స్పష్టపడుతుంది.

(ఎ) 1. సుజాత నిద్రపోయి వారం రోజులయింది.

2. సుజాత వారం రోజుల కిందట నిద్రపోయింది.

(బి) 1. సుజాత ఉద్యోగం చెయ్యబట్టి ఐదేళ్ళయింది.

2. సుజాత ఐదేళ్ళ నుంచి ఉద్యోగం చేస్తున్నది.

పై వాక్యంలో నుంచి బదులు బట్టి అనే శబ్దం కూడా ప్రయోగించవచ్చు. క్త్వార్థక క్రియతో కాలబోధ వ్యాపార అభావవ్యాప్తిని సూచిస్తే, బట్టి క్రియ వ్యాపార వ్యాప్తిని సూచిస్తుంది. దీన్ని బట్టి ఈ రెండింటి పూరక ప్రయోజనాలను గుర్తించవచ్చు.

**అనుకృతి :** భావవ్యక్తీకరణను భాషలో అనుకరించటాన్ని అనుకృతి లేక అనుకరణం అంటారు. అనుకృతిలో వక్త శ్రోతలు వేరువేరుగాను ఉండవచ్చు, ఒకరే కావచ్చు. అనుకృతి లేని భాష ఉండదు. అనుకృతిని ప్రత్యక్ష పరోక్ష అనుకరణలుగా విభాగించటం పరిపాటి. ప్రత్యక్ష పరోక్షానుకరణల మధ్య కొన్ని భేదాలను గమనించవచ్చు.

ప్రత్యక్షానుకరణ శబ్ద ప్రధానమైనది. ప్రత్యక్షానుకరణలో అనుకృతాంశం మూలానికి దగ్గరగా ఉండేట్టు వక్త ప్రయత్నం చేస్తాడు. అందువల్ల దీనికి భాషాపరిమితి లేదు, వాక్య పరిమితి లేదు. మానవభాషే ఉండాలన్న నియమం లేదు. కుక్క 'భౌభౌ' మంది అనే విధంగా జంతువుల అరుపులను కూడా అనుకరించవచ్చు. శ్రావ్యమైన ప్రతిదీ అనుకరణ యోగ్యమే. *నాలుక చురుక్కు మన్నది, ఒళ్లు జిల్లుమన్నది. వాసన గుప్పుమన్నది* వంటి ఉదాహరణలు పరిశీలిస్తే తెలుగులో అనుకృతికున్న విస్తృత పరిస్థితి తెలుస్తుంది.

పరోక్షానుకృతిలో భాషానియమం ఉంది. ఈ పద్ధతిలో అనుకరించేది భాషలో వాక్యమై ఉండాలి. పరోక్షానుకృతిలో భావం ప్రధానం. అనుకృతాంశంలో చెప్పే పద్ధతి ప్రధానం కాదు.

ప్రత్యక్ష పరోక్షానుకృతులకు దగ్గరి సంబంధం ఉంది. ప్రత్యక్షానుకృతిని పరోక్షాను కృతిగా మార్చే పద్ధతులు భాషల్లో భిన్నంగా ఉండవచ్చు. కొన్ని సామాన్య పద్ధతులున్నై.

అనుకృతాంశంలో ఉత్తమ పురుష ప్రధాన వాక్యంలో కర్తతోనూ, మధ్యమ పురుష ఆముఖ్య కర్మతోనూ సమీకృతమవుతై. ఇది వాక్యనిర్మాణ సంబంధమైన సమీకరణ (syntactic assimilation).

ఉదా : 1. నువ్వు నాతో 'నేను వస్తాను' (అని) అన్నావు

నువ్వు నాతో నువ్వు 'వస్తాను' (అని) అన్నావు.

2. అతను నాతో 'నేను వెళ్తున్నాను' (అని) అన్నాడు.

అతను నాతో తను వెళ్తున్నాను (అని) అన్నాడు.

3. నేను ఆమెతో 'నువ్వు వస్తున్నావు' అన్నాను.

నేను ఆమెతో తను వస్తున్నది అన్నాను.

ఈ పై వాక్యాలను పరిశీలిస్తే కొన్ని విషయాలు తెలుస్తయ్. అను ధాతునిష్పన్న క్రియా అవ్యవహిత యోగంలో అని శబ్దానికి వికల్పంగా లోపం వస్తుంది. అని శబ్దం ప్రత్యక్ష, పరోక్షానుకృతులు రెండిట్లోనూ ఉండవచ్చు. తను శబ్దాదేశం అనుకృతాంశంలో ఉత్తమ మధ్యమ పురుషులకు రెండింటికి వస్తుంది.

తను శబ్దం కర్తగా ఉన్నప్పుడు అనుకృతాంశపు క్రియలలో ఒకసారి ఉత్తమ పురుష, ఒకసారి ప్రథమ పురుష ప్రత్యయాలున్నై.

తన శబ్దాదేశం ప్రథమ పురుషకే వస్తుందని భాషలో ఇతరత్రా మనకు సాక్ష్యం ఉంది. ఆమె మాటే నెగ్గించుకుంటుంది. అనే వాక్యంలో తనమాట అంటే ఆమె మాట అని అర్థం అన్నమాట. ప్రథమ పురుష నామ, సర్వనామ పునరుక్తిని తప్పించటం కోసం తెలుగుభాష ఎన్నుకున్న పద్ధతి ఇది. *నేను తన మాట నెగ్గించుకున్నాను అనే వాక్యం తప్పు. పై అనుకృతి వాక్యాల్లో సర్వనామ సమీకరణం జరిగిన తర్వాత ఏకవస్తు బోధకమైన ప్రథమ పురుషనామ సర్వనామాలకు తను శబ్దాదేశం జరిగింది.

సమీకరణలో మారింది మధ్యమ పురుష సర్వనామం అయితే, పురుషబోధక క్రియా విభక్తి, మారిన కర్త ననుసరించి వస్తుంది. మారింది ఉత్తమ పురుష అయితే పురుష బోధక క్రియా విభక్తి, మారని కర్త ననుసరించి ఉంటుంది. ఉత్తమ పురుష మారిన

తరవాత కూడ క్రియావిభక్తిని గుప్పెట్లో ఉంచుకోటం విశేషం. ఇందుకు ఏదయినా లోతైన కారణం ఉంటే ఉండవచ్చు.

అనుకృత వాక్య భేదాల్ని బట్టి పరోక్షానుకృతిలో కొన్ని జరుగుతై. అనుకృత వాక్యం విధి బోధకమైతే ఈ కింది విధంగా ఉంటుంది.

సుజాత సుబ్బారావుతో ''నువ్వు త్వరగా రా'' అన్నది - సుజాత సుబ్బారావును త్వరగా రమ్మన్నది. ఇక్కడ జరిగిన మార్పులు. 1. రా అనే క్రియ రమ్మ అని మారింది. అనుకృతవిధి క్రియకు పరోక్షానుకరణలో కారాగమం జరుగుతుంది. రా + మ్ రమ్మ అనేది తరవాత జరిగిన మార్పు.

2. ఇంతకు పూర్వం చెప్పినట్టుగా అనుకృత వాక్యంలోని మధ్యమపురుష కర్త అముఖ్యకర్మతో సమీకృతమవుతుంది. (అముఖ్య కర్మ పదలోపం వికల్పం).

3. సమీకృతి తరువాత అనుకృతాంశపు కర్తకు ద్వితీయా విభక్తి చేరుతుంది.

తెలుగులో కర్మపదానికే ద్వితీయావిభక్తి చేరుతుంది. పై వాక్యంలో సుబ్బారావును కర్మపదంగా సంభావిస్తే ఏ క్రియకు దీన్ని ముడిపెట్టాలి అనేది సమస్య. దానికి సరైన పరిష్కార మార్గం ఇంకా దొరకలేదు.

అనుకృత వాక్యం క్రియారహిత (సమీకరణ) వాక్యమయితే గమనించాల్సిన విశేషాలు కొన్ని ఉన్నై.

ఎ. అతను నాతో 'నువ్వు విచిత్రమైన వాడివి' (అని) అన్నాడు -

బి. అతను నాతో 'నేను విచిత్రమైన వాడిని' (అని) అన్నాడు -

సి. అతను నన్ను విచిత్రమైనవాడు (అని) అన్నాడు.

పై వాక్యాల్లో 'ఎ' నుంచి 'బి' కి జరిగిన పరివర్తనలో అనుకృతాంశపు కర్త అనకర్తృ వాక్యపు అముఖ్యకర్మతో సమీకృతి పొందటం మారింది. మధ్యమ పురుష క్రియ కాబట్టి క్రియా విభక్తి (పురుషబోధక అఖ్యాత ప్రత్యయం) మారిన క్రియననుసరించి మారటం యథావిధిగా జరిగినై. (సి) వాక్యంలో జరిగిన మార్పు సరిగ్గా అనుకృత విధి వాక్యాల్లో మాదిరిగా జరగటం విశేషం. ఇక్కడా అదే సమస్య. నన్ను అనే ద్వితీయావిభక్తిని ఏ క్రియతో ముడిపెట్టాలి ? ఇక్కడ గమనించాల్సిన విశేషం ఇంకొకటుంది. ఏదో ఒక వ్యాకరణ ప్రక్రియద్వారా నన్ను అనే పదం (లేక పూర్వపు నేను అనేపదం) అనుకృత వాక్యం నుంచి బయటికి తొలగినట్టు కనిపిస్తుంది. అందుకే పురుషబోధక ప్రత్యయం (సి)

వాక్యంలో కనిపించదు. అంటే ఉద్దేశించిన అర్థంలో "అతను నన్ను విచిత్రమైన వాడిని'' అన్నాడు అనేది తప్పు అవుతుంది. అనుకృతవాక్యపు కర్త అనుకర్తృ వాక్యంలోకి జరిగిందనాలి. అప్పుడు దాన్ని అనుకర్తృ వాక్యంలో వచ్యర్థక క్రియకే ముడి పెట్టక తప్పదు. అంటే ప్రత్యక్షానుకరణం నుంచి పరోక్షానుకరణ ఏర్పడే సమయానికి వచ్యర్థ ధాతువు శబ్దేతర కర్మలను గ్రహించగలదిగా మారిందన్నమాట.

అని శబ్దం ప్రయుక్తమైన అన్నిరకాల వాక్యాలను అనుకృతిగా పరిగణించాలో లేదో చెప్పటం కష్టం.

కొన్నిరకాల మనోవ్యాపార, జ్ఞానార్థక అఖ్యాతాలతో అని ప్రయోగం కనిపిస్తుంది. దాన్ని విషయార్థక నామ్నీకరణంగా పూర్వం సంభావించారు. ఒకవాక్యం మరొక వాక్యంలో నామపదం స్థానానికి చేరితే దాన్ని నామ్నీకరణం అంటారు.

ఉదా : ఎ. బందరులో ఉప్పు పండుతుందని ఎరుగుదును.

బి. ప్రపంచంలో ప్రతిదీ మారుతుందని నాకు తెలుసు.

సి. అమెరికాలో డాలర్లు పండుతాయని విన్నాను.

డి. భారతదేశంలో సమసమాజం ఏర్పడుతుందని నా నమ్మకం.

ఇ. ఈ దేశప్రజలు చైతన్య వంతులవుతారని నా ఆశ.

ఎఫ్. ఎన్నికల వల్ల నల్లధనం పెరుగుతుందని కొందరి అభిప్రాయం.

ఈ పై వాక్యాలలో ఎ, బి, సిలకు సమాపక క్రియలతో అంతమవుతై. మిగతా వాక్యాల చివరన క్రియలు లేవు. అయితే ఆయా వాక్యభాగాలు క్రమంగా నేను నమ్ముతున్నాను. నేను ఆశిస్తున్నాను, నేను అభిప్రాయ పడుతున్నాను అనే క్రియావాక్యాలకు సమానార్థాలు 'సి' వాక్యంలో విను రెండర్థాలలో ఉపయోగిస్తుంది. ఒక అర్థంలో శబ్ద కర్మకం, ఇంకో అర్థంలో విషయ (information) కర్మకం. మొదటి అర్థంలో 'సి' ప్రత్యక్షాను కరణం అవుతుంది. రెండో అర్థంలో పరోక్షానుకరణం అవుతుంది. దృశ్యార్థంలో చూచు క్రియకు ఈ వాక్యాల్లో ప్రయోగం లేదు. ఆయన వచ్చాడని చూశాను. అనే వాక్యం ప్రయోగార్హం కాదు. ఆ అర్థంలో ఆయన రావటం చూశాను అనాలి.

అని ప్రయోగంతో కాంక్షార్థ వ్యక్తి తెలుగులో ఉంది. ఉదా: *నాకు కాశ్మీరు వెళ్ళాలి అని ఉంది.* ఈ వాక్యం *నేను కాశ్మీరు వెళ్ళాలి అనుకుంటున్నాను.* అనే వాక్యంతో అర్థ బోధలో సమానం. మొదటిది మనస్స్థితి బోధకం, రెండోది మనోవ్యాపార బోధకం.

తెలుగు వాక్యాల్లో చాలా వాక్యాలకు స్థితి వ్యాపార అన్యోన్య పరివర్తక సంబంధం ఉంది. వ్యాపారానికి కాలబోధ ఉంటుంది. స్థితికి ఉండదు. వెళ్ళాలి అనే క్రియకు మూలరూపం వెళ్ళ+వలయు. ఈ అర్థంలో ఉభయ ప్రార్థన రూపమైన వెళదాం సరిగా ఇదే అర్థంలో ఉపయోగించవచ్చు. అయినా రెండు క్రియలూ ఏక కర్మకమైనప్పుడే ఇది సాధ్యం.

భిన్న కర్తృకత మొదటి పద్ధతిలోసాధ్యం. రెండో పద్ధతిలో సాధ్యం కాదు.

ఉదా : *నాకు మా అబ్బాయి పైకి రావాలని ఉంది* అనే వాక్యం సాధ్యం, కాని *నాకు *మా అబ్బాయి పైకి వద్దాం* అని ఉంది అనేది సాధ్యం కాదు.

*అని* తో ఉన్న వాక్యాలు హేత్వర్థకాలు కూడా అవుతై.

ఉదా : వాళ్లన్నయ్య వచ్చాడని మా ఆవిడ గారెలు వండింది. కాని *మందులు లేవని మా ఆవిడ కోలుకోలేదు అనే వాక్యం తప్పు. ఈ రకపు వాక్యాల్లో అఖ్యాత వ్యక్తం చేసే వ్యాపారం అందులో పాత్ర వహించే మనుష్యాధీనంలో ఉండాలి. మనుష్యత్వారోపణ జరిగిన మానవేతర పాత్ర అయినా ఉండొచ్చు. *కోలుకోటం* అనేది మనిషి ఆధీనంలో లేని వ్యాపారం. అయితే ఎట్లాంటి అఖ్యాతాల మధ్య కార్యరణ సంబంధం ఉంటుందో చెప్పటం కష్టం.

ఈ రకపు వాక్యాల్లో *అని* కి బదులు *అనుకొని* అనే క్రియ ప్రయోగించినా చెప్పుకో దగిన అర్థ భేదం రాదు. అనుకృత వాక్యంలో వ్యాపారం కాని, స్థితికాని నిజం కావాలన్న నియమం లేదు. అనుకరణ వాక్యంలో మనుష్య పాత్ర (కర్తే కానక్కర్లేదు) అది యథార్థం అని భావిస్తే చాలు. ఈ పాత్రకు ఆ వ్యాపారం గురించి పరోక్షజ్ఞానం మాత్రమే ఉంటుంది. ప్రత్యక్ష జ్ఞానం ఉన్నచోట ఈ వాక్యాలు వ్యాకరణ సమ్మతంగా కనిపించవు.

ఉదా : ఎ. *నేను పొద్దున్న పెసరట్లు తిన్నానని ఈ పూట అన్నం తినలేదు.

బి. *నేను రాత్రి బస్సు ప్రయాణం చేశానని ఈ పూట నిద్రపోయాను.

కాలంలో ఆనుపూర్వక వ్యాపారాల మధ్యే కారణ కార్యక్రమసంబంధం ఉంటుంది. పూర్వ వ్యాపారం పరవ్యాపారానికి హేతువు అవుతుంది. వాక్యంలో వ్యక్తమైన ఉపవాక్యాలు అదే క్రమంలో ఉంటై. వాక్యంలో వ్యక్తమైన వ్యాపారాల క్రమం కాలంలో జరిగిన క్రమానికి వ్యతిరేక మయితే అని వాక్యం లక్ష్యార్థకమవుతుంది. ఉదా : సోషలిజం త్వరగా తీసుకు రావాలని ప్రభుత్వం వారు పన్నులు పెంచారు.

అని శబ్దానికీ ఇంకా కొన్ని వాక్య ప్రయోజనాలున్నై. *అని* ని *అంటే, అన్న* - అనే క్రియా రూపాలుగా మార్చి వాక్య ప్రయోగంలో భిన్న ప్రయోజనాలు సాధించవచ్చు.

(a) చుట్టాలు వస్తారంటే పట్టణాల వాళ్లకు భయం.

(b) ఏరాలు అంటే తోటి కోడలు.

(c) గురజాడ అప్పారావు గారు మాంసాహారి అనే (అన్న) విషయం చాలామందికీ తెలీదు మొ॥

వాక్యంలో వ్యక్తమైన విషయానికి వక్తపూచీ ఏమీ లేదని సూచించే శబ్దం ఒకటి ఉంది తెలుగులో అది *అంట > అట > ట* అనే రూపభేదాలతో ఉంది. దీని పూర్వరూపం అనుట అయి ఉండాలి. వదంతుల వ్యక్తీకరణకు ఇది పసందైన సాధనం. ఉదా: పక్కింటి పుల్లమ్మ పొరుగింటి పుల్లన్నతో లేచిపోయిందట ! వాక్యంలో ఉత్తమ పురుష మధ్యమ పురుషలున్నప్పుడు ఇది స్పష్టంగా అనుకృతే. ఉదా : (ఎ) నేను ఆమెను అవమానించానట! (బి) నువ్వు ఆఫీసులో నిద్రపోతావట ! ఈ వాక్యాల్లో *అట* కు ఎవరో అన్నారని అర్థం.

# మాట్లాడే భాష, రాసే భాష ఒకటేనా ? అవును/కాదు

భాషా వ్యవహారం కొన్ని వ్యాకరణ సూత్రాల మీద మాత్రమే ఆధారపడి ఉంటుందనీ, అవి అర్థం చేసుకుంటే భాష అర్థమైనట్టేనని ఒక అపోహ చాలా కాలం నుంచి ప్రచారంలో ఉంది. అంతేకాక, ఈ సూత్రాలు భాషా వ్యవహర్తలను పోలీసుల్లా కాపలా కాస్తాయనీ, వీటిని ఉల్లంఘిస్తే భాషా ప్రపంచం అల్లకల్లోలం అవుతుందని కూడా ప్రచారంలో ఉంది.

భాషా వ్యవహారంలో నిర్మాణ సూత్రాలు ఎంత ముఖ్య భాగమైనా, ఒక భాగం మాత్రమే. కాని, అవే సర్వస్వం కాదు. వ్యవహార సందర్భం, రీతి, ఉద్దిష్ట వ్యక్తులు, విషయం, పరిస్థితుల వత్తిడి వగైరా ఎన్నో విషయాలు భాషా వ్యవహారాన్ని అర్థం చేసుకోటానికి అవసరం. అంతేకాదు, భాషా నిర్మాణ సూత్రాల ఆవిర్భావానికి కూడా సామాజికాంశాలు కారణం కావచ్చు. ఏర్పడ్డ సూత్రాల ప్రవర్తనను నియతం చేసే వ్యవహారాంశాలు చాలా ఉంటాయి. భాషా నిర్మాణ సూత్రాలను కనుక్కోటంలో భాషా శాస్త్రం గణనీయమైన అభివృద్ధిని సాధించినా, మిగతా ప్రమేయాంశాలను గురించి మనకు తెలిసింది తక్కువ. ఆ దిశగా పరిశోధనలు విరివిగా జరుగుతున్నాయి.

నిన్న మొన్నటి వరకు వ్యాకరణ స్వరూపం ఎట్లా ఉంటుంది ? నిర్మాణ సూత్రాలు ఏ పద్ధతిలో ప్రవర్తిస్తాయి ? సూత్రాలకు అపవాదాలు ఎట్లా ఉంటాయి ? వాటికున్నూ సూత్ర స్థాయి ఉంటుందా ? ఈ రకమైన ప్రశ్నలు వేసుకొని చాలా విలువైన సమాచారమే సంగ్రహించారు.

అయితే, ఇటీవల కాలంలో భాషా పరిశోధన విస్తృతి పెరిగింది. భాషా ప్రయోగ రీతుల పై ఆసక్తి ఏర్పడింది. అంతే కాకుండా ఒక కాలపు భాషను అర్థం చేసుకోటానికి ఎన్నెన్నో ఇతరాంశాలను ఆకళింపు చేసుకోవాల్సిన అవసరాన్ని గుర్తించారు.

భాష ఏయే దశల్లో అభివృద్ధి చెందింది ? మానవ పరిణామ దశల్లాగా భాషా పరిణామ దశలను కూడా స్థాపించవచ్చా ? ఏక వ్యక్తి భాషా సంపాదన క్రమంలో వాటికేమన్నా ప్రమేయం ఉందా ? అట్లాగే ఒక భాషా నిర్మాణ క్రమంలో పరిణామ దశలున్నాయా ? నిర్మాణ సూత్రాల ప్రవర్తనను ఏ భౌతికాంశాలు నియంత్రిస్తాయి ? అనే ప్రశ్నలు ఇటీవల

వేసుకుంటున్నారు. కొన్నాళ్లు ఇట్లాంటి ప్రశ్నలను అర్థంలేని ప్రశ్నలను కొనేవారు. ఇప్పుడవి అర్థవంతమయినాయి.

ఈనాటి భాషల్లో కనిపించే వాక్య నిర్మాణాలలో కొన్ని పూర్వరూపం అయి ఉండి తరవాత మారి కొత్త పద్ధతులు ఏర్పడి ఉండొచ్చు. ఆ రెండు రకాలుగా ఈనాటి భాషలో కనిపించొచ్చు. ఉదాహరణకు ఈ కింది వాక్యాలు చూడండి.

1ఎ. నువ్వు మొన్న మా ఇంట్లో చూశావే. ఆ అమ్మాయి మా మేనగోడలు

బి. నువ్వు మొన్న మా ఇంట్లో ఏ అమ్మాయిని చూశావో ఆ అమ్మాయి మా మేనగోడలు.

సి. నువ్వు మొన్న మా ఇంట్లో చూసిన అమ్మాయి మా మేనగోడలు.

ఈ మూడు రకాలూ తెలుగులో ఉన్నాయి. ఇతర ద్రావిడ భాషల్లోనూ ఉండొచ్చు. మొదటి రకం వాక్యం వక్తృశ్రోతల వాగ్వ్యవహారంలోనే వినిపిస్తుంది. రెండూ, మూడు రాతల్లో కూడా ఉంటాయి. వాక్య నిర్మాణ దృష్ట్యా చూస్తే మొదటి దానికన్నా రెండోది, అంతకన్నా మూడోది ఎక్కువ సంహితత్వం ఉన్న వాక్యాలుగా కనిపిస్తాయి. నిర్మాణ నియమాలు కూడా ఈ క్రమంలోనే ఉన్నాయి. ఆ నియమాలు పూర్వమే పరిశోధకులు గుర్తించారు, వివరించారు. దీన్ని ఈ పద్ధతిలో సంహితీకరణం అందాం. ఇంగ్లీషులో సింటాక్టిసైజేషన్ (syntacticization) అంటున్నారు.

ఈ పద్ధతిలో ఆలోచిస్తే కర్త, కర్మ నిర్మాణం పరిణామంలో తరవాత వచ్చినవిగా ఊహించవచ్చు. ఈ విషయంలో కొన్ని భాషలు కర్తృ, కర్మ నిర్మాణం వైపు ఎక్కువ జరిగినట్టు కనిపిస్తుంది. ఇంగ్లీషు అట్లాంటిది. ఇంగ్లీషులో కర్త (subject అనే అర్థంలో) లేని వాక్యాలే ఉండవు. అవసరం లేని చోట కూడా ''కృత్రిమం''గా ఒకటి తయారు చేసి పెడతారు. It seems. It appears అనే వాక్య నిర్మాణాల్లో It అనే మాట భాషేతర ప్రపంచంలో దేన్నీ సూచించదు. తెలుగులో కర్తలేని వాక్యాలు కొన్ని ఉన్నాయి.

2. నాకు దిగులుగా ఉంది.

నాకు నలతగా ఉంది.

ఆమెకు కోపంగా ఉంది.

ఈ పై వాక్యాల్లో దేన్నీ కర్తగా చెప్పే అవసరం లేదు. కొందరు పై వాక్యాల్లో - కు బంధంలో ఉన్న సర్వనామాన్ని కర్తగా గుప్త నిర్మాణంలో ప్రతిపాదించి తరవాత ఏదో సూత్రంతో కు విభక్తిని అతికించే పద్ధతి అవలంబిస్తారు. ఇట్లాంటి కర్తను ఇంగ్లీషులో

డేటివ్ సబ్జెక్టు (dative subject) అని పిలుస్తారు. ఉన్న భేదాన్ని కనపడనీయకుండా మాయం జేసే ఈ ప్రక్రియ వల్ల లాభం ఏమీ లేకపోగా నష్టం కూడా ఉండొచ్చు. కర్తలేని వాక్యాలు బహుశా ఒక పురాతన భాషా స్థితిని సూచిస్తుండొచ్చు. స్వాహిలీ వంటి కొన్ని భాషల్లో - కర్మణి వాక్యాలు ఏర్పడ్డ మార్గాల్ని పరిశోధకులు సూచించారు.

లిపిలేని ద్రావిడ భాషల్లో పడు అనే క్రియా సహాయంతో ఏర్పడ్డ కర్మణి వాక్యాలు కనపడవు. కాని తెలుగు, తమిళ, కన్నడ భాషల్లో కనిపిస్తాయి. బహుశా ఈ భాషల్లో ఈ కర్మణి వాక్యాలు పరిణామంలో లేఖన పద్ధతి ఏర్పడ్డ తరవాత వచ్చాయేమో !

తెలుగులో వ్యాపార ప్రధాన (process oriented) వాక్యాలుగా కనిపిస్తున్న 'ఆయన రావటం జరిగింది' వంటివి ప్రాచీనాంధ్రంలో కనిపించవు. ఇవి ఆధునిక యుగంలో ఏర్పడి ఉండొచ్చు. సంఖ్య (2) లో సూచించిన వాక్యాల్ని విషయి - విషయం (Topic and comment) అనే విభాగం చెయ్యవచ్చు. ఈ పద్ధతి కర్త, కర్మ, క్రియ అనే పద్ధతి నిర్మాణం కన్నా పూర్వపుది కావచ్చు. తెలుగులో సంయుక్త, సంశ్లిష్ట వాక్యాల నిర్మాణాలను పరిశీలిస్తే సంయుక్త వాక్య నిర్మాణం సంశ్లిష్ట వాక్యాలకు మూలం కావచ్చు. ఆ మాటకొస్తే తెలుగులో సంయుక్త వాక్యాలకూ, విడివిడి వాక్యాలకూ నిర్మాణ సంబంధంగా అంత భేదం కనపడదు. ఉచ్చారణలో కొంత స్వరభేదం మాత్రం కనిపిస్తుంది.

చాలా భాషల్లో ఒక కర్త కాలక్రమంలో చేసిన పనులను అదే క్రమంలో అసమాపక క్రియల ద్వారా వ్యక్తం చేస్తారు. ఈ పద్ధతి చాలా ఆసియా, ఆఫ్రికా భాషల్లోనూ కనిపిస్తుంది. ఈ పద్ధతే తరవాత విభక్తి ప్రత్యయాలకు దారి తీసి ఉండవచ్చు. నన్నయ భారతంలో ''కాదన కిట్టి పాటి యపకారము తక్షకుడేక విప్రసం బోధన జేసి చేసే'' అన్న చోట 'చేసి' అనే క్త్వార్థక సదృశ రూపం చేత అనే విభక్త్యర్థంలో ఉంది. ఈనాటి తెలుగులో పెట్టి అనే క్త్వార్థక సదృశ క్రియా రూపం కరణార్థంలో 'తో' అనే ప్రత్యయంతో సమంగా ఉంది. అట్లాగే 'పట్టి' అనే క్రియా రూపం కూడా 'వల్ల' అనే విభక్త్యర్థంలో అన్నంత క్రియా రూపం తరవాత వస్తుంది.

ఈ ప్రయోగాలన్నీ ఒక కాలంలో వదులుగా (Loose) గా ఉండి కాలక్రమంలో సంహితీకరణం జరిగి బిగుతు (tight) గా మారి ఉండవచ్చు.

పిల్లల భాష మీద జరిగిన పరిశోధనలు కూడా ఈ విషయాన్ని బలపరుస్తున్నాయి. పిల్లలు భాషలో ముందు ఏక పదవాక్యాలూ, తరవాత బహుపద వాక్యాలూ కనిపిస్తాయి. అంటే సంక్లిష్ట వ్యాకరణ సూత్రాలు ఏర్పడని (Loose Practice) దశ నుంచి క్లిష్ట వ్యాకరణ

నియమాల (tight syntactic) దశకు వాళ్ల భాష పరిణామం చెందుతున్నట్టు గమనించ గలం.

పిల్లలపై సమాజంలో భావప్రకటనకు వత్తిడి (stress) ఉంటుంది. తక్షణావసరాల పరిపూర్తి కోసం ప్రత్యక్షంగా కనిపించే పరిసరాలకు స్పందించాల్సి ఉంటుంది. అందుకే వాళ్ల భాషలో సంహితీకరణ ద్వారా ఏర్పడే నిర్మాణ క్లిష్టత ఉండదు.

మన భాషా వ్యవహారం ఎప్పుడూ ఒకే పద్ధతిలో ఉండదు. చాలా మామూలు (relaxed) స్థితిలో కులాసా కబుర్లు చెప్పుకునే భాష కూడా ఉపన్యాస రచనా భాషకూ అంతరువులుంటాయి. కులాసా కబుర్లలో కాల గమనాన్ని గురించి పట్టింపు ఉండదు. స్పృహ కూడా ఉండదు. మాట్లాడేదాన్ని గురించి ముందుగా 'ప్లాన్' చేసుకోము. ముఖతః మాట్లాడుకునేటప్పుడు పునరుక్తులు చాలా ఉంటాయి. సంభాషణలలో ఎక్కువ భాగం అందరికీ తెలిసిన సమాచారం (shared information) ఉంటుంది. చెప్పింది అర్థం కావటం లేదనుకుంటే, వివరణ లిచ్చుకోవచ్చు. అర్ధోక్తులు, వాక్యశకలాలు ఉంటాయి. అంతేకాదు వ్యాకరణ సూత్రాలు కూడా గల్లంతు అవుతాయి. ప్లాన్ చేసుకున్న భాషలో సంహితీకరణ ఎక్కువ ఉంటుంది. రచనా భాషలో ప్లానింగుకు ఎక్కువ అవకాశం ఉంటుంది. ఇక్కడా సంహితీకరణ అంతరువులుంటాయి. ఎలినార్ ఓక్సు అనే ఆమె ఈ ప్లానింగు మీద పరిశోధించి, planned and unplanned speech అనే వ్యాసం ప్రకటించారు. ఆమె రాసే భాషను గురించి ఇట్లా అంటారు.

1. ప్లానింగు ఎక్కువగా ఉంటుంది. దిద్దుబాట్లు, పునర్లేఖనాలు, పునస్సూత్రీకరణలు ఉంటాయి.
2. ఒక పక్క కాలపు వత్తిడి ఉంటుంది. తక్కువ చోటులో వ్యక్తం చెయ్యాలని ఉంటుంది. మరోపక్క ప్లానింగుకు ఎక్కువ వ్యవధి పడుతుంది.
3. రాతకూ - చదువుకూ మధ్య వ్యవధి (delayed reading) ఉండటం వల్ల భావ ప్రకటనపై ఒత్తిడి (communicative stress) ఉండదు.
4. వక్తృశ్రోతలప్రత్యక్ష ప్రమేయం ఉండదు.
5. మొదలయ్యేటప్పుడు పరితలకు తెలియని విషయాలను తెలియ జెపుతూ క్రమంగా కొత్త విషయాలు చెపుతారు.
6. ప్రత్యక్ష సందర్భమూ, విషయమూ తక్షణ కార్యాచరణా ఉండవు. తక్షణ సమయానికి, ఉన్న ప్రదేశానికీ, ఎదుట ఉన్న మనుషులకూ రాత అతీతంగా ఉంటుంది.

ఈ సందర్భంగా భాషాశాస్త్ర పరిశోధనలో వెల్లడి అయిన మరి కొన్నివిషయాలను తెలుసుకుందాం.

శాస్త్ర పరిశోధన ఎప్పుడూ ఒక రకంగా ఉండదు. లక్ష్యాలు, పద్ధతులు, అవగాహన మారుతుంటాయి. మారిన పద్ధతులు కొత్త సత్యాలను ఆవిష్కరిస్తాయి. ఒకనాటి సత్యాలు ఎల్లకాలం సత్యాలుగా ఉండవు. భాషా శాస్త్ర పరిశోధనలో కూడా ఈ రకపు ధోరణులు కనిపిస్తాయి.

ప్రాచీన వ్యాకరణాలు ఒకరకం ప్రామాణిక రచనా భాషను దృష్టిలో పెట్టుకొని వచ్చాయి. అందువల్ల అపశబ్దం - సుశబ్దం అనే విభాగం ఆ వ్యాకరణాలకు ముఖ్యం. వాటి మీద ఆధారపడి తప్పొప్పులు ఏర్పడ్డాయి.

ఏ వ్యాకరణాలూ సమగ్రాలు కావు. రచయితలు, కవులు వ్యాకరణాలను ఎప్పుడూ ఉల్లంఘిస్తూనే వచ్చారు. అందుకే వ్యాకరణాలను సంపూర్ణంగా అనుసరించాలనే వర్గంతో పాటు అక్కర్లేదనే వర్గం ఎప్పుడూ ఉంటూనే ఉంది. 'శిష్టానామ్ ఉక్తా సూత్రాణామ్ అభావే అనుశాసన కారిణ ఏవ దండనీయాః' (శిష్టులు అన్నదానికి సూత్రాలు లేకపోతే వ్యాకర్తలదే దోషం) అనే సూక్తి ఏర్పడింది. ప్రాచీన భారతంలో పండితుల వాగ్వ్యవహారంలోనూ, రచనలోనూ ఒకే రకం భాష ఉండేది కావచ్చు. సంస్కృత కావ్యరచన చాలా భాగం సంస్కృతం మాతృభాషా స్థితి నుంచి జారిపోయాకనే జరిగింది. అప్పటి వ్యాకరణాల పరిధి రచనా భాష, పండితుల ప్రత్యేక వ్యవహార భాష. అంటే, పండితులు కేవలం రాతలో ఉండే భాషను కొన్ని సందర్భాల్లో మాట్లాడే వారన్నమాట. ఇప్పటికే మనకు సంస్కృతంలో మాట్లాడగలిగే పండితులూ, ఉపన్యాసాలిచ్చే పండితులూ ఉన్నారు. వాళ్లు ప్రయోగించేది గ్రంథాల్లో భాషే. సంస్కృతం వీళ్ల నిత్య వ్యవహార భాష కాదు.

యూరప్‌లో కూడా దాదాపు ఇట్లాంటి స్థితే ఉండేది. అక్కడి వ్యాకరణాలు కూడా ఎట్లా రాయాలో బోధించటానికి ఉద్దేశించినవే. ఒక రచనా ప్రమాణం ఏర్పడ్డ తరువాత ఆ నమూనాను వ్యాకరిస్తూ అట్లా రాయాలని నిర్దేశించటం వ్యాకరణాలు చేసిన పని.

భాషా వ్యవస్థపై దృష్టి మళ్లి భాష ఎట్లా ప్రవర్తిస్తుంది అనే లక్ష్య లక్షణ వివేచన లిఖిత భాషా వ్యవస్థ ఉన్న సమాజాల్లోనే ఏర్పడుతుంది. రాత ఉన్న భాషా సమాజాలకే వ్యాకరణాలుంటాయి. మాట్లాడే భాషలో ఎక్కువ భాగం తక్షణ ప్రయోజనోద్దిష్టమైనది. మాట్లాడే భాష కాలంలో జరిగే సంఘటన (event). రాసే భాష ఉత్పన్న పదార్థం (product). అందువల్ల రాసిన భాషకే వ్యాకరణాలు సాధ్యం. ప్రాచీన వ్యాకరణాలు 'ఇట్లా

రాయాలి' అని నిర్దేశించేవే అయినా, వాటికి సూత్రబద్ధత అనే హేతు పద్ధతిని కల్పించారు.

They are prescriptive in intention but descriptive in execution. ప్రాచీన భారతీయ భాషా వ్యాకరణాలు పరిశోధనలో భాగాలే అని వేరే వివరించక్కర్లేదు.

ప్రాచీన కాలంలో విద్యా వ్యాసంగాలు చాలా కొద్ది మందికే పరిమితం. అట్లాగే రచనా భాష కూడా కొద్ది అవసరాలకే పరిమితం. అందువల్ల ఆ భాష అత్యల్ప సంఖ్యాకుల రచనా వ్యవహారానికి పనికి వచ్చింది. వాగ్వ్యవహారానిక అతిదూరమైనా ప్రయోజనాలు, ప్రయోక్తలు పరిమితం కావటం వల్ల అప్పటి అవసరాలకు ఆ రచనా భాష చెల్లింది. ఆ భాషను విశ్లేషించటమూ, రక్షించటమూ, బోధించటమూ లక్ష్యాలుగా వ్యాకరణాలు తమ పనిని నిర్వర్తించాయి.

పారిశ్రామిక విప్లవం తరవాత ప్రపంచ పరిస్థితులలో, ప్రజల జీవనంలో, ఆలోచనలలో చాలా మార్పులు వచ్చాయన్న సంగతి ప్రపంచ చరిత్ర గతిని పరిశీలించే వారికందరికీ తెలిసిందే. ఆ మార్పులు యూరప్ దేశాల్లో ముందు జరిగిన విషయం కూడా అందరికీ తెలిసిందే.

యూరప్ దేశాల వాళ్లు ఇతర దేశాల్లో వలస రాజ్యాలు స్థాపించుకొని పందొమ్మిదో శతాబ్దానికల్లా ఆదేశాలను పరిపాలించటం మొదలుపెట్టారు. విదేశ పాలకులకు పాలితులకు మధ్య ఏర్పడే సంబంధాల వల్ల జీవన విధానాల్లోనూ, అభిప్రాయాల్లోనూ పరస్పర వినిమయం జరిగి ఒకరి దగ్గరి నుంచి ఇంకొకరు నేర్చుకుంటూరు. బ్రిటిషు సామ్రాజ్య వాదులు మన్ని పరిపాలించినప్పుడు భారతదేశం నుంచి ధ్వనుల ఉత్పత్తి (phonetics) భాషలో వాటి ప్రవర్తన (function) గురించిన సంస్కృత వ్యాకర్తల ప్రతిభా పూర్వక వర్ణనలు యూరపియన్ పండితుల దృష్టిని ఆకర్షించాయి. సంస్కృత వ్యాకరణ రచనా పద్ధతులు ఇప్పటికే వీరి దృష్టిని ఆకర్షిస్తున్నాయి. ఒకనాటి Henry sweet నుంచి ఈనాటి Noam Chomsky, J.F. Staal, Paul Kiparsky, George Cardona వరకూ సంస్కృత వ్యాకరణ నిర్మాణ పద్ధతులను అధ్యయనం చేసిన వారే. తమ తమ పద్ధతుల్లో వ్యాఖ్యానించినవారే.

సంస్కృత భాషా, వ్యాకరణ దర్శనం (discovery) యూరప్‌లో రెండు రకాల పరిణామాలకు దారి తీసింది. మొదటిది భాషల తులనాత్మక పరిశీలన. సంస్కృతం, గ్రీకు, ల్యాటిన్ భాషల మధ్య విశిష్టమైన పోలికలు యూరోపియన్ పండితుల దృష్టిని ఆకర్షించాయి. వాటి మధ్య సంబంధాన్ని సూత్ర పద్ధతిలో నిర్వచించవచ్చుననీ, పూర్వ

రూపాలను పునర్నిర్మించవచ్చుననీ కనుక్కున్నారు. దీన్నే comparative method అంటారు. ఆ సూత్రాలను phonetic laws (ధ్వని సూత్రాలు) అని పిలిచారు.

ఈ పద్ధతి ముందు లిఖిత భాషలకూ వర్తింప జేసి ఫలితాలను ప్రాచీన భాషా గ్రంథాలతో పోల్చి చూశాడు. ఫలితాలు అద్భుతావహంగా ఉన్నాయి. ఫ్రెంచి, స్పానిష్, ఇటాలియన్, పోర్చుగీసు భాషల్లో రూపసామ్యం, అర్థ సామ్యం ఉన్న మాటలను పోల్చి చూసి పూర్వ రూపాలను పునర్నిర్మించి ల్యాటిన్ భాషా రూపాల పక్కన పెట్టి చూస్తే చాలా సన్నిహితంగా కనిపించాయి. తరవాత లిపి లేని భాషలకు కూడా ఈ పద్ధతిని వర్తింప జేసి కొన్ని గణనీయమైన ఫలితాలు సాధించారు. అమెరిండియన్ భాషల వర్గీకరణ ఈ పద్ధతి పైనే జరిగింది.

యూరప్‌లో పర్దినాండ్ ద సోసూర్ అనే భాషా శాస్త్రవేత్త భాషా శాస్త్రంలో ఆధునికతకు పునాది వేశాడు. భాషా చరిత్ర వేరు, భాషా నిర్మాణం వేరు అని వివరించి ఏ కాలపు భాషలో అయినా గుర్తించదగిన నిర్మాణం ఉంటుందని బోధించాడు. వీటినే ఇంగ్లీషులో synchronic (ఏక కాలిక), diachronic (బహుకాలిక) భాషాధ్యయన భేదాలుగా గుర్తిస్తారు. 1916లో ఇతని పుస్తకం, ఆయన మరణానంతరం, (course de linguistic) అచ్చయింది. అప్పటి నుంచి సమకాలిక భాషలకు వ్యాకరణాలు రచించాలనే కుతూహలం పెరిగింది. క్రైస్తవ మత వ్యాప్తి కోసం వెళ్లిన ప్రచారకులు, ఆయా భాషల్లో బైబిలు అనువాదం చెయ్యటం కోసం, మతప్రచారం చెయ్యటం కోసం ఆయా భాషలను అధ్యయనం చేశారు, వ్యాకరణాలు రచించారు.

అమెరికా ఖండంలో మానవ శాస్త్రం (Anthropology) లో భాగంగా భాషా శాస్త్రం అభివృద్ధి చెందింది. అమెరికాలో ఉన్న ఆదిమజాతుల జీవన విధానాలను పరిశీలించటంలో భాగంగా ఆ భాషలను కూడా పరిశోధించారు. భాషా సంస్కృతుల పరస్పర సంబంధాన్ని గ్రహించారు. మొదట్లో Franz Boas మధ్యకాలంలో Leonard Bloomfield, Edward Sapir, తరువాతి కాలంలో Charles Hockett ఈ విధంగా భాషా శాస్త్రంలోకి వచ్చినవారు. ఈ చివరి వారు Cornell University లో Professor of Anthropology and Linguistics. భాషా శాస్త్రానికి మానవ శాస్త్రం (Anthropology) తో సన్నిహిత సంబంధం ఉందని నమ్మినవారు. ఈయన తన భావాల ప్రభావం ఉన్న ఆ విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రంలో డాక్టరేట్ చేసే వారికి కల్చరల్ ఆంత్రోపాలజీ (మానవ సంస్కృతీ శాస్త్రం) అత్యవసరమైన అధ్యయనాంశంగా నిర్ణయించారు.

(ఈ వ్యాసకర్త ఈ నియమావళి అమలులో ఉన్నప్పుడే ఆ విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్రం చదువుకున్నాడు).

అమెరికన్ ఇండియన్ భాషా పరిశోధన ఈ సంప్రదాయంలోనే జరిగింది. ఆ పరిశోధనలో భాగంగా భాషా శాస్త్ర పరిశోధన పద్ధతులకు మెరుగులు దిద్దారు, పదును పెట్టారు. వీరంతా ప్రధానంగా అలిఖిత భాషల మీదనే పరిశోధన చేశారు. వీరి కృషి సాధించిన ముఖ్యాంశాలు Martin Joos ఎడిట్ చేసిన Readings in Linguisitics (1957) అనే శాస్త్ర వ్యాసాల సంకలనంలో ఉన్నాయి.

ప్రపంచంలో సుమారు నాలుగైదువేల భాషల దాకా ఉన్నాయని అంచనా వేసుకోవచ్చు. ఏది ప్రత్యేక భాష, ఏవి మాండలికాలు అని నిర్ణయించటానికి శాస్త్రీయ పద్ధతులులేమీ లేవు. అందువల్ల కచ్చితమైన సంఖ్య ఎవరూ చెప్పలేరు. సాంప్రదాయికమైన లిపి ఉన్న భాషలు కొన్ని వందల సంఖ్యను మించవు. మానవ జాతి ఈ భూమి మీద సుమారు ఏభై వేల సంవత్సరాల నుంచి ఉంటున్నట్టుగా శాస్త్రజ్ఞులూహిస్తున్నారు. మెసపాటేమియాలో సుమేరియన్లు క్రీస్తు పూర్వం 3,500 ఏళ్ల నాడు ఏర్పరచుకొన్నదే మొదటి భాషా లిపిగా భావిస్తున్నారు. అంతకు ముందు కొన్నివేల సంవత్సరాల నుంచి బొమ్మల ద్వారా భావ ప్రకటన చేసినా అది భాషా లిపి కాదు. భారత ఉపఖండంలో సింధు నదీ లోయలో వెలసిన నాగరికతలో కూడా లిపి ఉండేది. అది క్రీస్తు పూర్వం 3000 నుంచి 2400 వరకు ఉండేది.

మానవజాతి చరిత్రలో లిపి చాలా ఇటీవలదని తెలుసుకొన్నాం. పైగా రాయబడని భాషలే ఎక్కువ. అందువల్ల ఆధునిక భాషా శాస్త్రజ్ఞులు భాషను గురించి మాట్లాడినప్పుడల్లా మాట్లాడే భాషనే ఉద్దేశించారు. మాట్లాడే భాషనే నిర్వచించారు. ధ్వనివాహకంగా ఉన్నదే భాష అన్నారు.

రాసే భాషే అసలు భాష అని ప్రాచీన వ్యాకర్తలనుకుంటే మాట్లాడేదే అసలు భాష అని ఆధునిక భాషా శాస్త్రజ్ఞులన్నారు. భాష మాట్లాడతారని వాళ్లకు తెలుసు, రాస్తారని వీళ్లకు తెలుసు. ఇది ప్రామాణిక దృష్టికి, ప్రాధాన్య వివక్షకు సంబంధించింది. ఆధునికుల్లో ముఖ్యులైన వారేమన్నారో చూద్దాం. సోసూర్ తన 'కోర్సు' లో Langue et ecriture soul deux systems de signe distinct. Unique raison d'etre de second est de representere le premier" అన్నాడు. భాష, లిపి రెండు పద్ధతులు. మాట్లాడిందాన్ని రాయటంలో లిపికి ఉనికి ఉంది.

ఎడ్వర్డ్ సపీర్ ( 1 8 8 4 - 19 3 9 తన Language అనే గ్రంథంలో "written language in this a point to point equivalence, to borrow a mathematical phrase to its counter part. The written forms are secondary symbols of symbols. Yet so close is the correspondence that they, may, not only in but in the actual practice of certain readers and possibly in certain types of thinking, be entirely substituted for the spoken ones. (Language 1921, page 20).

గణిత శాస్త్రం ప్రకారం చెపితే రాసే భాష మాట్లాడే భాషకు ప్రతి అంశంలోనూ సమానంగా ఉంటాయి. (దీన్నే isomorphism అంటారు). రాత గుర్తులు ధ్వని చిహ్నాలకు చిహ్నాలు. ఈ రెంటికీ ఎంత సన్నిహిత సంబంధముందంటే మాట్లాడే ధ్వని చిహ్నాలకు పూర్తిగా రాత గుర్తులను వాడొచ్చు.

Leonard Bloomfield తన Language (1933) అనే పుస్తకంలో "writing is not language, but merely, a way of recording language by means of visible marks" అని అన్నాడు. రాత భాష కాదు. భాషను రికార్డు చెయ్యటానికి ఉపయోగించే దృశ్య చిహ్నాలు మాత్రమే.

ఈయనే Linguistic aspects of science (1939) అనే వ్యాసంలో ఇంకొంచెం గట్టిగా The popular and scholastic contrasting of spoken language and written language is entirely misleading" అంటాడు. రాసే భాష మాట్లాడే భాషల మధ్య స్కూళ్ళలో ప్రచారంలో ఉన్న భేదం పూర్తిగా తప్పుదారి పట్టించేది.

Charles Hockett తన 'కోర్సు' (1958) లో ఇట్లా అంటాడు. "Speech and writing are merely two different manifestations of something of fundamentally same things. మాట, రాత అనేవి ఒకే మూల పదార్థానికి రెండు వ్యక్తరూపాలు.

ఆయనే Man's place in nature (1973) అనే గ్రంథంలో ఇంకా ఇట్లా వివరిస్తారు.

In our highly literate western society we inherit a strong tendency to confuse language and writing and to speak of the former in terms actually appropriate only for the later. But writing is not a manifestation of language on par with speech. Historically, it is derivative from language and a relatively recent one at that. (Page 100).

అక్షరాస్యత బాగా అభివృద్ధి చెందిన మన పాశ్చాత్య సమాజంలో భాషకు, లిపికీ మధ్య పొరపడే అలవాటు వారసత్వంగా సంక్రమించింది. భాషను గురించి చెప్పాల్సినవి లిపికి అంటగట్టి మాట్లాడతాం. మాటతో సమస్థాయిలో రాత భాషకు వ్యక్తీకరణ కాదు. చారిత్రకంగా భాష ఏర్పడ్డ తరవాత లిపి ఏర్పడింది, అందులోనూ అది మరీ ఇటీవలది. (పాశ్చాత్యులను తమ సంస్కృతి నుంచి, వారసత్వంగా వచ్చిన ప్రపంచ దృష్టినుంచి బయట పడి ప్రపంచాన్ని పరిశీలించమని మాటి మాటికీ హెచ్చరించటం హోకెట్‌కు అలవాటు)

ఇట్లా అన్నా మాట్లాడే భాషకు భిన్నంగా ఏర్పడ్డ సంఖ్యలూ, ఇతర లిఖిత సంప్రదాయాలను హోకెట్ గుర్తించారు. కాని తాను శిక్షణ పొందిన భాషాభిప్రాయాలకు భిన్నంగా రాసే భాషకు ప్రత్యేక ప్రతిపత్తిని నిరాకరిస్తూ వచ్చారు.

ఈ అభిప్రాయాలను ఇంత వివరంగా ఇయ్యటానికి కారణం ఒక కాలంలో ప్రచురంగా ఉన్న అభిప్రాయాలు ఆ కాలపు ప్రపంచావగాహనను ఎట్లా పరిమితం చేస్తాయో తెలుసుకోటం కోసం. అయితే నిత్య పరిణామ శీలమైన పరిశోధన ఒక చోట ఆగిపోదు. కొత్త పరిశోధనలు కొత్త సత్యాలను ఆవిష్కరిస్తాయి. భాషా శాస్త్రంలోనూ ఇదే జరిగింది. ఆ వివరాలు ఇంకోసారి చూద్దాం.

## 2

ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలకు ఆనాటి ప్రపంచ రాజకీయాలకు సన్నిహిత సంబంధం ఉంది.

పాశ్చాత్యులు తూర్పుదేశాలను (ఆసియా, ఆఫ్రికా ఖండాలను) ఆక్రమించి పాలించటం మొదలుపెట్టారు. పాశ్చాత్య పాలకులకు ప్రాచ్యపాలితులకు మధ్య కనీస సంబంధాలు ఉండటం అవసరం. పాలితులను పట్టించుకున్నట్టు కనపడటం పాలకులకు అవసరం. అందులోనూ పాలకులు దూరదేశాల వారయినప్పుడు. అందువల్ల మనదేశంలో పాశ్చాత్యులు ప్రవేశించినప్పుడు అనతికాలంలోనే భారత భాషలు నేర్చుకొని నిఘంటువులు, వ్యాకరణాలు సమకూర్చారు. ఇవి ప్రధానంగా మాట్లాడే భాషకే కూర్చారు. A. H. Arden, C. P. Brown, A. D. Campbell, A. Galletti మొదలైన వారు తెలుగుకు వ్యాకరణాలు, నిఘంటువులు కూర్చారు.

వలస పాలనకు దాదాపు సమాంతరంగా క్రైస్తవ మత ప్రచారం కూడా జరిగింది. క్రైస్తవ మతం అతి సామాన్యులను కూడా తమలో కలుపుకునే ప్రయత్నం చేసింది. వీరు

బైబిలు అనువాదం సామాన్యుల కోసం చేశారు. లిపి లేని భాషలకు లిపిని కూడా కల్పించి ఈ అనువాదాలు చేశారు. తెలుగు బైబిలు మన భాషా పండితుల పాలబడి అదో విచిత్ర భాషలో అనువాదం సాగినట్టు కనిపిస్తుంది. క్రైస్తవ మిషనరీలు కూడా భాషా నిఘంటువులు, వ్యాకరణాలు రచించారు. ఇవి మాట్లాడే భాషకే చేసినట్టు తెలుసుకోగలం. భాషా శాస్త్ర పరిశోధకుల్లో K.L. Pike, Eugene Nida లు ప్రధానంగా మత ప్రచారకులు, అయినా గొప్ప భాషా శాస్త్ర వేత్తలు. లిపిలేని భాషలకు లిపి కల్పించటం కోసం పైక్ వర్ణ నిర్ణయ విధానాన్ని పరిమితం చేశాడు. వ్యాకరణం, బైబిలు అనువాద కోసం నైడా మోర్ఫాలజీ పద నిర్మాణ శాస్త్రం, అనువాద పద్ధతులపై కృషి చేశాడు.

వలసవాదంతో పాటు మానవజీవిత విధానాలు అధ్యయనం చేసే నృశాస్త్ర విజ్ఞానం కూడా బాగా వ్యాపించింది. మారుమూల నున్న మానవ సమాజాలను అధ్యయనం చెయ్యటం ఈ శాస్త్రానికి తొలినాటి లక్ష్యం. అందువల్ల ఆయా భాషలను శాస్త్ర పరిశోధకులు అధ్యయనం చేయాల్సిన అవసరం ఏర్పడింది. ఆ భాషల్లో ఎక్కువ భాగం మాట్లాడే భాషలు మాత్రమే.

ఆధునిక పారిశ్రామిక సమాజం ఫ్యూడల్ నిరంకుశత్వాన్ని ఎదుర్కొనే క్రమంలో కొన్ని ఉదారవాద (liberal) అభిప్రాయాలు, విలువలు ప్రచారం చేసింది. ఇందులో సర్వమానవ సమానత్వం, భాషా సమానత్వం ప్రధానమైనవి. మౌలికంగా మానవులంతా ఒకటే, వారు మాట్లాడే భాషలన్నీ సమానమే అన్నది ఈ విలువల సారాంశం. అందువల్ల నాగరకులు, అనాగరకులు, పట్నవాసులు, పల్లెవాసులు, ఆటవికులు అనే భేదం లేకుండా అందరూ ఒకే భాష మాట్లాడతారు. భాషలన్నిటికీ వ్యాకరణం ఉంటుంది. అనేది భాషల గురించి ఏర్పడ్డ నూతన అవగాహన. ఈరకపు అవగాహన నిలదొక్కుకోవాలంటే రాసే భాష నుంచి మాట్లాడే భాషను వేరు చేయాలి, దానికి ఉన్నత ప్రతిపత్తిని కలిగించాలి. ఇందుకు రాసే భాష గురించి ప్రచారంలో ఉన్న భావాలను ఎదుర్కోవాలి. అందుకు మాట్లాడే భాషకు వ్యాకరణాలు రాసి చూపించటం ఒక మార్గం. అందుకు ఆధునిక భాషా శాస్త్ర పరిశోధనలు బాగా పనికి వచ్చాయి.

ఫ్యూడల్ పాలనపై తిరుగుబాట్లు పాశ్చాత్యదేశాల్లో చాలా ముందే వచ్చాయి. ఆధునిక ప్రజాస్వామ్యం అనే కొత్తరకపు పరిపాలన విధానం ప్రజా ప్రాతినిధ్య పద్ధతిపై ఏర్పడింది. వలసపాలకులు ఆ పద్ధతులను కొంతలో కొంత వారి పాలిత ప్రాంతాలలో అమలు పరచారు. ప్రచారం చేశారు. పాలకులే కాక ఆదేశాల మేధావులు కూడా ఈ భావాలను

వ్యాప్తి చేశారు. వలస దేశాల మేధావులు కూడా వీటి ద్వారా ప్రభావితులై తమ తమ సంస్కృతీ, భాషా, సాహిత్యాల్లో మార్పులు తీసుకురావటానికి ప్రయత్నించారు. ముందుగా ఈభావాలకు ప్రభావితమయింది వంగదేశం. ఆ తరవాత ఆంధ్ర మేధావులు ప్రభావితం అయారు. వారిలో సామినేని ముద్దు నరసింహానాయుడు ( 3-1862) కందుకూరి వీరేశలింగం (1849-1919) గురజాడ అప్పారావు (1862-1915) గిడుగు వేంకట రామమూర్తి (1862-1940) ముఖ్యులు.

వీరేశలింగంగారు తెలుగులో నవల, ప్రహసనం వంటి కొత్త ప్రక్రియలను ప్రవేశపెట్టి సాంఘిక సంస్కరణోద్యమం నడిపారు. సామినేని ముద్దు నరసింహంనాయుడు గారు హిత సూచని అనే వ్యాసాల ద్వారా ఆధునిక భావాలు ఆధునిక భాషలో ప్రచారం చేశారు. గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తిగార్లు ఆధునిక భాషోద్యమం నడిపారు. దీనికే వ్యావహారిక భాషోద్యమం అని పేరు.

ప్రాచీన భాషా సమాజంలో రాసే భాష ప్రధానంగా సాహిత్య భాష. అదయినా నన్నయాదులు రచనలు చేసిన కావ్యభాష. కావ్యేతర రచనా సంప్రదాయాలు, పదాలు, సంకీర్తనలు, యక్షగానాలు ఉన్నా అవీ కావ్యభాషను నమూనాగా పెట్టుకున్నవే. వచన రచనా సాహిత్యం దాదాపు లేదు. వచనాలనే పేరుతో ఉన్న సాహిత్యం కూడా కావ్య భాషా సంప్రదాయంలో భాగమే. ఈ కావ్యేతర సంప్రదాయంలో కావ్యభాషాభిన్నమైన భాష స్వల్పంగా కనిపించే మాట నిజమైనా వాటి ప్రత్యేక రచనా సంప్రదాయాలింకా నిరూపింప బడలేదు.

ఆధునిక కాలంలో భాషా సమాజంలో భాషావసరాలు పెరిగాయి. పెరిగిన విద్యావసరాల కనుగుణంగా భాష పెరగలేదు. ప్రాచీన కావ్యభాష కావ్యేతర రచనా వ్యాసంగానికి చాలదు. పైగా దాని వ్యాకరణం క్లిష్టమైనది. పదజాలం బహు ప్రాచీనం (archaic) పాఠ్యగ్రంథాలకు, బులెటిన్లకు, విజ్ఞాన గ్రంథాలకు, వార్తా పత్రికలకు, అనేకాధునిక వచన సాహిత్య ప్రక్రియలకు కావ్యభాష సరిపోదు, పనికిరాదు. అందువల్ల తెలుగులో పూర్వతరాల మేధావులు ఆధునిక రచనా భాష అవసరాన్ని గుర్తించారు. అది ఎట్లా ఏర్పడుతుంది అన్న అంశం మీదనే ఈ మేధావులు విభేదించారు, వివదించారు.

ఈ భాష ప్రాచీన రచనా భాషను సులభతరం చేసి వాడుకోవచ్చునని వేదం వేంకట రాయశాస్త్రి, పానుగంటి లక్ష్మీనరసింహారావు, కందుకూరి వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం మొ॥ వారు అభిప్రాయపడ్డారు. గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి

గారి లాంటివారు ఆధునిక వ్యవహార భాష నుంచి రచనా భాష ఏర్పడాలని భావించారు. అందుకే తొలినాళ్ల రచనా భాష రాసే భాష నుంచి మాట్లాడే భాష వైపు ఒక మార్గం పయనించగా మాట్లాడే భాష నుంచి రాసే భాష వైపు రెండో మార్గం పయనించింది. రెంటి కలగాపులగపు మిశ్రమం వేరు వేరు పాళ్లలో ఈ శతాబ్దిపు తొలినాళ్ల రచనా భాషలో కనిపిస్తుంది.

రెండో మార్గాన్ని శిష్ట వ్యావహారిక భాష అని పిల్చారు. తొలినాటి భాషా సంస్కరణ వాదులు ప్రాయికంగా విద్యావంతులైన బ్రాహ్మణులు కావటం వల్ల ఈ శిష్ట వ్యావహారిక భాష అభివృద్ధి చెందిన మండలాలు బ్రాహ్మణ భాష కావటంలో ఆశ్చర్యం లేదు. అయితే కాల క్రమంలో బ్రాహ్మణేతరులు కూడా విద్యావంతులు కావటం వల్ల ఈ రచనా భాషలో తొలినాటి బ్రాహ్మణ శిష్టులలో మలినాటి బ్రాహ్మణేతర శిష్టులు కూడా కలిశారు. ఈ కలయిక వల్ల ఆధునిక రచనా భాష ఒక ప్రాంతానికి, వర్గానికి పరిమితం కాక ఇతరత్రా విస్తరించే అవకాశం ఏర్పడింది. ఈ ఆధునిక భాషోద్యమానికి పాశ్చాత్యదేశాల సంస్కృతీ, సమాజాల ప్రభావంతోపాటు, భారత సమాజికాభివృద్ధి అవసరాలు తోడయ్యాయి. ఇందుకు ఆధునిక భాషాశాస్త్ర సిద్ధాంతాలు సిద్ధాంత భూమికను సరఫరా చేశాయి. చిరకాలం నుంచి ఉన్న రచనా సంప్రదాయం కంటే భిన్నంగా ఆధునిక రచనా భాష మాట్లాడే భాష నుంచి ఏర్పడింది. పత్రికల వంటి ప్రసార సాధనాలు, ఆధునిక వచన రచనలు, వ్యావహారిక భాషోద్యమం వాటి వాటి వైపు నుంచి ఆధునిక రచనా భాష ఏర్పడటానికి దోహదం చేశాయి.

మాట్లాడే భాష నుంచి రచనా భాష ఏర్పడే పద్ధతి గురించి ఏర్పడాల్సిన అవసరం గురించి ఇప్పుడు చదువరులలో, రాతగాళ్లలో పెద్దగా భేదాభిప్రాయాలు లేవు. కాని ఈ కొత్త రచనా భాషకు ప్రమాణమేమిటి ? ఈ రచనా భాషను ఆధునిక ప్రామాణిక భాష అనవచ్చునా ? ఈ ప్రామాణిక భాషలో ఏకత్వం ఎంత ? అనేకత్వం ఎంత ? ఉండవలసిన ఏకత్వం ఎంత ? ఉండగలిగిన అనేకత్వం ఎంత ? అనే సమస్యలు ఉత్పన్నమవుతాయి.

## 3

ఇప్పుడు వ్యాసం మొదటి శీర్షికలో వేసుకున్న ప్రశ్న దగ్గరికి వెళ్దాం. రాసే భాషకీ, మాట్లాడే భాషకీ భేదాలున్నయ్యా ? నిర్మాణ వాద భాషా శాస్త్రజ్ఞుల ప్రకారం రెంటికీ భేదాలు లేవు. పరివర్తన సిద్ధాంత పరిధిలో పనిచేసిన వ్యాకర్తలు ఈ ప్రశ్న జోలికి వెళ్ళ లేదు, కాని వారు రెంటికీ భేదాలున్నట్లు ఎక్కడా ప్రస్తావించలేదు. వారు మాట్లాడే భాషల

మీదా పనిచేశారు, రాసే భాషల్లోంచీ ఉదాహరించారు. అంటే రెంటికీ తేడా లేనట్టే వ్యవహరించారు. సాంఘిక భాషా శాస్త్రవేత్తలు (sociolinguists) వ్యవహార వాచక భాషా వేత్తలు (discourse analysts and textual linguists) మాట్లాడే భాషకూ, రాసే భాషకూ భేదాలు బాగా గమనించారు. నోమ్‌ఛోమ్ స్కీ ప్రతిపాదించిన సూత్రబద్ధ భాషావ్యవహారాన్ని (rule governed behaviour) ను వీళ్లు వ్యతిరేకించారు. సూత్రాలు లిఖిత భాషలోనే తప్ప మాట్లాడే భాషలో పనిచేయవన్నారు. అసలు వాక్యం అనే భావన కూడా రాసే భాషదే కాని మాట్లాడే భాషది కాదన్నారు.

మాట్లాడే భాష మానవులందరికీ ఉంది. రాసే భాష కొందరికే ఉంది. కాబట్టి భాషను గురించి మాట్లాడటమంటే మాట్లాడే భాషను గురించి మాట్లాడటమే అనే అభిప్రాయం బలంగా ఉంది.

ఈ వివాదాలు ఇట్లా ఉండగా రెండు ప్రపంచ యుద్ధాల నడిమి కాలంలో యూరప్‌లో చెకోస్లోవేకియాలో ప్రాహా నగరంలో అభివృద్ధి చెందిన భాషా శాస్త్రాభిప్రాయాలను Prague School of Linguistics అనే పేరుతో పిలుస్తారు. ఆ సిద్ధాంత కర్తలలో ఒకరైన జోసెఫ్ వాకెక్ అనే ఆయన లిఖిత భాష మౌఖిక భాష నుంచే ఏర్పడ్డా కొన్నాళ్లకు అది స్వతంత్రంగా అభివృద్ధి చెందుతుందనీ అందువలన దాన్ని వేరుగా అధ్యయనం చెయ్య వలసి ఉంటుందని తొలి నుంచీ (1935 ప్రాంతం నుంచీ) వాదిస్తున్నాడు.

ఈ భేదాలు చాలా మౌలికమేనని ఆయన అభిప్రాయం. ఆయనా, ఆ తరవాత అమెరికన్ శాస్త్రవేత్తలు వ్యక్తీకరించిన మౌఖిక - లిఖిత భాషల మధ్య భేదాలను గమనిద్దాం.

మాట్లాడే భాషకూ, రాసే భాషకూ వేరు వేరు పరిమితులున్నాయి సౌకర్యాలు ఉన్నాయి. ఒకదాని కంటే ఇంకొకటి గొప్పది అని ముందుగా అభిప్రాయం ఏర్పర్చుకోటం వల్ల సత్యాన్వేషణ సరిగ్గా జరగదు. మానవజాతి పరిణామంలో మాట్లాడే భాషే ముందు ఏర్పడ్డట్టు తెలుస్తున్నది. గుహల్లో దొరుకుతున్న అతిప్రాచీన లేఖన విధానాలను బట్టి లేఖనమే ముందు అని వాదించే శాస్త్రవేత్తలు కూడా ఉన్నారు. ఒకవేళ అది నిజమైనా అప్పటి లేఖన చిహ్నాలను మనం ఇప్పుడు గుర్తిస్తున్న పద్ధతిలో భాష అని పిలవవచ్చునా అనే సందేహం కలుగుతుంది. ప్రపంచంలో లేఖన పద్ధతి ఉన్న ఆధునిక సమాజాలన్నీ పెద్దవి. మాట్లాడే భాషతోనే వ్యవహారం జరుపుకునే భాషా సమాజాలన్నీ చిన్నవి. అందువల్ల మాట్లాడే భాష కున్న దేశకాలాది పరిమితులను అతిగమించటానికి రాసే భాష ఏర్పడ్డట్టు కనిపిస్తున్నది.

మాట్లాడే భాషకు దేశాకాలావధి ఉంది. ధ్వని వాహకం కనక మాట్లాడే భాషకు యంత్ర సహాయం లేకుండా దూరగమన శక్తి లేదు. ఉచ్చరించిన ధ్వనులు అతివేగంగా గాలిలో కలిసిపోతాయి. ఈ రెండు పరిమితులు మానవ జాతి నాగరకతాభివృద్ధిలో అతిగమించ వలసి అవసరం ఏర్పడింది. దూర ప్రాంతాలలో ఉన్న తమ ఆత్మీయులతో, సజాతి వారితో, సభాషీయులతో సంబంధాలు ఏర్పర్చుకోవాలన్నా దూరభాషా సౌకర్యం అవసరం. ఒక కాలంలో ఒక జాతి సంపాదించిన విజ్ఞానం మరో కాలానికి అందాలన్నా దూరకాల భాష అవసరం. ఈ రెండు అవసరాలు రాసే భాష వల్ల తీరతాయి.

మాట్లాడే భాషకు మేధాపరిమితి కూడా ఉంది. ఏ అవధాన విద్యను అభ్యసించే కొద్దిమంది తప్ప మనుషులు ఏక కాలంలో కొంత సమాచారాన్ని మాత్రమే జ్ఞాపకం పెట్టుకోగలరు. అవధానులైనా కొత్త సమాచారాన్ని గుర్తు పెట్టుకోవాలంటే పాత సమాచారాన్ని త్యాగం చెయ్యాల్సి ఉంటుంది.

మాట్లాడే భాషను ఏకమితికం (unidimensional) గా వర్ణిస్తారు. కాలమే దాని మానం. అది వినపడుతుంది కాని కనపడదు. జనించిన వెంటనే గతిస్తుంది. రాసే భాషను ద్విమితికం (two dimensional) గా వర్ణిస్తారు. ఇది కాలంలో జనించినా వెంటనే గతించదు. దీని ముందు వెనుకలు, మనకి కనిపిస్తాయి. చూడగలుగుతాం. అందుకే మాట్లాడే భాషను గతి (process) అనీ, రాసే భాషను ద్రవ్యం (matter) అనీ అంటారు. అంతేకాదు ముందు వెనుకలకు జరిగే సౌకర్యం సమాచార గ్రహణాన్ని సుగమం చేస్తుంది. ఆ విదంగా జ్ఞాపకం పెట్టుకో అక్కర్లేకుండా అవసరం వచ్చినప్పుడు సరి చూసుకోవచ్చు. రాసిన దాన్ని పుస్తక రూపంలో ఏర్పరిస్తే త్రిమితికం (three dimensional) అని కూడా అనవచ్చు. పొడవు వెడల్పు ఉన్న పేజీలు, ముందు వెనుకల కాయితాలూ ఉంటాయన్న మాట.

మనం మాట్లాడే భాషలో ప్రాదేశిక సాంఘిక భేదాలను కాసేపు పక్కన పెట్టినా, కొన్ని ఇతర భేదాలు ఉంటాయి. సంభాషణ సాగించేటప్పుడు చాలా మాటలను మనం అవసరం కొద్దీ వాడతాం. అందులో కొంత సమాచారాన్ని కొన్ని మాటలను వెంటనే మర్చిపోతాం. ఇద్దరు పరిచితుల మధ్య సంభాషణలో కొంత అలవోకతనం ఉంటుంది. అపరిచితుల మధ్య సంభాషణలో జాగ్రత్త ఎక్కువ ఉంటుంది. దీన్నే ఆచితూచి మాట్లాడటం అంటాం. ఏం మాట్లాడాలో కొంచెం ముందు ఆలోచించుకొని మాట్లాడతాం. దీన్నే హాకెట్ ఎడిటింగు (editing) అంటాడు. కొద్ది గొప్పతేడాలతో మాట్లాడే భాషలో కూడా ఎడిటింగ్

ఉంటుంది. రాసే భాషలో రాసేటప్పుడు వాక్యాలను సరిచూసుకునే అవకాశం ఇంకా ఎక్కువ ఉంటుంది. ఈ ఎడిటింగు రాసే భాషలో మరికొన్ని మార్పులను కలిగిస్తుంది.

మాట్లాడే భాషలో సమాచార పునరుక్తి ఉంటుంది. విషయగ్రహణకు ఈ పునరుక్తి (reinforcement) అవసరం. రాసే భాషలో ముందు వెనుకలకు పోయే సౌకర్యం (పురః పశ్చాద్గమన సౌకర్యం) ఉంటుంది. గనుక ఈ పునరుక్తిని తొలగించవచ్చు. మాట్లాడే భాషలో చిన్న వాక్యాలుంటాయి. వాక్య శకలాలుంటాయి. ఒక్కొసారి వాక్యంలో పద సంబంధాల వైరుధ్యాలు కూడా ఉండవచ్చు. రాసే భాషలో వీటిని సరిచూసుకునే సౌకర్యం ఉంటుంది. అంతేకాదు, మాట్లాడే భాషలో అంతగా పట్టించుకోని పద ప్రయోగం, వాక్య నిర్మాణంలో పదౌచితి, వాక్యాల మధ్య తార్కిక సంబంధం వంటి వాటి పై ఎక్కువ దృష్టిపెట్టగలుగుతాం. వీటివల్ల రచనలో ప్రయోగంలో శైలీ భేదాలు పెరుగుతాయి. వీటిన్నిటి వల్ల రాసే భాష మాట్లాడే భాష నుంచి దూరం జరుగుతుంది. ఈ దూరం ఎంత వరకు సహించాలి ? అది ఆ సమాజావసరాలను బట్టి, వారి ''సహనశక్తి''ని బట్టి ఉంటుంది. అసలు దూరం ఉండకూడదు అని ఇటీవలి వ్యావహారిక భాషావాదులంటున్నారు. వ్యావహారిక భాషావాద ప్రారంభం నుంచీ ఈ ధోరణులున్నాయి. వ్యావహారిక భాషా వాదమంటే మాట్లాడినట్టు రాయటం అనే అర్థం వచ్చింది. అసలు నిజమేమిటంటే పూర్తిగా మాట్లాడినట్టు రాయలేమనీ, ఒకవేళ రాసినా అది మనుషుల అవసరాలకు పనికి మాలిన వివరాలు ఇస్తుందనీ. మాట్లాడినట్టు రాయాలనే వాదం వల్లనే ఈనాటి తెలుగు రాతలో రూపవైవిధ్యం విపరీతంగా వచ్చింది. గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి గార్లు కూడా ఈ రకపు రూపవైవిధ్యానికి లొంగి పోయారు. ఇక తరవాత వారు మాట్లాడినట్టు రాయటం అనేదాన్ని ఒక విలువగా ప్రచారం చేశారు. ఈ విలువకు మనం అలవాటు పడ్డ ప్రజాస్వామ్యపు విలువలను ఆపాదించాం.

మానవ సమాజం మాట్లాడే భాష అందించే సమాచారానికి, జ్ఞానానికీ పరిమితమై ఉంటే మానవజాతి ఇప్పుడు సాధించిన అభివృద్ధి అనూహ్యమై ఉండేది. మాట్లాడే భాష దైనందిన అవసరాలకు ఉద్దేశించింది. అందువల్ల ఆ అవసరాలకు పరిమితమవుతుంది. రాసే భాష అనేక భాషేతరాలను తనలో ఇముడ్చుకుని సాధారణ భాష అందించలేని సమాచారం అందిస్తుంది. (కాయితం మీద వేసే పట్టికలు, ఫార్ములాలు, ఇట్లాంటివి). మాట్లాడే భాషా వ్యవహారంలో కూడా భాషేతర భావ ప్రకటనాంశాలుంటాయి. మూతి విరుపులు, ముక్కు విరుపులు, అనేకాంగచాలన విశేషాలు, భాషా నిర్మాణంలో భాగం కాని

ఘూ, ఛా, ఛీ అనే ధ్వనులూ భాష చేసే భావ ప్రకటనకు విశేషంగా తోడ్పడతాయి. అందుకే దృశ్య భావ ప్రకటన సాధనాలయిన నాటకం, సినిమా వంటి వాటిల్లో ఇవి భాషను అనుసరించి భాషకుతోడ్పడుతూ ప్రవర్తిల్లుతూ ఉంటాయి. అంగచాలనం, ముఖకళవళికల్లో హావభావ ప్రదర్శనలేని ఉపన్యాసాలు అనాసక్తికరంగా ఉండడం మనకు పరిచితమే.

మాట్లాడే భాష అయినా రాసే భాష అయినా భాషేతర భావ ప్రకటన సాధనాల సహాయం లేకుండా ప్రవర్తిల్లదు. ఒకదానికొకటి పరిపరిపూరకంగా ఉంటుంది. ఒక్కోసారి భాషేతర భావ ప్రకటన భాషకన్నా శక్తిమంతంగా ఉండవచ్చు. ఎంకి పాటల్లో యెనక జల్మంలో యెవరమోనంటి సిగ్గొచ్చి నవ్వింది సిలక నాయెంకి అనే పాటలో నాయుడు బావ భాషలో మాట్లాడితే ఎంకి నవ్వటం, తెల్ల తెలపోవటం, కంట నీరెట్టటం అనే శారీరక చర్యల ద్వారా సమాధానం చెప్పినట్టు ఆపాట వర్ణిస్తుంది. దాని ద్వారా సాధించిన కవితా సౌందర్యం అనుభూతమే.

తాటి ఆకుల మీద రాసిన పురాణాల్లో వంశచరిత్రలు భాషలోనే చెపుతారు. ఆధునిక కాలంలో కాయితాల మీద వంశవృక్షాల ద్వారా సూచిస్తారు. భాషలో చెప్పిన వృత్తాంతానికి ఆంధ్ర మహాభారతం తృతీయా శ్వాసంలో పాండవ కౌరవుల వంశ క్రమం చూడండి. వాటిని గ్రహించటానికి ఎంత శ్రమ పడాలో ఒక చిన్న ఉదాహరణ చూడండి.

'...తొల్లి దాక్షాయణియైన యదితికిఁగశ్యపునకుంబుట్టిన వివస్వంతునకు వైవస్వతుండను మనువును, యముండును, శనైశ్చరుండును యమునయుఁదపతియు ననంబుట్టిరందు వైవస్వితుండను మనువు వలన బ్రహ్మక్షత్రియ వైశ్యాదులైన మానవులు పుట్టిరి మరియుం వారికి వేన ప్రముఖులైన రాజు లేబండ్రు పుట్టె వంశకరులై తమలోన యుద్ధంబు సేసి మడిసిరిమఱియు నమ్మను పుత్రియైన యిలయనుదానికి సోమపుత్రుండైన బుధునకు పులారవుడు పుట్టె - చక్రవర్తియై - ఆది 3-89.

ఇంతకన్నా పెద్ద పట్టికలు ఈ పురాణాల్లో కనిపిస్తాయి. పట్టికల సహాయంతో వీటిని ఎక్కువ స్పష్టంగా ప్రదర్శించవచ్చు. ప్రాచీన ప్రబంధాల్లో బంధకవిత్వాన్ని బొమ్మల్లో గ్రహించి నంత సులువుగా భాషలో గ్రహించలేం. ఆధునిక శాస్త్రాల్లో flow charts, ఇంకా అనేక రకాల చిత్రాల ద్వారా మోడల్సు ద్వారా విషయాలు స్పష్టంగా చెప్పగలుగుతాం. కేవలం నోటి మాట మీదనే ఆధారపడి ఉంటే భాషా శాస్త్రంలో చెట్టు బొమ్మల ద్వారా వ్యక్తం చేసే వ్యాకరణ సంబంధాలు కేవలం భాష ద్వారా సాధ్యమయ్యేవి కాదు. నోటిభాష చెప్పలేని

అనేక విషయాలు రాసే భాష ద్వారానూ, అసలు భాషే చెప్పలేని కొన్ని విషయాలను భాషేతర సాధనాల ద్వారానూ చెప్పగలుగుతాం.

మానవజాతి అభివృద్ధికి మాట్లాడే భాష, రాసే భాష, భాషేతర భావ ప్రకటన సాధనాలు - అన్నీ విడివిడిగానూ కలిసికట్టుగానూ తోడ్పడ్డాయనేది యథార్థం. వీటి పరస్పర పరిపూరక చర్యలు లేకపోతే మానవుల స్థితి జంతువుల కన్నా ఏమంత భిన్నంగా ఉండేది కాదు.

ఇటీవలి కాలంలో బహుశా సామ్యవాద ప్రభావమో ఏమో కాని రాసే భాష కన్నా మాట్లాడే భాష విలువైనదన్న అభిప్రాయమొకటి ప్రచారం అయింది. మాట్లాడే భాష ప్రాథమికమైనది. అయితే ప్రాథమికమైనదంతా విలువైనది కానక్కరలేదు. నాగరకతాభివృద్ధిలో ప్రాథమికమైన వాటి కన్నా భిన్నమైన వాటిని, మిన్న అయిన వాటిని మనుషులు నేర్చుకుంటారు.

మాట్లాడే భాషలో సరిగ్గా చెప్పక పోవటం ఉండదనీ, మాట్లాడే భాషలో ఉండే సూత్రాన్నిటినీ రాసే భాషలో కూడా పాటిస్తే రాసే భాషలో కూడా ఏ సమస్యలూ ఉండవనీ, రాసే భాషలో చిక్కులు వస్తే మాట్లాడే భాష సాయంతో పరిష్కరించుకోవాలని రంగనాయకమ్మ అనే ప్రసిద్ధ తెలుగు రచయిత్రి వాదిస్తున్నారు. మాట్లాడే భాషకు భిన్నంగా కనిపించే వాటిని రాసే భాషలో చూసి వాటిని తప్పులనుకుంటున్నారు. ఆమె తప్పులని పదిపదిహేనేళ్ల నుంచి అంటున్నవి కూడా రాసే భాషలో కనిపిస్తూనే ఉన్నాయి.

ఆంధ్రప్రభ దినపత్రిక 2000 జనవరి 23 ఆదివారం సంచికలో రాంభట్ల 'కథనం' అనే కాలమ్‌లో మ్లేచ్ఛులలో పుట్టాడు తొలిదేవుడు అనే వ్యాసంలో ఈ వాక్యాలు కనిపించాయి.

''తొలుతవారు *మేకలు, గొర్రెల మందల్ని* పెంచుతూ వాటి మీదే జీవించేవారు. కానీ వారున్నదేశం *కొండలు బండల దేశం* అవడం వల్ల....''

''మేకలు, గొర్రెల కాపరులైన మ్లేచ్ఛులు....''

పైన *మేకల మందల్ని, గొర్రెల మందల్ని* అనీ *కొండల దేశం, బండల దేశం*, అనీ *మేకల కాపర్లు, గొర్రెల కాపర్లు* అయిన మ్లేచ్ఛులు అనీ మాట్లాడే భాషలో ఉంటుంది.

1998 ఏప్రిల్ 22 రాత్రి 9 గంటల ఈటివి న్యూస్‌లో, *మేకలు, గొర్రెలపై* బీమా సౌకర్యం కల్పించాలని...'' అనే వాక్య శకలం వినిపించింది. ఇది సాధారణంగా

మాట్లాడే భాషలో మేకలపై, గొర్రెలపై బీమా సౌకర్యం అని ఉండేది. 1995 ఆగస్టు 16 ఈనాడు హైదరాబాదు సప్లిమెంటులో అధికారులు, ప్రభుత్వానికీ మధ్య లోపిస్తున్న సమన్వయం అనే వార్తా శీర్షిక ఉంది. ఇక్కడ మాట్లాడే భాషలో అయితే అధికారులకీ, ప్రభుత్వానికీ మధ్య అని ఉండేది.

ఏ రోజు ఏ తెలుగు దినపత్రిక తీసినా, వారపత్రిక తెరిచినా ఈ రకపు వాక్యాలు కొల్లలుగా దొరుకుతాయి. ఈ రకపు వాక్యాలపై మొదట దృష్టి సారించింది రచయిత్రి రంగనాయకమ్మగారు. సుమారు పదేళ్ళ పాటు ఈ రకపు సమాచారం సంగ్రహించి వాడుక భాషే రాస్తున్నామా అని ఆంధ్రజ్యోతి వారపత్రికలో వరసగా కొన్నివారాల పాటు చర్చించారు. ఇంకా చాలా విషయాలు చర్చించారు. ఇది ప్రధానంగా నా దృష్టిని ఆకర్షించటానికి కారణం భాషా పరిశోధకుణ్ణి ఉద్రేకపరచే, రెచ్చగొట్టే అంశాలున్నాయి గనుక. అందువల్ల రంగనాయకమ్మగారి లాగా తప్పొప్పుల పద్ధతిలో కాక భాషలో జరుగుతున్న ఒక పరిణామం దృష్ట్యా పరిశీలిద్దాం. తప్పొప్పుల పద్ధతిలో నిర్ణయించి ఇది తప్పు అని తేల్చి వేస్తే అంత కన్నా చెప్పటానికేమీ ఉండదు. ఏం జరుగుతున్నదో అంతరంగ ప్రవేశం చేసి గ్రహించి ఎందుకు జరుగుతున్నదో చెప్పితే భాషను గురించి ఒక ముఖ్య విషయం చెప్పగలుగుతాం.

పైన పేర్కొన్న భాషాంశాలను స్పష్టత కోసం మరి కొంత సరళీకరించి వివరిస్తాను. పైన పేర్కొన్న సమస్యను సువ్యక్తం చేసే ఈ కింది ఉదాహరణలను చదవండి.

? 1. మేకలు, గొర్రెల కాపర్లు
?? 2. మేకలు, గొర్రెల మీద
?? 3. మేకలు, గొర్రెల పైన
??? 4. మేకలు, గొర్రెలకు
??? 5. మేకలు, గొర్రెలను

పై వాక్యాంశాల్లో మేకలు, గొర్రెలు అనే జంతువులను మాత్రమే గ్రహించాం. అట్లాగే పందులు, కోళ్లు మొదలైన వాటిని కూడా చేర్చి పందులు, కోళ్లు, మేకలు, గొర్రెల పెంపకం వగైరా నామబంధాల్ని చేర్చవచ్చు. ఇట్లాంటి నామ సంకలనానికి సంఖ్యా పరిమితులేమీ లేవు. ఇక్కడ విషయం ఏమిటంటే బహువచన నామం నుంచి విశేషణం నిష్పన్నం అయినప్పుడు దానిపై విశేష్యం అన్ని నామాలకు - మేకల కాపర్లు, గొర్రెల కాపర్లు అనే విధంగా చేరాలి. మీద, పైన అనే పదతుల్య విభక్తులకు కూడా అన్ని విశేషణాలు చేరతాయి. అంటే మేకల మీద, గొర్రెల మీద అనీ, మేకలపైన గొర్రెలపైన అనీ, మేకలకు, గొర్రెలకు అనీ, మేకలను, గొర్రెలను అనీ అనాలి. మాట్లాడే భాషలో అట్లాగే అంటాం. రాసే భాషలో

అట్లా రాయక పోవటం తప్పు. మాట్లాడే భాషలో వర్తించే సూత్రాన్ని రాసే భాషకు వర్తింప జేయక పోవటం వల్ల ఈ తప్పు రాసే భాషలో దొర్లింది. మాట్లాడే భాష తోడ్పాటుతో ఈ తప్పును సవరించుకోవాలి. ఇదీ రంగనాయకమ్మ గారి ప్రతిపాదన సారాంశం.

పై వాక్యాంశాల్లో మొదటి దాంట్లో కాపర్లు అనే చివరి పదం పూర్తి పదం, విశేష్యం (నామ పదం). రెండు, మూడు సంఖ్యగల అంశాలలో చివర ఉన్న మీద, పైన అనే మాటలు విభక్త్యర్థంలో వాడిన పదతుల్యాలు. వీటికి కొన్ని చోట్ల పదప్రతిపత్తి ఉంది. *మీద పడ్డాడు, పైన ఉన్నాడు* అనే విధంగా వాక్యాదినరాగలవు. నాలుగు, అయిదు అంశాల చివర ఉన్న కు, ను అనేవి పూర్తి స్థాయి విభక్తులు, అపదాలు. పై వాక్యాంశాల మొదట ఉంచిన ప్రశ్నార్థకాల గురించి కూడా కొంత వివరణ అవసరం. రంగనాయకమ్మ గారు పై వాక్యాంశాలను తప్పులన్నారు. అంటే మాట్లాడే భాషలో కనిపించే, ప్రవర్తించే వ్యాకరణ సూత్రాలకు విరుద్ధాలని వారి ఉద్దేశం. ఈ వైరుద్ధ్యంలో అంతరువులున్నాయని నా ప్రతిపాదన. పై అంశాల్లో పూర్వ పదంలో ఉండవలసిన శబ్దాలు లోపించటం వల్ల ఈ వ్యాకరణ వైరుద్ధ్యం ఏర్పడింది. ఈ లోపించిన శబ్దాలు పదాలయితే ఒక స్థాయి వ్యాకరణ వైరుద్ధ్యం ఏర్పడుతుంది. లోపించింది పదతుల్య శబ్దం అయితే ఇంకొంచెం ఎక్కువ వ్యాకరణ వైరుద్ధ్యం ఏర్పడింది. లోపించింది అపదం అయితే మరీ ఎక్కువ వ్యాకరణ వైరుద్ధ్యం ఏర్పడింది. ఈ వ్యాకరణ వైరుద్ధ్య స్థాయి భేదాలను సూచించటానికి అంశాల సంఖ్యల ముందు ప్రశ్నార్థకాలుంచాను. వాక్య, వాక్యాంశాల్లో వ్యాకరణ విరుద్ధత తెలుపు - నలుపు లాగా అటో ఇటో ఉండదనీ వీటిలో తరతమ భేదాలుంటాయని ఆధునిక భాషా పరిశోధకుల అనుభవం, వారి పరిశోధక పత్రాలలో పాటించే అలవాటు. ఈ వ్యాకరణ వైరుద్ధ్యానికి కాని, స్థాయి భేదాలకు గాని గుర్తించదగిన కొలమానాలు లేవు, అన్ని వేళలా పనికొచ్చే ప్రమాణాలు కూడా లేవు. ''ప్రమాణ మంతఃకరణ ప్రవృత్త ఏవ'' అని కాళిదాసు శాకుంతలంలో దుష్యంతుడులాగా అంతఃకరణమే ప్రమాణం అని అనుకోవాలి. దీన్ని భాషా శాస్త్రంలో - ఇంట్యూషన్ (intuition) అనే పదంతో సూచిస్తారు. అంతఃకరణం గుర్తించిన స్థాయి భేదాలను వ్యాకరణం వివరిస్తుంది. ఆ వివరణలో భాగమే వాటికి వాక్యాంశాల చివర వచ్చిన శబ్దాల పదత్వ, పదతుల్యత్వ, అపదత్వాలను కారణాలుగా ప్రతిపాదించటం. అంటే ఇక్కడ వెనుకవైపుగా జరిగిన శబ్ద లోపం భిన్న స్థాయిల వ్యాకరణ వైరుద్ధ్యాన్ని కలిగించిందన్న మాట. దీన్ని అంతరువుల లోప సూత్రం (hierarchical deletion rule ) అంటున్నాను.

ఇప్పుడు ఇంకో విషయం గమనించండి పై వాక్యాంశాలన్నిటిలో మేకలు అని నామపద (విశేష్య) రూపంలో ఉంది. గొర్రెల అనే శబ్దం విశేషణ రూపంలో ఉంది. పైన సూచించిన శబ్ద లోపం జరిగిన తరవాత విశేషణానికి అవసరమైన పదమో, పదతుల్యమో, అపదమో లేనందువల్ల విశేషణం నామపదం (విశేష్యం)గా ముందటి రూపానికి మారిపోయింది. దీన్ని సూత్రంగా చెపితే పునర్ విశేష్య పరివర్తన సూత్రం (nominal reversal rule) అనవచ్చు. పై లోపం సూత్రం ప్రవర్తించిన వెంటనే రెండోది కూడా 'ఆటోమేటిక్' గా ప్రవర్తిస్తుంది. దీన్ని అనువర్తన సూత్రం (contingent rule) అంటారు. దీనికి స్వతంత్ర అస్తిత్వం లేదు. లోప సూత్రంలో భాగంగానే ప్రవర్తిస్తుంది. స్పష్టార్థ ప్రతిపత్తి కోసం రెండు సూత్రాలుగా వీటిని గురించి మాట్లాడుకున్నా ఒక సూత్రంగానే పరిగణించవచ్చు. అప్పుడు దీన్ని ''అంతరువుల శబ్ద లోప - విశేష్య పునః పరివర్తన సూత్రం'' అందాం. ఇంత పేరు ప్రతిసారి రాయటం కష్టం కనక ఈ వ్యాసం కోసం అంతరువుల లోప సూత్రం అని కాని, ఊరికే లోప సూత్రం అని కాని రాసినా రెంటినీ ఉద్దేశించినట్టు ఇక నుంచీ అన్వయించుకోవాలి.

మాట్లాడే భాషలో లేని ఈ సూత్రం రాసే భాషలోకి వచ్చింది. టీ.వి. వార్తలు రాసుకొని చదువుతారు కనక అది చదివే భాష. అందువల్ల పైన ఉదాహరించిన టి.వి. వార్తాంశం రాసే భాష కన్నా భిన్నం కాదు.

భాషా పరిశోధనలో సంబంధిత సమాచార సంగ్రహణం (data collection), విశ్లేషణ-సూత్రీకరణ (analysis and rule formulation), వివరణ (explanation) అనేవి ముఖ్యదశలు. ఈ దశల్లో ప్రథమ దశ రంగనాయకమ్మగారు అధిక శ్రమ కోర్చి, చాలా శ్రద్ధతో, బహుకాలం (పదేళ్ళ దీర్ఘకాలం) సమాచారం సంగ్రహించారు. ఇది సామాన్యమైన పని కాదు. భాషా పరిశోధకులెవరూ గుర్తించని మార్పును, మాట్లాడే భాషలో లేని, రాసే భాషలో మాత్రమే ఏర్పడ్డ (? ఏర్పడుతున్న) ఒక పద్ధతిని ఆమె గుర్తించి ప్రదర్శించారు. అయితే దానిని సూత్రీకరించి, వివరించటానికి తగిన శిక్షణ ఆమెకు లేదు. శిక్షణ లేకపోయినా, నిశితంగా పరిశీలించగల నేర్పు ఉన్నవారికి మాత్రమే ఇది సాధ్యం. అయితే ఆమె వీటిని తప్పులను కొని తెలుగు రచయితల మీద ధ్వజమెత్తారు. ఆమె మాట్లాడే భాషను సర్వ లక్షణ సమన్వితమనుకొని, రాసేవాళ్లు తెలియకనో, లక్షణ పరిజ్ఞానం లేక పోవటం వల్లనో, లేక కావాలనో తప్పులు రాస్తున్నారనుకున్నారు. భాషలో కొత్తగా ఏర్పడుతున్న ఒక పరిణామమని ఆమె గమనించలేదు. ఆమె సంగ్రహించిన ఈ

సమాచారం భాషా పరిశోధకులకు అయాచితంగా ఆమె అందించిన అమూల్య సంపద. ఇప్పుడు పరిశోధనలో రెండో దశలో ఉన్నాం. సూత్రాన్ని స్థూలంగా గమనించాం. ఈ సూత్రాన్ని రెండు భాగాలనుకున్నాం. వాటిని ఈ కింది విధంగా సూత్రీకరిద్దాం.

శబ్దలోప - నామ పరివర్తన సూత్రం

అ) ప్రథమేతర విభక్తి సంబంధాలను వ్యక్తం చేసే పదబంధాల సంకలన సంయోజన (additive coordinative) లో విశేషణం పై వచ్చే అంతిమేతర పునరుక్త (పద, పదతుల్య, అపద) శబ్దాలు లోపిస్తాయి.

ఆ) లుప్త శేషమైన విశేషణం విశేష్యంగా పునః పరివర్తితమవుతుంది.

ఇ) ఈ మార్పు రచనా భాషలో మాత్రమే జరుగుతుంది. రచనా భాష అంటే రాసే భాష.

ఈ) మార్పు జరిగిన తరవాతి పదబంధంలో పద - పదతుల్య - అపదాల ననుసరించి వ్యాకరణ సమ్మతి ఉత్తరోత్తర క్రమంలో తగ్గుతుంది.

నిజానికి (అ) (ఆ ) లు మాత్రమే సూత్రీకరణలు. (ఇ) (ఈ) లు మన సంప్రదాయ వ్యాకరణంలో 'వృత్తి' లాంటివి.

పై సూత్రీకరణలను సందర్భాన్ని అనుసరించి ఇంకొంచెం చిత్రిక పట్టాల్సి రావచ్చు. సూత్రీకరణ దాదాపు పై పద్ధతిలో ఉంటుంది.

అసలీ సూత్రాలు ఎందుకు వచ్చాయి ? రాసే భాషలోనే ఎందుకు వచ్చాయి ? రాసే భాషలో కూడా మాట్లాడే భాష కన్నా భిన్నంగా మార్పులు వస్తాయా ? ఈ మార్పులు రాసే భాషకు మాత్రమే పరిమితం అవుతాయా ? మాట్లాడే భాషకు కూడా వ్యాపిస్తాయా? ఇట్లాంటి ప్రశ్నలనేకం ఉదయిస్తాయి. వీటిని గురించి కూడా భాషా పరిశోధకులు ఆలోచించాలి. ఇది పరిశోధనలో పరమదశ. చరమదశ.

మాట్లాడే భాషలో పునరుక్తి భాషా ప్రయోజన పూర్తికి అవసరమైన గుణం. రాసే భాషలో ముందు, వెనుక అంశాలను ఒకేసారిగాని విడివిడిగా గాని చూసి సమాచార గ్రహణకు వినియోగించుకొనే అవకాశం ఉంది. విషయ పునరుక్తి (redundancy), పొదుపు (economy) సమాచార గ్రహణకు అనుకూలించే రెండు విరుద్ధాంశాలు. ఈ రెండూ గతితార్కిక (dialectical) పద్ధతిలో భాషలో ప్రవర్తిస్తుంటాయి. ఇవి భాషలో సహజంగానూ ఉండవచ్చు. కొన్ని వ్యూహాల ద్వారా వర్తిస్తూ ఉండవచ్చు.

తెలుగు వాక్యంలో కర్త అందించే కొంత సమాచారాన్ని క్రియా విభక్తి (ను, ము, ది,వి,డు,రు) ప్రత్యయాలు కూడా అందిస్తాయి. అది విషయ పునరుక్తి (redundancy). మనం అనవధానత వల్ల కర్తృశబ్దాన్ని వినకపోయినా క్రియా విభక్తి అందించే ఈ సమాచారం వల్ల భాషా వ్యవహారం సవ్యంగా సాగుతుంది. ఈ పునరుక్తి సౌకర్యాన్ని ఉపయోగించుకొని వక్త వాక్యంలో కర్తను వదిలేసి పొదుపు (economy) సాధించవచ్చు. సుబ్బావధాన్లు అలంకార శాస్త్రం చదివాడు, వ్యాకరణ శాస్త్రం చదివాడు, ఛందశ్శాస్త్రం చదివాడు. అనే వాక్యం మాట్లాడేటప్పుడు బాగానే ఉంటుంది. మాట్లాడే భాషా పద్ధతిని 'అనుకరించే' రాసే భాషలోనూ బాగానే ఉంటుంది. కాని సమాచార గ్రహణమే ప్రధానమైన చోట ''సుబ్బావధానులు అలంకార, వ్యాకరణ, ఛందశ్శాస్త్రాలు చదివాడు'' అనే వాక్యం రాతలో ఎక్కువ కనిపిస్తుంది. పునరుక్త సమాచారం వదిలేసినా ముందుకు వెళ్లి గ్రహించే వీలు రాతలో ఉండటం వల్ల పొదుపు సాధించటానికి వీలయింది. అందుకే మాట్లాడే భాషలో చిన్న వాక్యాలుంటాయి. రాసే భాషలో పెద్ద వాక్యాలుంటాయి. పెద్ద వాక్యాలలో చిన్న వాక్యాలలో కనిపించే విషయ పునరుక్తి తగ్గి కుదింపు ద్వారా పొదుపు పెరుగుతుంది. అయితే ఇంతకాలం నుంచి మాట్లాడే భాష ప్రాథమికం, రాసే భాష మాట్లాడే భాష నుంచి పుట్టింది కాబట్టి మాట్లాడే భాషలోనే అన్నీ ఉంటాయనుకున్నాం. కొత్త పద్ధతులు, అక్కడే మొదలవుతాయనుకున్నాం. కొత్త సూత్రాలు, అక్కడే పుడతాయనుకున్నాం. కాని రంగనాయకమ్మ గారు సంగ్రహించి ఇచ్చిన సమాచారం కొత్త సూత్రాలు రాసే భాషలో కూడా మొదలవుతాయని నిరూపించింది. చరిత్రలో ఇటువంటి ఘట్టాలేమన్నా ఉన్నాయా? ఏమో వెతకాలి.

అలిఖిత ద్రావిడ భాషల వ్యాకరణాలలో కర్మణి వాక్యాలు కనపడవు. స్వాహిలీ (Swahili) అనే బంటూ భాష తూర్పు ఆఫ్రికా బంటూ భాషలు మాట్లాడే రాజ్యాలకు సామాన్య భాషగా, రచనా భాషగా (lingua franca) ఆధునిక కాలంలో మార్పు చెందింది. ఆ భాషలో కర్మణి వాక్యాలు పరిణామం చెందిన వైనం Talmy Givon అనే భాషా శాస్త్రవేత్త నిరూపించాడు. వీటిని బట్టి చూస్తే కర్మణి వాక్యాలు కొన్ని భాషల్లో రాసే భాషల పరిణామం అయి ఉండవచ్చు. ఆయన మాట్లాడే పద్ధతులను pragmatic mode అనీ, రాతలో కనిపించే పద్ధతులను syntactic mode అని పిలిచాడు. మాట్లాడే భాషలు పలచ (loose) గా ఉంటాయనీ, లిఖిత భాషలు చిక్క (tight) గా ఉంటాయనీ అంటాడు. మనం ఈ వ్యాసంలో గుర్తించిన పద్ధతుల్లో చెపితే మాట్లాడే భాషల్లో విషయ పునరుక్తి (redundancy) ఎక్కువ ఉంటుంది. రాసే భాషలో పొదుపు (economy) కోసం కుదింపు

ఎక్కువవుతుంది. ఇవే మాట్లాడే భాష పలచ (loose) గా ఉండటానికి, రాసే భాష చిక్క (tight) గా ఉండటానికి కారణం కావచ్చు.

పారిశ్రామిక విప్లవం తరవాత ప్రపంచంలో జరిగిన మార్పుల్లో విద్యావ్యాప్తి (literacy) ఒకటి చెప్పుకోదగింది. పారిశ్రామిక సమాజాల్లో ముఖ్యంగా యూరప్‌లో నూటికి నూరుపాళ్లు విద్యావంతులున్న సమాజాలున్నాయి.

తూర్పు దేశాల్లోనూ, ఆఫ్రికా దేశాల్లోనూ విద్యావంతుల సంఖ్య గణనీయంగా దయనీయంగా తక్కువ. అందువల్ల యూరపియన్ సమాజాల్లో ఏది రాసే భాషలో వచ్చిందో ఏదో మాట్లాడే భాషలో మొదలయిందో గుర్తించటం కష్టం. సాక్ష్యాలు దొరకవు. ఒక చోట మొదలయింది రెండో చోటికి వ్యాపిస్తుంది. భాషా పరిణామాల దృష్ట్యా ఆసియా, ఆఫ్రికా భాషా సమాజాలు ఈ విషయంలో అమూల్య సమాచారం అందిస్తాయి. ఎందుకంటే రాసే భాషలో మొదలయిన పరిణామాలు మాట్లాడే భాషకు వ్యాపించటానికి కొంత కాలం పడుతుంది.

ఇప్పుడు రాసే తెలుగులో మొదలయిన ఈ మార్పు మాట్లాడే తెలుగులోకి ఇంకా వ్యాపించలేదు. అంతే కాదు రంగనాయకమ్మ గారిలాంటి వారికి ఇవి తప్పులుగా కనిపిస్తున్నాయి. నాలాంటి వారికి భిన్న స్థాయిల వ్యాకరణ సమ్మతి ఉన్న పరిణామాలుగా కనిపిస్తున్నాయి. ఇంకా ఎవరెవరికి ఎట్లా కనిపిస్తున్నాయో తెలీదు. ఈ రకమైన మార్పు ఇట్లాంటి నిర్మాణాలున్న ఇతర ద్రావిడ భాషల్లో కూడా జరుగుతున్నాయా ? అక్కడ ఇవి ఏ స్థితిలో ఉన్నాయి ? ఉదాహరణకు కేరళ రాష్ట్రంలో విద్యావ్యాప్తి ఎక్కువ. మలయాళంలో ఈ రకపు పరిణామం ఉంటే ఏ స్థితిలో ఉంది ? ఇవన్నీ భాషా శాస్త్రజ్ఞులకు పూర్తిగా పనిపెట్టే ప్రశ్నలు.

తెలుగులో రాసే భాషలో ఏర్పడ్డ ఈ సూత్రంలో ప్రథమేతర విభక్తి కోసం వచ్చిన విశేషణ రూపం పునరుక్త శబ్ద లోపం తరవాత విశేష్యంగా మారిపోవటం ఇంకో విశేషం. విశేషణం తరవాత విశేష్యమో, విభక్తి పదమో, శబ్దమో ఒకటి రావాలి. అది లేకుండా విశేషణానికి స్వతంత్ర వ్యక్తిత్వం లేదు.

పైగా పట్టికలో ఎప్పుడూ ప్రథమా విభక్తి రూపాలే ఉంటాయి. సుమేరియన్ నాగరికతకు సంబంధించి దొరికిన ఫలకాలలో దొరికిన పట్టికలలో ప్రథమా విభక్తి నామ వాచక రూపాలే కనిపించాయి. భాషలో పద సంయోజన (coordination) రాయటంలో పట్టికకు సమానం. మనం పట్టికగా కూర్చే వస్తువుల పేర్లన్నీ ప్రథమా విభక్తిలోనే కూరుస్తాం.

ఇస్త్రీకి వేసిన గుడ్డల పట్టికలోనూ, బజార్నుంచి కొనుక్కొని రావాల్సిన వస్తువుల పట్టికలోనూ, వస్తువుల పేర్లనూ ప్రథమా విభక్తిలోనే రాస్తాము. క్రీ. పూ. 3500 సంవత్సరాల నాటికి మానవ నగరికతలో పట్టికలు దొరికాయి. అవీ ప్రథమా విభక్తిలోనే ఉన్నాయి. భాషలో సంయోజన (సముచ్చయ పద సంకలనం) అడ్డంగా రాసే పట్టికతో సమానమే కనుక పట్టికలో వస్తువుల పేర్లు ప్రథమా విభక్తిలో ఉండటం అతి ప్రాచీనమైన అలవాటులాగా కనిపిస్తుంది. అందువల్ల ప్రథమేతర నామాలు విభక్తి పద లోపంతో ప్రథమకు తిరిగి మారటం ఒక బలమైన అలవాటు (tendency) లాగా కనిపిస్తున్నది.

మాట్లాడే భాష, రాసే భాష ఒకటేనా అంటే పూర్తిగా ఒకటే అనలేము, పూర్తిగా వేరు అనీ అనలేము. మా అమెరికా గురువు జెరల్డ్ కెలీ (1928-1987) గారు చెప్పే పద్ధతిలో అవును - కాదు అనేది సత్యానికి సన్నిహితమైన సమాధానం. ఎంత అవును? ఎంత కాదు అనేది మళ్లీ భాషకూ, భాషకూ విద్యావ్యాప్తిని బట్టి నిర్ణీతమవుతుంది. మనకింకా అంతుబట్టని ఏ శక్తుల *ప్రమేయం ఎంత ఉందో* ఇప్పుడప్పుడే తెలీదు.

# క్రియాస్తి నాస్తి విచికిత్స

తెలుగు భాషపై ఏ మాత్రం ఆసక్తి ఉన్న వారికైనా కొట్టవచ్చినట్టు కనిపించే ఒక లక్షణం కొన్ని వాక్యాల్లో క్రియ కనిపించక పోవటం. ఉదాహరణకి ఈ కింది వాక్యాల్ని పరిశీలించండి.

1. ఎ. విమల మంచి అమ్మాయి
   బి. శాస్త్రిగారు తెలుగు ప్రొఫెసరు
   సి. శ్రీదేవి మంచి టీచరు
2. ఎ. అతను మంచి వాడు
   బి. ఆమె మంచిది
   సి. అవి మంచివి
   డి. ఆ విద్యార్థులు మంచివాళ్ళు, ఆ అమ్మాయిలు తెలివైన వాళ్ళు
   ఇ. ఆ చీరలు కొత్తవి

ఈ రకపు వాక్యాల చివర క్రియ లేకుండానే తెలుగు వాళ్ళు, వ్యవహరిస్తున్నారు. ఇతర భాషల్లో ఈ వాక్యాల నిర్మాణంలో క్రియ కనిపిస్తుంది. ఇంగ్లీషులో "be" అనే క్రియ కనిపిస్తుంది. పై వాక్యాలని పరిశీలిస్తే వాటిని రెండు దళాలుగా విభజించవచ్చు. అందుకే వాటిని ద్విదళ (bipartite) వాక్యాలు అని కూడా వ్యవహరిస్తారు. ఈ వాక్యాల్లో రెండు దళాలూ రెండు నామ బంధాలు. ఇవి సర్వనామాలు కావచ్చు. ఒట్టి నామపదాలు కావచ్చు. విశేషణ పూర్వక నామాలు కావచ్చు. ఈ రెండు నామబంధాలు ఏకవస్తు సూచకాలు. వీటిని కర్త, కర్మ, క్రియ అనే పద్ధతిలో విభజించడం కుదరదు. ఈ వాక్యాల్లో క్రియ లేదు. క్రియ అవసరమైన భాషల్లో అయినా అది నిజంగా క్రియ కాదు. అంటే వ్యాపార బోధకత లేదు. అందుకే ఆ భాషల్లో క్రియలాగా కనిపించే ఆ పదాన్ని అనుసంధాన క్రియ (linking verb) అంటారు. అంటే ఈ క్రియ పని ఆ రెండు దళాలను సంధించటం మాత్రమే. మరికొన్ని భాషల్లో ఈ పని క్రియేతర భాషాంశాల ద్వారా జరగొచ్చు. క్రియ ఉన్న భాషల్లో ఈ క్రియ కాలబోధకవాహకంగా పనిచేస్తుంది. ఈ క్రియకు భాషేతరమైన అర్థం ఏమీ లేదు.

ఈ రెండు దళాల్లోనూ మొదటి దాన్ని విషయి (topic) రెండోదాన్ని విషయం (comment) అని విభజించవచ్చు. మనం దేన్ని గురించి చెప్పదల్చుకున్నామో అది విషయి,

దాన్ని గురించి ఏం చెప్పదల్చుకున్నామో అది విషయం. ఈ రెండూ నామవాచకాలే కావటం వల్ల రెండూ సూచించే వస్తువులు ఒకటే అవుతాయి. మొదటిది వస్తువును సూచిస్తే రెండో దళం దాని లక్షణాన్ని, గుణాన్ని, వృత్తిని, తరగతిని ఇట్లా అనేకానేక అంశాలను సూచిస్తుంది. అతను మాటకారి అంటే ప్రవర్తనను సూచిస్తుంది. అతను మేధావి అంటే మేధను సూచిస్తుంది. అతను కోపిష్ఠి అంటే గుణాన్ని, రోగిష్ఠి అంటే శరీర ధర్మాన్ని సూచిస్తుంది. అతను తెలుగువాడు అంటే జాతిని, అతను సుబ్బారావు అంటే పేరును, మనిషి అంటే ఇతర జీవరాసుల నుంచి వేరు చేసే జాతిని (Species) చూపిస్తుంది. ఈ వాక్యాల్లో రెండవ దళంగా రాగలిగిన నామ బంధాలను పరిశీలించి ఎన్నో ఆసక్తిరమయిన విషయాలు చెప్పడానికి వీలుంది. అది ప్రత్యేక పరిశోధనాంశం.

ఈ వాక్యాల్లో సాధారణంగా రెండోదళం నామబంధంగా ఉంటుంది. అయితే మంచిది, మంచివాడు అనేవి విశేషణాల నుంచి నిష్పన్నమయిన నామబంధాలు. దీన్ని బట్టి తెలుగు ద్విదళ వాక్యాల్లో రెండవదళం ఎప్పుడూ నామబంధమే కాని కేవలం విశేషణం ఉండదు అని నిర్ధారించుకోవచ్చు. అయితే ఈ కింది వాక్యాలని పరిశీలించండి.

3. ఆ శిఖరం ఎత్తు
   ఈ లోయ లోతు
   ఆ అమ్మాయి పొడవు / పొడుగు
   ఈ అబ్బాయి పొట్టి
   ఆ గది వెడల్పు

ఈ వాక్యాల్లో రెండో దళంలో ఉపయోగించిన ఎత్తు, లోతు వంటి శబ్దాలు నామాలా, విశేషణాలా అని తేల్చడం కష్టం. నిజానికి పూర్వపు వాక్యాల్లో మంచివాడు, మంచిది, మంచివి వంటి నామాలను విశేషణాలుగా కూడా సంభావించి, ది, వి, వాడు, వాళ్లు సర్వనామాలను బోధించే ప్రత్యయాలుగా భావించవచ్చు. ఇవి కాక మరికొన్ని వాక్యాల్లో రెండో దళంలో విశేషణాలు కనిపిస్తున్నాయి.

4. హైదరాబాదు నాకు కొత్త
   అతను మా ఊరికి పెద్ద
   మా తమ్ముడు మా అందరిలో పొడవు

వీటిలో రెండో దళంలో కు, కి, లో అనే విభక్తులతో వచ్చిన పదబంధాలు విశేషణాలకి

ముందు రావడం విశేషం. ద్విదళ వాక్యాల్లో కనిపించే విశేష్యాలు అర్థాన్ని బట్టి విశేషణాలకి ముందు రావడం విశేషం.

ద్విదళ వాక్యాల్లో కనిపించే విశేషణాలు అర్థాన్ని బట్టి విశేషణాలయినా వాక్య నిర్మాణ ప్రవర్తనను బట్టి నామాలుగానే భావించాల్సి ఉంటుంది. బహుశా పొడుగు, లోతు, వెడల్పు వంటి నామార్థక శబ్దాలను, కొత్త, పెద్ద వంటి గుణవాచకాలను కొన్నింటిని విశేషణ, విశేష్య ఉభయ పదాలుగా గ్రహించాల్సి రావచ్చు. ప్రతిపదం ఏదో ఒక భాషా భాగానికి ఎల్లప్పుడు స్థిరంగా చెంది ఉండాలి అనే నియమం తెలుగు భాషకి వర్తించదు.

తెలుగులో చుట్టరికం సంబంధాలను తెలిపే వాక్యాల్లో కూడా క్రియలేకపోవడం కనిపిస్తుంది.

5. అతను నాకు తమ్ముడు

ఆమె నాకు మేనత్త

ఆమె నాకు వదిన

వంటి వాక్యాలు అట్లాంటివి. అయితే ఈ రకపు వాక్యాల్లో కొన్నింటి అర్థ భేదంలో అవుతాడు అనే క్రియ విశేష సంబంధ సూచకంగా వాడతారు. 'ఆమె నాకు వదిన' అన్న దానికి 'ఆమె నాకు వదిన అవుతుంది' అన్నదానికి అర్థ భేదం ఉంది. మొదటిది సన్నిహిత కుటుంబ సంబంధాన్ని, రెండవది అంతకంటే విస్తృత సంబంధాన్ని సూచిస్తుంది. మరోరకంగా చెప్పాలంటే మొదటిది దగ్గరి చుట్టరికాన్ని తెలియజేస్తుంది.

ఈ ద్విదళ వాక్యాలను ఇంగ్లీషులో 'bipartite clauses' అంటారు. రెండు దళాలు ఏక వస్తు సూచకం కావడం వల్ల equative clauses అంటారు. ఈ రకపు వాక్యాల్లో క్రియ కనిపించకపోయినా వీటిని మరో వాక్యంతో అనుసంధించినపుడు అగుధాతు నిష్పన్నమయిన అయినా, అయితే వంటి రూపాలు ఈ వాక్యాలకి అనుప్రయుక్తమవుతాయి. ఉదాహరణకి కింది వాక్యాలు చూడండి.

6. ఆయన ధనవంతుడయినా గుణవంతుడు

ఆయన ముఖ్యమంత్రి అయితే ఎవరికి మేలు ?

ధనవంతుడయినా రాముడు గుణవంతుడు కూడా

అంతే కాకుండా క్రియలేని వాక్యాలకు వ్యతిరేకార్థం చెప్పాలన్నా కాదు అనే వ్యతిరేక క్రియను వాడాల్సి ఉంటుంది. తెలుగులో కొన్ని వాక్యాల్లో క్రియ కనిపించదు. అవే

వాక్యాలను వ్యతిరేకార్థంలో చెప్పినప్పుడు ఇతర వాక్యాల్లో అనుసంధించినపుడు అగు ధాతు సంబంధక్రియా రూపాలు అనుప్రయుక్తమవుతున్నాయి. అంటే క్రియలేని వాక్యాలు కొన్ని చోట్ల మాత్రమే క్రియలేని వాక్యాలుగా కనిపిస్తున్నాయి. ఈ రెండు రకాల వాక్యాల మధ్య సంబంధాలను ఎట్లా ప్రదర్శించాలి అనేది వ్యాకరణ సమస్య. మరీ ముఖ్యంగా వాక్య నిర్మాణప్రధానమయిన వ్యాకరణానికి ఇది సమస్య.

వాక్యాలకు గుప్త, వ్యక్త నిర్మాణాలు వేరుగా ఉంటాయని ఈ రెండు నిర్మాణాల సంబంధాలని వ్యాకరణ సూత్రాల ద్వారా (వీటినే పరివర్తన సూత్రాలు అంటారు) నిరూపించాలని, పరివర్తన వ్యాకరణం ప్రతిపాదించింది. ఇప్పుడు తెలుగుతో వ్యక్తంగా కనిపిస్తున్న క్రియలేని వాక్యాలను ఇతర వాక్యాలతో అనుబంధించినపుడు క్రియ కనిపిస్తున్న వాక్యాలను కలిపి చూడాలంటే పై సిద్ధాంతపరిధిలో రెండు మార్గాలున్నాయి. గుప్త నిర్మాణంలో అగు వంటి క్రియను ప్రతిపాదించి అనుబంధ రూపాలుగా కనిపించే క్రియలను పరివర్తన సూత్రాల ద్వారా సాధించి కనిపించని చోట్ల లోపాన్ని విధించడం ఒక పద్ధతి. గుప్త నిర్మాణంలో క్రియను ప్రతిపాదించకుండా క్రియ కనిపించే చోట్ల మాత్రమే పరివర్తన సూత్రాల ద్వారా క్రియను విధించడం రెండో పద్ధతి. ఈ రెండు పద్ధతుల లాభ నష్టాలను పరిశీలించడం ఈ వ్యాస ప్రధాన ప్రయోజనం.

ఈ సందర్భంలో పరివర్తన సిద్ధాంత పరిధిలో పని చేసే ఒకనాటి పరిశోధకుల్లో కొన్ని రకాల ఫ్యాషన్లు అమలులో ఉండేవి. గుప్త వ్యక్త నిర్మాణాల్లో గుప్త నిర్మాణానికి ఎందువలననో అధిక ప్రాధాన్యాన్నిచ్చే వాళ్లు. వ్యక్త నిర్మాణం కంటికి కనిపించేది. మనస్సుకు వెంటనే గోచరించేది. గుప్త నిర్మాణం కంటికి కనిపించదు. మనసుకు వెంటనే గోచరించదు. కొంత శ్రమపడి ఆలోచించి దాన్ని భావించాలి. అంటే గుప్త నిర్మాణంలో కొంత మిస్టరీ ఉంది. బహుశా ఈ మిస్టరీపై ఉన్న ఆసక్తి వల్ల ఆ కాలంలో, అంటే గుప్త వ్యక్త నిర్మాణాల ప్రతిపాదన జరిగిన తొలిరోజుల్లో భాషాశాస్త్ర పరిశోధకులకు గుప్త నిర్మాణంపై ఒకలాంటి మోజుండేది. అవసరం ఉన్నా లేకపోయినా ప్రతి అంశాన్ని గుప్త నిర్మాణంలో ప్రతిపాదించడం ఒక గొప్పగా భావించేవారు. ఈ ప్రస్తుత వ్యాసకర్త కూడా మరీ తొలి రోజుల్లో గుప్త నిర్మాణంతో కొన్నాళ్లు వివిధ ప్రతిపాదనలతో ఆడుకున్నాడు. అయితే గుప్త వ్యక్త నిర్మాణాల్లో ఏ ఒక్కదానికి నిష్కారణంగా ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడం అశాస్త్రీయం. ఏ ప్రతిపాదన వల్ల వ్యాకరణ నిరూపణ స్పష్టంగా జరుగుతుందో అదే వరణీయం. అయితే ఒక కాలపు వ్యాకర్తలు ఈ రకమయిన ప్రతిపాదనలు చేశారు గనుక ఆ రకపు

ప్రతిపాదనల స్వరూపాన్నీ, ఆ వాదనల పద్ధతిని పరిశీలించడం చరిత్ర కోసమైనా అవసరం. అంతేకాక వ్యాకరణంలో పద్ధతులు తెలుసుకోడం కూడా శాస్త్రాభివృద్ధికి అవసరం. గుప్త నిర్మాణంలో క్రియను ప్రతిపాదించిన వారు కొన్ని వాదాలు చేసేవారు. ఆ వాదాలను క్రమంగా పరిశీలిద్దాం.

వాదాలను ప్రతిపాదించిన వారిలో ఆంధ్ర, ఆంధ్రేతరులు కూడా ఉన్నారు. నిజానికి ఈ సమస్య తెలుగుది మాత్రమే కాదు. మన పొరుగు భాష అయిన తమిళానికి ఈ సమస్య ఉంది. నిజానికి ఇది భారత భాషల సమస్య మాత్రమే కాదు. ఇతర ప్రపంచ భాషల్లో కూడా ఇది సమస్యే. ఈ భారత భాషలను దృష్టిలో ఉంచుకొని చేసిన ప్రతిపాదనలను అందులోను మరీ ముఖ్యంగా తెలుగు భాషను ఉదహరించి చేసిన ప్రతిపాదలను మాత్రమే ఈ వ్యాసంలో ప్రముఖంగా ప్రస్తావిస్తాం. అయితే ఈ వాదనలు చాలా భాషల నిర్మాణాన్ని గురించి చేసే చర్చలకు పనికొస్తాయి. అంటే ఈ చర్చ తెలుగు గురించే చేసినదయినా దీనికి భాషా తత్వ నిరూపణలో ప్రాధాన్యం ఉంది.

ఇప్పుడు గుప్త నిర్మాణంలో క్రియలను ప్రతిపాదించే అవసరాల్ని గురించి చేసిన వాదాల్ని పరిశీలిద్దాం

### 1. క్రియా కాల బోధవాదం (tense argument)

శ్రీమతి యమునా కచ్రూ గారు హిందీలో ద్విదళ వాక్యాల్ని పరిశీలిస్తూ తెలుగు బెంగాలీ భాషల గురించి కూడా ప్రస్తావించారు. తన ప్రస్తావనలో "even in these languages (Bengali & Telugu) the equational sentences will have to be derived from copula sentences by deletion in the present tense". అన్నారు. భావం : ద్విదళ వాక్యాల్లో క్రియలేదని చెప్పబడుతున్న బెంగాలీ, తెలుగుభాషల్లో కూడా ఈ వాక్యాలను క్రియాలోప సూత్రం ద్వారా వర్తమానార్థంలో నిష్పన్నం చేయాల్సి ఉంటుంది.

ఆ ఉద్దేశాన్ని ఈ విధంగా వ్యాఖ్యానించవచ్చు. తెలుగులో భూత భవిష్యత్తులలో ఈ రకపు వాక్యాలలో క్రియ కనిపిస్తుందని వర్తమానంలో ఇది లోపిస్తుందని అందువల్ల గుప్త నిర్మాణంలో అగు వంటి క్రియను ప్రతిపాదించి వర్తమానంలో లోపింపచేయవచ్చు అని యమునా కచ్రూ గారి ఉద్దేశం.

ఆమె *'నా అన్నగారు డాక్టరు అవుతారు '* అనే వాక్యాన్ని తెలుగులో ఉదహరించారు. దీన్ని సమంగా *'నా అన్నగారు డాక్టరు అయ్యారు '* అని భూతకాలంలో 'కూడా'

ఉదహరించవచ్చు. దీనికి వర్తమానంలో *'నా అన్నగారు డ్యాక్టరు'* అని ఉంటుంది. వర్తమానేతర కాలాల్లో కనిపించే *అవుతారు, అయ్యారు* అనే క్రియలకు సమాంతరంగా వర్తమానంలో క్రియ కనిపించదు. కాబట్టి వర్తమానంలో వాక్యాన్ని క్రియాలోప సూత్రం ద్వారా సాధించాలని యమునా కచ్రూ గారి వాదం. అయితే యమునా కచ్రూ గారు కొన్ని తెలుగు భాషాంశాలను పరిగణనలోకి తీసుకోలేదు. తెలుగులో పరిణామార్థంలో అగు ధాతువుంది. *అయ్యారు, అవుతారు* అనేవి ఆ అర్థంలో ఆ ధాతు రూపాలు. ఈ క్రియా రహిత వాక్యాలకు భూత, వర్తమానాలు లేవు. ఈ వాక్యాల పద్ధతి స్థితి బోధకత మాత్రమే. కాల బోధను గురించి ఏ సూచనా లేనప్పుడు ఈ వాక్యాలు వక్త మాట్లాడిన కాలాన్ని మాత్రమే సూచిస్తుంది. అంటే అది వక్త ప్రయోగించిన వర్తమాన కాలం మాత్రమే. ఈ వాక్యాలకు భూతకాలాన్ని వ్యక్తం చేయాలంటే భూతార్థ బోధకమయిన కాల వాచి శబ్దాలను వాడటం తప్ప మరో మార్గం లేదు. ఉదాహరణకు *'మూడేళ్ల కిందట మా అన్నయ్య డ్యాక్టరు'* అనే వాక్యం భూతార్థ బోధకం. *మూడేళ్ల కిందట మా అన్నయ్య డ్యాక్టరు అయ్యాడు'* అనే వాక్యం భూతార్థ బోధకమయినా అందులో పరిణామార్థకం ఉంది. అంటే పై రెండు వాక్యాలు భూతార్థ బోధకమయినా వాటి అర్థాలు వేరు. క్రియలేని వాక్యం స్థితి బోధకం. *అయ్యాడు* అనే క్రియ ఉన్న వాక్యం పరిమాణార్థకం. అయితే భవిష్యదర్థంలో ఈ రకమయిన భేదకతను చూపించలేం. *మూడేళ్ల తర్వాత మా అన్నయ్య డ్యాక్టరు* అనే వాక్యానికీ *మూడేళ్ల తరువాత మా అన్నయ్య డ్యాక్టరు అవుతాడు* అనే వాక్యానికీ మధ్య నా మట్టుకు నాకు అర్థ భేదం కనిపించటం లేదు. కాని ఇంగ్లీషులో my brother will be a doctor after three years అనే వాక్యానికి my brother will become a doctor after three years అనే వాక్యానికీ ఎంత భేదం ఉందో, అసలు భేదం ఉందో లేదో నాకు తెలియదు. ఈ భేదం ఇంగ్లీషులో ఉండి తెలుగులో లేకపోతే తెలుగులో ఇది ఒక నిర్మాణ సంబంధమైన ఖాళీ జాగా (Syntactic gap) అన్నమాట.

ఇంతకీ ఇక్కడ యమునా కచ్రూ గారు విస్మరించిందేమిటంటే తెలుగులో ద్విదళ వాక్యాల్లో క్రియలేని వాక్యాలు వర్తమానార్థబోధకాలే అని, భూతార్థ బోధలో క్రియ లేకుండా కాలవాచకశబ్దాలను వాడుతారనీ, క్రియ వాడిన చోట అది పరిణామార్థకం మాత్రమే అని, దీన్ని బట్టి ద్విదళ వాక్యాల్లో వర్తమానంలో లేని క్రియకు, భూత భవిష్యత్తులలో కనిపించే క్రియకూ ఏమీ సంబంధం లేదని, వర్తమానార్థ వాక్యాలు గుప్త నిర్మాణంలో క్రియను ప్రతిపాదించడానికి భూత భవిష్యత్తుల్లో కనిపించే క్రియ సహాయపడదనీ తెలుతుంది.

**2. సోదర భాషా సాక్ష్యాధార వాదం :** (Cognate language argument)

తమిళంలో విశేషణ వాక్యాల గురించి రాస్తూ ఇ. అన్నామలై గారు మళయాళంలో ఇట్లాంటి వాక్యాల్లో ' ఉండు' అనే క్రియ కనిపిస్తుంది కాబట్టి ఆ ఆధారాన్ని బట్టి తమిళంలో కూడా ప్రతిపాదించారు. ఒక భాషలో ఈ రకపు వాక్యాల్లో క్రియ కనిపిస్తుంది కాబట్టి మరొక భాషలో అట్లాంటి క్రియను ప్రతిపాదించాలనటం వాదానికి నిలిచేది కాదు. అన్నామలై గారి వాదాన్ని తిరగేస్తే తమిళంలో లేదు కాబట్టి మళయాళంలోనూ గుప్త నిర్మాణంలో ప్రతిపాదించక్కర్లేదని వాదించవచ్చు.

భద్రిరాజు కృష్ణమూర్తి గారు తమ కొండ భాషా వ్యాకరణంలో ఈ రకపు వాక్యాలను పరిశీలిస్తూ, వీటి గుప్త నిర్మాణంలో 'మనీ' (తెలుగులో చున్ను) అనే క్రియను ప్రతిపాదించాలన్నారు. అంతకు మించిన చర్చ ఆయనేమీ చేయలేదు. సమకాలిక భాషా శాస్త్ర పరిశోధకులలో ఉన్న అలవాటును అంతర్గతంగా ఆయన అంగీకరించారు. ఈ పద్ధతిలోనే పి. కోదండరామన్ అనే పరిశోధకుడు కూడా తమిళ భాషకు ఇట్లాంటి ప్రతిపాదనే చేశారు. ఇట్లాంటి ప్రతిపాదనలు చేసినవారు అనేకులు ఉన్నారు. వీరిలో పేరి భాస్కరరావు గారు తెలుగు భాషలోని అగు, ఉండు క్రియల తత్త్వాన్ని నిశితంగా పరిశీలిస్తూ రాసిన విపుల వ్యాసంలో ఇట్లాంటి ప్రతిపాదన చేస్తూ విశేషమైన చర్చ చేశారు. ఆయన వాదాల్ని ఒక్కొక్కటే ప్రత్యేకంగా పరిశీలించాల్సిన అవసరం ఉంది.

**3. వికల్ప ప్రయోగ వాదం:** (Optional Occurrence Agreement)

భాస్కరరావు తన వ్యాసంలో ఈ కింది వాక్యాలు సమానార్థకాలుగా భావించారు.

ఎ. రామారావు పొడుగు వాడు

బి. రామారావు పొడుగువాడు అవును

ఈ పై వాక్యాల్ని ఆయన సంపూర్ణ సమానార్థకాలు (completely similar in meaning) అని అన్నారు. అంటే ఇక్కడ *అవును* అనే క్రియా పదం వికల్పంగా ప్రయుక్తమయింది కాబట్టి. ఈ ప్రయోగానికి గతి కల్పించాలంటే గుప్త నిర్మాణంలో *అగు* అనే క్రియను ప్రతిపాదించి, లేని చోట లోపింపచేయాలని ఆయన ఉద్దేశం. అర్థభేదం కలిగించలేని భాషా రూపం గుప్త నిర్మాణంలో ప్రతిపాదించాల్సిన అవసరం సిద్ధాంత రీత్యా లేదు. పైగా భాస్కరరావు భావించినట్లు పై రెండు వాక్యాలు సంపూర్ణ సమానార్థకాలు కావు. ప్రయోగ భేదం కూడా అర్థ భేదంలో భాగం అయితే ఈ రెంటి మధ్యన అట్లాంటి భేదం ఉంది. పై వాక్యాల్లో క్రియలేని మొదటి వాక్యంతో సంభాషణ ప్రారంభించవచ్చు. ఈ వాక్యం శ్రోతకు తెలియని సమాచారంగా వక్త ఉద్దేశిస్తాడు. '*అవును*' అనే క్రియ

చేర్చిన రెండో వాక్యం శ్రోతకు తెలిసిన సమాచారం అయినా అది శ్రోత ఒప్పుకోని సమాచారం. అంటే అంతకుముందు ఆ శ్రోత రామారావు పొడుగు వాడు కాదు' అంటే ఈ వక్త 'పొడుగు వాడు అవును' అని నిర్ధారిస్తున్నాడు అన్నమాట. ఆ సందర్భాన్ని కింది విధంగా సూచించవచ్చు.

9. ఎ. రామారావు పొడుగువాడు

బి. రామారావు పొడుగు వాడు కాదు

ఎ. రామారావు పొడుగువాడు అవును

ఈ రకమైన సందర్భ భేదం ఈ రెండు వాక్యాల మధ్య ఉంది. అంటే క్రియ లేని వాక్యం తొలిసారి సమాచారాన్ని అందించేది. అవును అనే క్రియ ఉన్న వాక్యం అవతలి వాళ్లు ఆ సమాచారాన్ని అంగీకరించనపుడు పునరుద్ఘాటించేది. నిజానికి ఈ అవును, కాదు అనేవి క్రియా రూపాల్లా కాక నిర్ధారణ, వ్యతిరేక అర్థాలను సూచించే అవ్యయాలుగా పరిగణించాలి. ఈ విషయాన్ని ఇంకొంచెం వివరంగా తరువాత అంశంలో ప్రస్తావిస్తాను.

4. వ్యతిరేక క్రియావాదం (negative verb argument)

పై వాదంలో ఉదాహరించిన వాక్యాల్లో కాదు అనే వ్యతిరేక క్రియ ఉంది. ఇది *'అగు'* ధాతువు నుంచి నిష్పన్నమయింది. ఈ వ్యతిరేక క్రియ గుప్త నిర్మాణంలో నిశ్చయార్థక క్రియ లేంది వ్యతిరేకంలో ఎట్లా తీసుకొస్తాం అనేది ఆ వాద సారాంశం. ఈ రకం వాదం చాలా తరచుగా వినబడుతుంది. అయితే పై వాదంలో సూచించినట్టుగా అవును, కాదు అనేవి నిజానికి క్రియలు కావు. అవ్యయాలు. వీటికి లింగ వచన బోధ లేదు. ఇవి వాక్యాంతంలోనే కాదు. వాక్యాదిన కూడా రావచ్చు. సంభాషణ ప్రారంభకాలు (discourse initiaters) గా కూడా రావచ్చు. ఈ ఉదాహరణను గమనించండి.

9. ఎ. అవునూ, ఈ మధ్యన నీ రచనలు ఎక్కడా కనిపించటం లేదే ?

బి. కాదు, నేను ఫ్రెంచి డిప్లొమా చేస్తే ఎట్లా ఉంటుంది ?

*అవును, కాదు,* అనే అవ్యయాలను ఆద్యంత వాక్యాల సహాయం లేకుండా కూడా ప్రయోగించవచ్చు. వీటి ప్రయోగ సమగ్ర పరిశీలన విషయాంతరం. అయితే ఈ రెండూ వీటిని వాక్య నిర్మాణంలో క్రియలుగా గుర్తించక్కర్లేదు అని పై ప్రయోగాలు నిరూపిస్తున్నాయి. ఈ విషయంలో తెలుగు భాషకి సంబంధించిన ఒక విశేషం చెప్పుకోవాలి. తెలుగులో క్రియా విభాగం ఒక నిధిలాంటిది. వాక్య నిర్మాణంలో గాని భాషా వ్యవహారంలో గాని అవసరమైన ఎన్నో అవ్యయాలను నిర్మించుకోడానికి ఈ నిధి ఉపయోగించింది. ఈ

అవ్యయాలను క్రియల నుండి అంటే ధాతువుల నుంచి పద నిర్మాణం ద్వారా సాధించాలి కాని వాక్య నిర్మాణం నుంచి కాదు. తెలుగులో *'కాదు'* కు సమాంతరంగా వాడే *'లేదు'* అనే రూపం కాని అనుకరణలో వాడే అని రూపం కాని పూర్వోక్త భావ భిన్నతను సూచించే *'కాని'* అనే రూపం కాని పూర్వోక్త, భావ సత్య నిరూపణకు వాడే కదా, కదూ, అనే రూపాలు గాని ఆయా ధాతువుల నుంచి అంటే *ఉండు, అగు,* అను ధాతువుల నుంచి నిష్పన్నమయ్యాయి. ఇవి పద నిర్మాణ ప్రక్రియలో భాగం. గుప్త నిర్మాణ క్రియా ప్రతిపాదనకు అక్కరకు వచ్చేవి కావు.

అయితే ఇక్కడ ఇంకో విషయాన్ని పరిశీలించాల్సి ఉంది. *'కాదు'* అనేది అవ్యయమయినా *కాను, కాము, కావు, కాదు, కారు, కాడు* అనే విధంగా లింగ వచనాన్ని సూచించే క్రియా రూపాలు కూడా ఈ రకపు వాక్యాల్లో వాడవచ్చు.

10. ఎ. నేను విద్యార్థిని కాను.

బి. మేము తమిళులం కాము.

సి. అతను అరవవాడు కాడు.

ఈ పై వాక్యాల్లో కనిపించే *కాను, కాము* వంటి క్రియా రూపాలు లింగ వచన బోధక ప్రత్యయాలతో కనిపిస్తున్నాయి. గుప్త నిర్మాణ క్రియ ప్రతిపాదించకపోతే వీటిని సాధించటం ఎట్లా ? అని గు.ని. క్రి.ప్ర వాదులు వాదించవచ్చు.

పై వాక్యాల్లో లింగ వచనాలతో ఉన్న సంపూర్ణ క్రియలు ఉండటం నిజమే కాని అవి నిజంగా వాటి పని నిర్వహిస్తున్నాయా ? వాటన్నిటికి బదులుగా కాదు అనే అవ్యయాన్ని ఉపయోగించవచ్చు. అప్పుడు లింగవచన బోధ రెండో దళానికి తగిలించిన ప్రత్యయాల ద్వారా వ్యక్తమవుతుంది. ఈ రకంగా లింగ వచన ప్రత్యయాలు ఈ రకపు వాక్యాల్లోనే నామాలకు చేరతాయి. అవి నిత్యంగా చేరతాయి. ఈ నిత్యంగా చేరిన ప్రత్యయాలను గుప్త నిర్మాణ క్రియతో సంబంధం లేకుండానే నామానికి విధించాలి. బింబ లేఖన సూత్రం (Copying rule) ద్వారా నామం నుంచి లింగ వచన ప్రత్యయాలను గ్రహించి కాదు అవ్యయానికి పునర్ లిఖించాలి. ఈ ప్రక్రియ అంతా గుప్త నిర్మాణ క్రియతో సంబంధం లేకుండానే జరుగుతుంది. గుప్త నిర్మాణంలో క్రియను ప్రతిపాదిస్తే నామానికి నిత్యంగా చేరే లింగ వచన ప్రత్యయాలను సమర్థించడం కష్టం.

అయితే ఇక్కడో చిక్కుంది. ఈ కింది వాక్యాలను గమనించండి.

11. ఎ. మేము పండితులం అవుతాము.

బి. మేము పండితులం అయ్యాము.

ఈ రెండు వాక్యాల్లో కూడా పండితులు అనే నామానికి 'ము' అనే ఉత్తమ పురుష బహువచన ప్రత్యయం చేరింది. స్థూల దృష్టికి పై వ్యతిరేక వాక్యాలూ ఇవీ ఒకటిగా కనిపించవచ్చు. కాని ఈ వాక్యాల్లో *మేము పండితులు అవుతాం, మేము పండితులు* అయ్యాము అని కూడా ఈ లింగ వచన ప్రత్యయం లేకుండా ఉండవచ్చు. క్రియలో ఈ ప్రత్యయాలు తప్పనిసరి. పైన చెప్పిన ప్రతి లేఖన సూత్రాన్ని ఇక్కడా వర్తించుకోవచ్చు. అయితే పై వ్యతిరేక వాక్యాల్లో ఈ సూత్రం వెనక నుంచి ముందుకి జరుగుతుంది. ఈ పరిణామ వాక్యాల్లో ముందు నుంచి వెనక్కి జరుగుతుంది. ఈ రెండిట్లోనూ సమానధర్మం నిత్య ప్రయోగాన్నుంచి వికల్ప ప్రయోగానికి జరుగుతుంది. ఈ గుప్త నిర్మాణ క్రియా ప్రతిపాదనతో సంబంధం లేకుండా ఈ ప్రతిలేఖన సూత్రం ఈ రెండు రకాల వాక్యాల భేద సామ్యాలను తగినట్టు వ్యక్తం చేయగలుగుతుంది.

### 4. అనుసంధాన క్రియా ప్రయోగవాదం (Verb linking agreement)

నిజానికి ఈ వాదాలన్నిటిలోనూ ఇదొక్కటే కాస్తో, కూస్తో సహేతుకంగా కనిపిస్తుంది. పూర్వమే ప్రస్తావించినట్లు ద్విదళ వాక్యాలు ఇతర వాక్యాలతో అనుసంధించినపుడు *అయినా, అయితే* వంటి రూపాలు అనుసంధాన క్రియలుగా వస్తాయి. ఇట్లాంటి వాక్యాలన్నీ ద్వ్యర్థి వాక్యాలు (ambiguous) కావడం విశేషం. ఉదాహరణకి ఈ వాక్యాలు గమనించండి.

12. ఎ. ఆయన మంత్రి అయితే నాకేం

బి. ఆయన మంత్రి అయినా ఎవరికి లాభం

సి. మంత్రి అయిన శాసనసభ్యుడు

ఈ వాక్యాలన్నిటిలోనూ అనుసంధాన క్రియకు రెండర్థాలున్నాయి. ఒకటి వర్తమానార్థం. ఇంకొకటి, భవిష్యదర్థం. ఈ రెండింటిని సాధించాలంటే ఒక రూపాన్ని క్రియలేని వాక్యాల నుంచి నిష్పన్నం చేసి, ఉన్నచోట, సూత్రం ద్వారా అనుసంధించాలి. పరిణామార్థంలో క్రియ ఉన్న వాక్యాల నుంచి ఈ అనుబంధ రూపాలని నిష్పన్నం చేయాలి. క్రియలేని వాక్యాలకి కూడా గుప్త నిర్మాణంలో క్రియను కల్పిస్తే ఈ వాక్యాల మధ్య భిన్నార్థ బోధను వివరించలేం.

భాస్కరరావు తన వ్యాసంలో రామారావు మంచి వాడు అవునా (కాదా) అన్నది నా ప్రశ్న! అన్న వాక్యాన్ని ఒకటి ఉదాహరించారు. ఇక్కడ కూడా ఈ ప్రశ్నార్థకం నామబంధానికే చేర్చవచ్చు. అప్పుడు రామారావు మంచివాడా (కాదా) అని కూడా ఉండవచ్చు. ఈ

ఉదాహరణ కూడా గుప్త నిర్మాణ క్రియా ప్రతిపాదనను సమర్థించదు. ఇంతవరకూ జరిగిన చర్చను బట్టి ఈ పై వాదాలేవీ క్రియలేని వాక్యాల గుప్త నిర్మాణంలో క్రియా ప్రతిపాదనని సమర్థించవు. ఇది కాక ఇంకొక అప్రశస్త వాదం ఒకటి బలహీనంగా వినిపిస్తుంది. నిజానికి దీన్ని గురించి చర్చించాల్సిన అవసరం లేదు గాని చరిత్ర కోసం మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తాను.

**5. పదక్రమ వాదం: (Word Order argument)**

వాక్య నిర్మాణంలో క్రియాపదం వచ్చే స్థానాన్ని బట్టి క్రియాది, క్రియా మధ్య, క్రియాంత భాషలుగా ప్రపంచ భాషలను విభజిస్తారు. ఈ విభజనను బట్టి భాషా నిర్మాణంలో కొన్ని అంశాలను ఊహించవచ్చు. (predict చేయవచ్చు) ఉదాహరణకు క్రియాది భాషల్లో ప్రత్యయాలు ధాతువుకి గాని ప్రాతిపదికకు గాని ముందొస్తాయి. క్రియాంత భాషల్లో తర్వాత వస్తాయి. క్రియా మధ్య భాషల్లో రెండు రకాలు కనిపిస్తాయి. పదక్రమాన్ని బట్టి దాని మీద ఆధారపడ్డ అనేకానేక అంశాలను కనుక్కోవటమే ఈ రకపు విభజనకు ప్రయోజనం. ద్రావిడ భాషలు క్రియాంత భాషలు. గుప్త నిర్మాణ క్రియా ప్రతిపాదకులు వాదించేదేమిటంటే తెలుగు క్రియాంత భాష కదా ! క్రియలేకపోతే క్రియాంత భాష అనటం ఎట్లా ? ఈ వాదం అహేతుకతను గురించి విస్తరించడం అనవసరం. క్రియాంత భాష అని పిలవాలి కాబట్టి దాని గుప్త నిర్మాణంలో బలవంతంగా క్రియను చొప్పించడం ఏ ప్రమాణాలకూ లొంగని వాదం. జోసఫ గ్రీన్ బర్గ్ లాంటి వాళ్లు ఈ భాషా విభజన పద్ధతి ప్రతిపాదించినపుడు సాధారణ సకర్మక వాక్యాల్లో కర్త, కర్మ, క్రియా పదాల్లో క్రమాన్ని మాత్రమే దృష్టిలోకి తీసుకొని పరిశీలించారు. అందుకే దీన్ని మౌలిక పదక్రమం (basic word order) అని వ్యవహరించారు. దీని అర్థం ప్రతి వాక్యంలోనూ క్రియ ఉండాలని కానీ ఆ క్రియ ఆ భాషలో ప్రతి వాక్యంలోనూ ఒకే స్థానంలో ఉండాలని కానీ, అర్థం కాదు. అంతేకాక పదక్రమాన్ని బట్టి చేసే భాషా విభజన గుప్త నిర్మాణాన్ని బట్టి కాక వ్యక్త నిర్మాణాన్ని బట్టే చేయాలని చాలామంది భాషా శాస్త్రవేత్తలు బలంగా వాదించారు. భాషా లక్షణాన్ని ఉన్నది ఉన్నట్లే చెప్పాలి కాని మనకి కావలసినట్టుగా లక్షణ నిర్మాణాన్ని చేయటం అశాస్త్రీయమూ, అవాస్తవికమూ. ఇంత వరకూ గుప్త నిర్మాణ క్రియా ప్రతి పాదకుల వాదాలను విపులంగా పరిశీలించాం. ఇక్కడ ఇంకో విషయం గమనించాలి. వ్యక్త నిర్మాణంలో సర్వత్రా క్రియలు కనిపించే కొన్ని భాషల్లో కూడా ఈ రకపు క్రియలను గుప్త నిర్మాణంలో ప్రతిపాదించక్కర్లేదని వాదించిన పరిశోధకులున్నారు. Emmon Bach అనే ప్రసిద్ధ శాస్త్ర పరిశోధకుడు ప్రతిపాదకులందరి కంటే ముందే ఇంగ్లీషు వాక్యాల్లో కనిపించే 'have' and 'be' అనే క్రియలను గుప్త నిర్మాణంలో గుర్తించక్కర్లేదని, అట్లా

గుర్తించకపోవటంలో ప్రక్రియా సౌలభ్యం ఉందని వాదించాడు. భారత భాషలలో క్రియలేని వాక్యాల గుప్త నిర్మాణంలో క్రియను ప్రతిపాదించాలనే పరిశోధకులందరూ ఈ ప్రసిద్ధ వ్యాసాన్ని విస్మరించడం శోచనీయం.

క్రియాపదం ఎక్కడుంటే ఏమిలే ! గుప్త నిర్మాణంలోనే ఉంచి వ్యక్త నిర్మాణంలో ఈ కనిపించని చోట్ల లోపం చెప్పుకోవచ్చులే అని అనుకోటానికి కూడా వీల్లేని పరిస్థితి ఒకటి ఉంది. అదేమిటంలే తెలుగులో స్వతహాగా క్రియలేని వాక్యాలేకాక ప్రయోగంలో క్రియాత్వం కోల్పోయిన వాక్యాలు కూడా మౌలిక క్రియారహిత వాక్యాల్లాగే ప్రవర్తిస్తాయి. ఉదాహరణకు-

13. ఎ. సుబ్బారావు గారు నిన్న ఢిల్లీ నుంచి వచ్చారు.

బి. సుబ్బారావు గారు నిన్న వచ్చింది ఢిల్లీ నుంచి.

సి. సుబ్బారావు గారు ఢిల్లీ నుంచి వచ్చింది నిన్న.

డి. నిన్న ఢిల్లీ నుంచి వచ్చింది సుబ్బారావు గారు.

ఈ పై వాక్య సమూహంలో మొదటిది సాధారణ క్రియా వాక్యం. ఆ క్రియా వాక్యం నుంచి క్రియాత్వం కోల్పోయిన వాక్యాలు ప్రాధాన్య వివక్ష కోసం నిష్పన్న మయినాయి. ఈ నిష్పన్న ద్విదళ వాక్యాలు మౌలిక క్రియా రహిత వాక్యాల్లాగే అన్ని విధాలా ప్రవర్తిస్తాయి. వీటిని ఇతర వాక్యాలతో అనుసంధించినప్పుడు గాని, వ్యతిరేక వాక్యాల్లో కాని *అగు* కు నిష్పన్న క్రియా రూపాలను అనుసంధించుకోవాలి. ఇంతకు పూర్వపు వాద పద్ధతిలో ఆలోచిస్తే ఈ వాక్యాలు గుప్త నిర్మాణంలో కూడా ఆ పాటికే ఉన్న క్రియకు తోడుగా అగు ధాతువును ప్రతిపాదించాల్సి ఉంటుంది. అంటే క్రియలేని వాక్యాలకు లాగే క్రియ ఉన్న వాక్యాలకి కూడా గుప్త నిర్మాణంలో అగు వంటి క్రియను ప్రతిపాదించాల్సి ఉంటుంది. క్రియలేని వాక్యాల కోసం తెచ్చుకున్న గుప్త నిర్మాణ క్రియా ప్రతిపాదన ఆ వాక్యాలకే పరిమితం కాక భాషా సర్వస్వానికి పరివ్యాప్తమై పరిశోధకులను భయపెట్టే బ్రహ్మ రాక్షసయి కూర్చుంటుంది.

ఏతా వాతా తేలిందేమిటంటే గుప్త నిర్మాణ క్రియా ప్రతిపాదనలో ఏ ఒక్కదాంట్లోనూ పస లేదనీ ఈ ప్రతిపాదనైనా ఉన్న చిక్కులను పరిష్కరించకపోగా కొత్త చిక్కులను తెచ్చి పెడుతున్నదనీ. గుప్త నిర్మాణం కామధేనువు కాదు. కల్ప తరువూ కాదు, లేనివి సృష్టించి ఇవ్వడానికి.

# ఇరవయ్యో శతాబ్దంలో తెలుగు భాషా పరిణామం

భాషను ఒక కాలపరిమితిలో భిన్న కోణాల్లో పరిశీలించవచ్చు. 1. భాషా నిర్మాణంలో జరిగే మార్పులు 2. భాషా ప్రయోగంలో జరిగే మార్పులు. ఒక శతాబ్ది కాల పరిమితిలో భాషా నిర్మాణంలో చెప్పుకోదగిన మార్పులు ఉండవు. అదీగాక అంతకు ముందున్న భాషా నిర్మాణాన్ని గురించి సమగ్రమైన వ్యాకరణమున్నప్పుడు మాత్రమే నిర్మాణంలో మార్పులను అధ్యయనం చేయడానికి వీలవుతుంది.

తెలుగు భాషా విషయానికి వస్తే - ఈ భాషకు అనేక మాండలికాలు ఉన్నాయి. ఏ మాండలికంలో, ఏ వ్యవస్థలో ఏ మార్పు జరిగిందో చెప్పడం కష్టం. ఇప్పటికీ తెలుగు మాండలికాల పరిశోధన శైశవదశలోనే ఉంది. కొన్ని పదభేదాలకు మించి మాండలిక పరిశోధన ముందుకు పోలేదు. తెలుగు అకాడమీ వారు వివిధ జిల్లాల మాండలిక భాషా పరిశీలన చేయించడానికి ప్రయత్నించారు. అదికూడా అనుకున్న ఫలితాలను సాధించలేదు. మాట్లాడే తెలుగులో వచ్చిన మార్పులను పరిశీలించడానికి అంతకు ముందు ఏమున్నదో తెలియదు. తెలుగు మాండలికాలపై పరిశోధకుల దృష్టి మళ్ళింది స్వాతంత్ర్యం తరువాతనే. అంతకు పూర్వం కొందరు కొన్ని స్వల్పమైన పరిశీలనలు మాత్రమే జరిపారు. అవి ఏరకమైన సూత్రీకరణలకు ఉపకరించవు.

నా దృష్టికి వచ్చిన కొన్ని నిర్మాణాంశాలను పరిశీలిస్తే బహుశా అవి ఈ శతాబ్దంలో వచ్చినవిగా ఊహిస్తున్నాను. నిర్ధారణగా చెప్పలేను. తెలుగువారి ఉచ్చారణలో ఉన్నత విద్యను అభ్యసించిన వాళ్ళలో కూడా మహాప్రాణ ఉచ్చారణ మాయమవుతున్నట్లు కనిపిస్తున్నది. దీనికి కొన్ని కారణాలను ఊహించవచ్చు. ఉన్నత విద్యావ్యాప్తి బాగా ఎక్కువైన ఇటీవలి కాలంలో మహాప్రాణ ఉచ్చారణ తమ భాషలో లేనివారు వీటిని వదిలేసినట్టు కనిపిస్తుంది. ఇందుకు మరోకారణం నేటి విద్యాప్రణాళికలో ఏ దశలోను తెలుగుకు ఏమంత ప్రాధాన్యం ఉండకపోవడం. నాలుగైదు దశాబ్దాల కిందటి సినిమాలను చూస్తే ఉచ్చారణలో మహాప్రాణ ధ్వనులను తేలిగ్గా గుర్తించవచ్చు. ఇటీవలి సినిమాల్లో నాయికా నాయకులు ఎవరూ మహాప్రాణాన్ని పలకడం లేదు. టెలివిజన్ ప్రసారాల్లో కార్యక్రమాలను నిర్వహించేవారు

(Anchor Persons) ఒత్తులు పలకరు. బహుశా వచ్చే శతాబ్దంలో తెలుగులో మహా ప్రాణాలను పలకటం, రాయటం రెండూ లోపించవచ్చు. సంపూర్ణ వ్యావహారిక భాషా వాదులు మహాప్రాణాలను వదిలేయమని సలహా ఇచ్చినా ఇవ్వొచ్చు.

తెలుగులో ఔపవిభక్తిక, అనౌప విభక్తిక భేదం చాలా కాలం నుంచి ఉంది. ఇ, టి, తిలు ఔపవిభక్తికాలని వ్యాకరణంలో మనం చదువుకున్నదే. ఈ భేదం ఒకప్పటి భాషలో ఉన్నట్టుగా ఇప్పటి భాషలో కనిపించదు. ఔపవిభక్తికాలు ఒకనాడు ఏం ప్రయోజనం నిర్వహించాయో నాకు సరిగ్గా తెలియదు. బహుశ ఈనాటి భాషలో వాటికి ప్రత్యేక ప్రయోజనం ఉన్నట్టు లేదు. అంత సమగ్రమైన పోలిక కాదుగాని ఇండో యూరిపియన్ భాషల్లో లింగ వివక్షలాంటిదే ఇది. *రోకలిపాట - రోకటి పాట; పగలువేళ - పగటివేళ; నేయి మిఠాయి - నేతి మిఠాయి* వీటి మధ్యన భేదం పాటించాల్సిన అవసరం భాషా విషయకంగా కనిపించడం లేదు. సులభీకరణం (Simplification) చారిత్రక ప్రయాణపు దిశ అయినట్లయితే తెలుగులో ఔపవిభక్తికాల విషయంలో ఇట్లాంటిది జరుగుతున్నట్లు గమనించగలం.

ప్రతి భాషలోను కొన్ని అక్రమ క్రియలు (irregular verbs) ఉంటాయి. ఈ క్రియలు ఏర్పడటానికి అనేక కారణాలు ఉన్నాయి. ఒక్కోసారి ఈ కారణాలు మనకు దొరకవు కూడా. ఈ రకమైన క్రియలకు రూపభేదాలు ఎక్కువ ఉంటాయి. కాలక్రమంలో ఈ రూపభేదాలు తగ్గిపోవచ్చు. ఈ రూపభేదాల తగ్గింపు (reduction of allomorphy) సులభీకరణంలో ఓ పద్ధతి. ఔపవిభక్తిక నామాలు అనౌప విభక్తికాలుగా మారినట్లుగానే క్రియలలో ముత్తుపరమైనపుడు కలిగే రూపభేదాలు తగ్గిపోయే అవకాశం ఉంది. తెలంగాణా భాషలో 'రావటం లేదు' అనటానికి 'వస్తలేడు' అనే ప్రయోగం ఉంది. ఇది రూపభేదం లేదా దాని ప్రయోగం తగ్గే క్రమంలో ఒక భాగం. అయితే ఈ మార్పు ఇతర మండలాలకు వ్యాపిస్తున్నదో లేదో చెప్పలేం. పదరూప విచారణ చేస్తే ఇట్లాంటివి బహువచన నిర్మాణంలోను స్వర సమీకరణ విధానంలోను మరికొన్ని ఉదాహరణలు దొరికే అవకాశం ఉంది.

భాషలో మార్పులు ధ్వనుల్లో త్వరగా కనిపిస్తాయి. పదరూపాల్లో కూడా ఈ మార్పుల్ని కొంచెం స్పష్టంగా గుర్తించవచ్చు. వాక్య నిర్మాణంలో జరిగే మార్పులనే గుర్తించడం కష్టం. ప్రపంచ భాషలను పరిశీలిస్తే భాషల మధ్యన వాక్యనిర్మాణ రీతుల్లో సామ్యం అధికంగా కనిపిస్తుంది. వీటిని భాషా సామాన్యాలు (Universals) అంటారు. ఇవి కాక సోదర భాషల మధ్యన నిర్మాణ సామ్యాలుంటాయి. తెలుగు, కన్నడ, తమిళ,

మళయాళాది భాషల్లో కనిపించే సామ్యాలు వాటికి చారిత్రకంగా దత్తమైనవి. ప్రాచీనాంధ్రాన్ని, ఆధునికాంధ్రాన్ని పరిశీలిస్తే ఈ భేదాలు ఇంకా స్వల్పం. భాషలో కనిపిస్తున్న ఒకటి రెండు మార్పుల్ని చూస్తే అవి ఇటీవలి కాలంలోనే జరిగినట్టు కనిపిస్తున్నది. ఇవి స్వాతంత్ర్యానికి పూర్వమా తరువాతనా అన్న స్పష్టమైన విభాజక రేఖ గీయలేము. అట్లా గీయాలంటే చాలా సాక్ష్యం చూపించవలసి ఉంటుంది.

తెలుగులో 'బడు' ప్రయోగం మీద తెలుగు రచయితలకు ముఖ్యంగా పత్రికా రచయితలకు చాలా రాగద్వేషాలు ఉన్నాయి. వీటికి అతీతంగా భాషను పరిశీలిస్తే ఇటీవలి కాలంలో ఒక ప్రయోగం విశిష్టంగా కనిపిస్తున్నది. 'బడు' అనేది కర్మణి ప్రయోగంలో వస్తుంది. కర్మ ప్రాధాన్యాన్ని అధికం చేసి కర్తృ ప్రాధాన్యాన్ని న్యూనం చేసే వాక్య విధానాన్ని కర్మణి ప్రయోగం అంటాం. కర్తరి, కర్మణి ప్రయోగాల మధ్య మూలార్థంలో భేదం లేదు. అంశప్రాధాన్యంలోనే భేదం ఉంటుంది. తెలుగులో సకర్మక క్రియలకే కర్మణి ప్రయోగం సాధ్యం. చంపు, చంపబడ్డాడు అని సాధ్యమేగాని చచ్చు - చచ్చుబడ్డాడు, చావబడ్డాడు, వచ్చు, రాబడ్డాడు అనేవి సాధ్యం కావు. అయితే ఇటీవలి కాలంలో ఈ కర్మణి ప్రయోగం అకర్మక క్రియకు వ్యాపిస్తున్నట్టు కనిపిస్తున్నది. దీనికి సామాజిక అవసరం కూడా కనిపిస్తున్నది. *అరెస్టయ్యాడు, అరెస్టు కాబడ్డాడు* అనే రెండు వాక్యాలను పరిశీలిస్తే రెండోది బడు ప్రయోగం. కర్మణి లాంటిది. అగు అనే అకర్మక క్రియమీద నిర్మితమైంది. ఈ రకమైన క్రియా నిర్మాణానికి అవసరం స్వాతంత్ర్యోద్యమ కాలంలోనే ఎక్కువ కనిపిస్తున్నా స్వాతంత్ర్యోత్తర కాలాన్నే దీని నిర్మాణం జరిగినట్టు నాకు అనుమానం. దీనికి సాక్ష్యాలు, రుజువులు, ఆధారాలు ఏమీ లేవు. పరిశోధనలో తేలాల్సిందే. అరెస్టయ్యాడు అంటే ఇంగ్లీషులో He courted arrest అని అర్థం. తెలుగులో తనే కావాలని అరెస్టయ్యాడు అని అర్థం. అరెస్టు కాబడ్డాడు అంటే ఇంగ్లీషులో He was arrested అంటే తెలుగులో తనకు తాను అరెస్టు కాలేదని పోలీసులు తనను నిర్బంధించారని అని అర్థం. ఇది చాలా ముఖ్యమైన వాక్య నిర్మాణ పరిణామం. సకర్మక క్రియకే పరిమితమైన కర్మణి వాక్య విధానం అకర్మక క్రియకు వ్యాపించడం ఒక పెద్ద గెంతు (భాషా ప్లుతి).

తెలుగు భాష స్వాతంత్ర్యోత్తర కాలాన, అంతకు ముందటి కన్నా అనేక రంగాలకు విస్తరించింది. ఇది భాషా ప్రయోగ విస్తృతి. ప్రయోగ విస్తృతి కూడా భాషా పరిణామంలో భాగమే. ప్రయోగ విస్తృతి రచనా భాషలో ఎక్కువ కనిపిస్తుంది. మాట్లాడే భాషలో ఉండదని కాదు. ఆధునీకరణ ప్రయత్నాల్లో లిఖిత భాషకు ప్రమేయం ఎక్కువ. ఈ దృష్ట్యా భాషా పరిణామాలను పరిశీలిస్తే అనేక విషయాలను గమనించవచ్చు. మాట్లాడే భాషకు లేని

అవసరాలు పరిమితులు ప్రాచీన భాషకు ఉన్నాయి. ఒక దిన పత్రిక మొదటి పేజీని పరిశీలించండి. ఎవరో నాయకుల ఉపన్యాసాలు మొదటి పేజీలో ఎక్కువ చదువుతాం. మాట్లాడే భాషలో అను, చెప్పు అనే రెండు క్రియలతో సర్వ విషయాలను చెప్పుకుంటాం. రాసేటపుడు విషయ వ్యక్తీకరణ ధోరణిని అనుసరించి క్రియా పదాలలో భేదాన్ని సూచించాల్సి వస్తుంది. అందుకే తెలుగు పత్రికల్లో ఉద్ఘాటించారు, వివరించారు, సూచించారు, స్పష్టం చేశారు, విమర్శించారు, వ్యతిరేకించారు. ఇట్లా అనేకానేక వచ్యర్థక క్రియా ప్రయోగం పెరిగింది.

తొలినాటి వ్యావహారిక భాషావాదులు బడు ప్రయోగం మీద దాదాపు యుద్ధమే ప్రకటించారు. ఒకనాటి గిడుగు రామమూర్తిగారి నుంచి ఈనాటి రాంభట్ల కృష్ణమూర్తి గారి వరకు ఈ యుద్ధంలో యోద్ధలు. ఇప్పటి పత్రికా సంపాదకులు ఎవరూ బడు ప్రయోగాన్ని అంగీకరించరు. ఆ మాటకు వస్తే కొందరు భాషా శాస్త్రవేత్తలు కూడా అహేతుకంగా ఈ ప్రయోగంపై శత్రుభావంతో ఉన్నారు. దీనివల్ల కలిగిన మార్పులు రెండు రకాలుగా కనిపిస్తున్నాయి. ఒకటి వీళ్ల నిషేధాన్ని పట్టించుకోకుండా బడు ప్రయోగాన్ని నిరర్థకంగా ప్రయోగిస్తే రెండవ వర్గం వారు ఈ బడు ప్రయోగాన్ని తప్పించుకోవడం కోసం ఒక కొత్త వాక్య నిర్మాణాన్ని ప్రవేశపెట్టారు. దీన్ని తెలుగులో 'జరుగుడు' వాక్య నిర్మాణ పద్ధతి అంటాం. ఇందులో పెద్ద విశేషమేమీ లేదు. *అన్నం తిన్నాడు* అనటానికి బదులు *అన్నం తినటం జరిగింది*. అంటే ఈ రెండోది జరుగుడు వాక్యనిర్మాణ పద్ధతి. అంతకు ముందు వాక్యంలో లేని జరుగు అనే క్రియ ఈ వాక్యంలో రావటం విశేషం. దీన్ని పూర్వం ఒక వ్యాసంలో క్రియాసృష్టి గారడి అని వ్యవహరించాను. ఇది ఆధునిక అవసరాల కోసం వచ్చినట్టే కనిపిస్తుంది. కాని తన అవసరాన్ని మించి విస్తరించిన జాడ కూడా కనిపిస్తుంది. ఇటీవలి కాలంలో దీని వ్యాప్తి చూస్తే దీన్ని సూత్రీకరించడం దాదాపు అసాధ్యం లాగా కనిపిస్తున్నది. ఇది ఈనాటి తెలుగులో - అంటే తెలుగు రచనలో విస్తరించడానికి కారణం వ్యావహారిక భాషావాదులు *బడు* ప్రయోగాన్ని నిషేధించడం కూడా ఒకటని అనుకుంటాను. కర్తృ ప్రాధాన్యాన్ని తగ్గించాల్సి వచ్చినపుడు కర్మణి ప్రయోగం ఒక మార్గమైతే ఆ మార్గాన్ని సంప్రదాయిక వ్యవహారిక భాషా వాదులు విశేషాధికార సంపన్నులైన పత్రికా సంపాదకులు ఈ ప్రయోగాన్ని నిషేధించగా దిక్కుతోచని రచయితలు శాఖా చంక్రమణం చేస్తూ జరుగుడు వాక్యాలను కనుగొన్నట్టు తెలుస్తుంది. కర్మణి వాక్యాలను, *జరుగుడు* వాక్యాలను గణాంక పద్ధతిలో పరిశోధించి పరిశీలిస్తే మరిన్ని విశేషాలు బయటపడతాయి. ప్రాచీన వచన రచనలో ఈ రకపు వాక్యాలు కనపడవు.

వీటి ప్రారంభం సరిగ్గా ఎక్కడి నుంచో తెలియదు. ఈనాటి మాట్లాడే భాషలోను రచనా భాషలోను అధికంగా కనిపిస్తున్నాయి. చాలా చోట్ల ఈ వాక్యపద్ధతికి ఏ విధమైన అర్థ విశేషమున్నట్టు కనిపించదు. ఇది బహుశా క్రియలో కర్తృబోధను తొలగించటానికి వచ్చినట్టు కనిపిస్తుంది. ఉదాహరణకు ఒక పి.హెచ్.డి. థీసిస్‌లో నుంచి తీసుకున్న ఈ వాక్యాలను చూడండి.

1. దేశంలో తొలిరోజుల్లో ముద్రణ యంత్రాలను క్రైస్తవ మిషనరీలు బాగా ఉపయోగించుకోవడం జరిగింది.
2. మచ్చుకు ఒక ఎడిటోరియల్ పేర్కొనడం జరుగుతుంది.
3. భాషా సాహిత్యరంగాల్లో పత్రికలు చేసిన సేవలు తర్వాత అధ్యాయంలో వివరించడం జరుగుతుంది.

ఈ వాక్యాల్లోని 'జరుగు' తీసేసి ఆయా క్రియలకు కర్తృనామాల్ని అనుసరించి తగిన క్రియా విభక్తిని చేరిస్తే అర్థంలో మార్పు ఏమీ ఉండదు. చివరి వాక్యంలో మాత్రం బడు నివారించడం కోసం *జరుగు* వచ్చినట్లు కనిపిస్తుంది.

తెలుగు వారికి మరీ ముఖ్యంగా తెలుగు పత్రికల వారికి విషయాన్ని విషయంగా చెప్పటం కన్నా రసమయంగా చెప్పటం ఇష్టం. ఆ సందర్భంగా తెలుగులో కొన్ని రకాల క్రియలు తయారయినట్టు కనిపిస్తున్నది. ఈ క్రియలకు పూర్వ ప్రయోగాలు ఉన్నాయను కోను. వీటికి ప్రారంభం ఎక్కడో తెలియదుగాని ఇటీవలి కాలంలో కొన్ని రకాల సదృశీకరణల (metaphorisations) తో కనిపిస్తుంటాయి. వాటిలో కొన్ని

1. చోటు చేసుకొను 2. రాజ్యమేలు 3. రూపు దిద్దుకొను

4. నోచుకొను 5. వెలుగు చూచు వంటివి పత్రికా భాష నుంచి థీసిస్‌ల భాషలోకి కూడా ప్రవేశించాయి. నేను ఇటీవల చదువుతున్న ఒక థీసిస్‌లోంచి కొన్ని వాక్యాలు చూడండి.

1. మెకంజీ సేకరించిన 176 తెలుగు లిఖిత ప్రతుల వివరాలు అందులో చోటు చేసుకున్నాయి.
2. 1835 నుంచి తెలుగు తమిళ భాషల్లో ప్రకటనలు చోటు చేసుకున్నాయి.
3. అదే విధంగా పత్రికల్లో రాజకీయ స్పర్శ చోటు చేసుకుంది.
4. సమాచారం లభ్యం కాకపోవడం వల్ల, స్థలాభావం వల్ల అన్నీ వివరంగా చోటు చేసుకోలేకపోయాయి.

*కొన్ని ఇతర ఉదాహరణలు :*

ఒక పత్రికలో ఉత్తరాల శీర్షికలో రెండు వాక్యాలు చూడండి.

1. ఇంద్రాణిగారి ఉద్యోగిని పర్వం వాస్తవానికి అద్దం పట్టేదిగా ఉంది.
2. జూలై 26 - ఆగస్టు 1 సంచికలో కొడుకు - కూతురు కథ వాస్తవానికి అద్దం పట్టింది.

ఒకనాటి ( 1996 జనవరి 29) టెలివిజన్‌లో దొరికిన వాక్యం. రక్షిత పథకాలు ఇంకా అమలుకు నోచుకోలేదు. 1996 ఏప్రిల్ 24 'వార్త'లోని ఒక వాక్యం.

ఒకరికయితే జనం రావడం లేదు ఇంకొకరికి వచ్చినా వినడం లేదు. ఈ పరిస్థితుల్లో భయం సహజంగా *రాజ్య మేలుతుంది.*

ఒక విమర్శకుడు జాషువాను గురించి రాసిన వాక్యం చూడండి. ''గతించిన స్మృతులను జ్ఞాపకం చేసుకుంటూ తను పుట్టిన వినుకొండతో నా కథకు *పాదులు తీశాడు''.*

మనలో చాలామంది రంగనాయకమ్మగారు 'వాడుక భాషే రాస్తున్నామా ?' అనే పేరుతో ఆంధ్రజ్యోతి వార పత్రికలో 13 వారాలు రచించిన వ్యాసాలు చూసి ఉంటారు. అవి 1990లో పుస్తకంగా అచ్చయ్యాయి. ఆమె సుమారు 10 ఏళ్ళ పత్రికలలో నుండి తాను తప్పులుగా భావించినవి కొన్ని వాక్యాలను ఏరారు. ఈ వాక్యాల విషయంలో ఆమెకు నాకూ కొంత వివాదం జరిగింది. ఈ వివాదంతో ఇప్పుడు మనకు పని లేదుగాని ఆమె తనకు విచిత్రంగా కనిపించిన వాక్యాలను చాలా చోట్ల నుంచి గ్రహించారు.

ఇంకా పరిశీస్తే మరికొన్ని భేదాలు రాసే భాషలో దొరికే వీలుంది. వాక్యాలలో పద బంధాల వరస, కర్తృ క్రియా పదాల సాన్నిహిత్యం వంటివి పరిశోధించవలసిన అంశాలు.

తెలుగు రచనా భాష మాట్లాడే భాషతో సంబంధం పెట్టుకుంటూ వివిధ రంగాలకు విస్తరించడం వలన కొన్ని మార్పులు రాసే భాషలోనే కనిపిస్తున్నాయి. ఆధునిక 'వచన రచనలో ఇంకా నిర్దిష్ట సంప్రదాయాలు ఏర్పడలేదు. సంప్రదాయాలు ఏర్పడే సంధి దశ ఇది. ఈ మార్పులే భావి సంప్రదాయాలుగా స్థిరపడితే స్థిరపడవచ్చు. పైన చర్చించిన మార్పులు ఈ శతాబ్దంలోనే మొదలైనా కాకపోయినా ఈ కాలపరిధిలోనే ఎక్కువ వ్యాప్తి చెందినట్టు ఒక పాటి స్థైర్యాన్ని సంపాదించినట్టు గుర్తించగలం. వీటి మూలాలు ఇంకా శోధిస్తేగాని తెలియదు.

*ఆంధ్రజ్యోతి 1997*

# భాషా శాస్త్రం - సాంకేతిక పదనిర్మాణం

ఏ భాషలోనైనా సాధారణ భాషా ప్రయోగానికి, సాంకేతిక భాషా ప్రయోగానికీ గుర్తించదగిన భేదాలు ఉంటాయి. సాధారణ భాష అంటే అందరికీ సమానమైన ప్రయోజనాల కోసం అందరూ వాడుకునే భాష. సాంకేతిక భాష అంటే ఒక ప్రత్యేకమైన విషయాన్ని గురించి ఒక వర్గం వ్యవహర్తలు వాడుకునే భాష. ఈ భేదాలు వర్గ విభజన, వృత్తి విభజన ఉన్న అన్ని సమాజాల్లోనూ మౌఖిక భాషలో కూడా ఉంటాయి. లిఖిత భాషలో సాంకేతిక భాష అవసరం మరీ ఎక్కువ. సమాజంలో మానవ విజ్ఞానం పెరిగి జీవిత విధానం సంకీర్ణం అయినపుడు శ్రమ విభజనని అనుసరించి వృత్తి విభజన పెరుగుతుంది. ఈ పెరిగిన సామాజిక అవసరాల కోసం భాషా విభజన కూడా పెరుగుతుంది. ఈ విభజన పద నిర్మాణంలో ఎక్కువగా కనిపిస్తుంది. అందువల్ల సాంకేతిక భాష అని వ్యవహరించినప్పుడల్లా ఎక్కువ మంది ఉద్దేశించేది సాంకేతిక పదాలనే.

వాక్యంలో అర్థ విస్తీర్ణత ఉంటుంది. పదంలో అర్థక్లుప్తి ఉంటుంది. పదంలో చెప్పిందల్లా వాక్యంలో చెప్పడం సాధ్యమే. అయితే పదం వాడవలసిన చోటల్లా వాక్యం వాడాల్సి వచ్చే మనుష్యుల శక్తి వ్యయం ఎక్కువ అవుతుంది. శక్తి వ్యయాన్ని పొదుపు చేయటం మనుష్యుల జీవిత లక్ష్యాల్లో ఒకటి. అందుకే సంఘంలో సాంకేతిక పరికరాల (technology) అభివృద్ధి, భాషలో సాంకేతిక పద నిర్మాణం అవసరం అవుతాయి.

సమాజంలో అభివృద్ధి తన వనరులకు, శక్తి యుక్తులకూ తగినట్టు సహజరీతిలో జరిగితే ఆ భాషల్లో సాంకేతిక పదాలు కూడా సహజరీతిలోనే ఏర్పడతాయి. ఇట్లా సహజ రీతిలో ఏర్పడ్డ సాంకేతిక పదాలు అనేకం తెలుగు వృత్తి పదకోశాల్లో గ్రంథస్థం అయ్యాయి. ఆయా వృత్తుల్లో మనకు తెలియని కొత్తమాటలూ ఉంటాయి, తెలిసిన పాత మాటలకు కొత్త అర్థాలూ ఉంటాయి. సాంకేతిక పదాలన్నింటికీ ఇది సాధారణ లక్షణం.

అయితే అన్నివేళలా సమాజాభివృద్ధి - అందులో సాంకేతిక జ్ఞానాభివృద్ధి పరికర నిర్మాణం, పద నిర్మాణం అన్నీ సహజస్థితిలో జరగవు. ఇందుకు ఎన్నో చారిత్రక కారణాలు ఉంటాయి. అంతేకాక చరిత్రలో కొన్ని సమాజాలు కొన్ని అంశాల్లో అపరిమితమైన అభివృద్ధి సాధించవచ్చు. మరికొన్నింటిలో బలహీనంగానూ ఉండచ్చు. ఒక సమాజం ఒక కాలంలో సాధించిన అభివృద్ధి మరో కాలంలో వెనుకబడిపోవచ్చు. ప్రాచీన భారత

సమాజంలో తత్త్వశాస్త్రం, సాహిత్య శాస్త్రం, వ్యాకరణ శాస్త్రం, రాజనీతి శాస్త్రం వంటి శాస్త్రాలు బాగా అభివృద్ధి చెందినట్లు మనకు సాక్ష్యాలున్నాయి. ఇవికాక గణిత, భౌతిక, రసాయనిక, వైద్యశాస్త్రాల్లో కూడా గణనీయమైన అభివృద్ధి సాధించింది. ఇటువంటి అభివృద్ధే ప్రాచీన గ్రీకు, ఈజిప్టు, చైనా నాగరికతలు కూడా సాధించినట్లు మనకు చరిత్ర ద్వారా తెలుస్తుంది. కానీ ఆధునిక కాలంలో కొన్ని శాస్త్రాలలో ప్రాచ్య దేశాలను మించి వివిధ శాస్త్రాల్లో అభివృద్ధిని సాధించాయి. అంతేకాక చాలాకాలం చాలా ప్రాచ్య దేశాలు పాశ్చాత్యదేశాల సామ్రాజ్య వాదానికి, వలసపాలనకు గురి అయి అభివృద్ధి చాలా కుంటు పడింది. ఇప్పుడు సాంకేతిక పరిజ్ఞానంలో పాశ్చాత్యదేశాలు ముందున్నాయి ప్రాచ్యదేశాలు వెనుకబడి ఉన్నాయి. ఈ అభివృద్ధిని ప్రాచ్యదేశాలు కాలానికి వదిలేస్తే కుదరదు. ప్రయత్న పూర్వకంగా సాధించాలి. ఈ అభివృద్ధిని సాధించిన దేశాలనుండీ ఈ నాగరికతను సరాసరి దించుకోవాల్సిన అవసరం ఇప్పుడు ఉంది. ఈ నాగరికతకు అనుగుణంగా భాషాభివృద్ధి కూడా జరగాలి. భాషాభివృద్ధి అంటే ఇక్కడ పదసంపద పెంచుకోవటం.

ప్రతిభాషకూ పద నిర్మాణ రీతులు కొన్ని ఉంటాయి. ఒక పద్ధతి ఆ పదాలను ఆ భావంతో పాటుగానే, వస్తువులతో పాటుగానే సరాసరి ఆ భాషలో నుండి గ్రహించటం. ఇది చాలా తేలికైన పద్ధతి. కొద్దోగొప్పో అన్ని భాషలూ ఈ పనిని చేస్తుంటాయి. 'స్పుత్నిక్' అనే మాట అన్ని భాషలకు అట్లాగే వ్యాపించింది. అయితే చాలా భాషలు ఇతర భాషల నుంచి పదాలను అనంతంగా అరువు తెచ్చుకోవు. ప్రతీ భాషకీ ఈ విషయంలో కొన్ని హద్దులున్నాయి - ఈ హద్దుల పరిమితుల్లో భాషకే భేదం ఉండవచ్చు కాని అట్లా హద్దుల్లేని భావం మాత్రం ఉండదు. ఉదాహరణకు తమిళ భాషపరభాషా పదాలను అసలు గ్రహించదు. వాటిని తమ భాషలోకి అనువదించుకోనన్నా అనువదించుకొంటుంది లేదా ఆ మాటల ముక్కూ మొహం చెక్కేసి తన భాషా పదాలతో కలిపేసుకుంటుంది. తెలుగు భాష ఈ విషయంలో తమిళం కన్నా ఎక్కువ సహనశీలమైనది. ఇతర భాషా పదాలను సహనంతో స్వీకరిస్తుంది. అయితే ఇక్కడ తెలుగుకు ఒక పరిమితి ఉంది. అది సంస్కృత పదాలను మాత్రం దాదాపూ ఏ పరిమితి లేకుండా గ్రహిస్తుంది. ఇతర భాషా పదాలను కొంచెం తక్కువగా గ్రహిస్తుంది.

సంస్కృతం భారతీయ భాషలన్నింటికీ ఒక నిధి వంటిది. ఒకప్పుడు సంస్కృతం దేశంలో అఖిల భారత విజ్ఞాన భాషగా విద్యావేత్తలలో ప్రచారంలో ఉండేది. అందువల్ల సంస్కృతం నుంచి వివిధ భాషలకు పదాలు విరివిగా వ్యాపించాయి. పదాలే కాకుండా

పదాలతో పాటు పదనిర్మాణ పద్ధతులు కూడా మేధావుల పరిధి నుంచి విస్తరించి సాధారణ ప్రజా భాషలోకి ప్రవేశించాయి. ఇవాళ సంస్కృతం తెలుగు భాషకు పరాయి భాష కాదు. అవసరానికి ఆదుకునే తల్లి భాష.

ఇప్పటి భారతదేశంలో ఇంగ్లీషు విజ్ఞాన భాషగా విద్యారంగంలో అమలులో ఉంది. ఇంగ్లీషు భాష తెలిసిన విద్యావంతులు ఇంగ్లీషును ధారాళంగా తాము మాట్లాడేటప్పుడు ఉపయోగిస్తారు. అయితే ఈ విద్యావంతులే తెలుగులో రాసేటప్పుడు ఏ కారణం వల్లనో తెలుగు మాటల కోసం వెతుకుతుంటారు. రాసేటప్పుడు ఆలోచించే వ్యవధి ఉంటుంది గనుక అందుబాటులో ఉన్న తెలుగు మాటను జ్ఞాపకం తెచ్చుకొని రాస్తారు.

ఇతర భాషా పదాలను వాడుకోడానికి తెలుగు భాషల అనుమతించినా తెలుగు రచన అంతటినీ ఇంగ్లీషు మాటలతో నింపటం తెలుగులో రచన చేసే వారికి అంత ఇష్టం ఉన్నట్లు కనిపించదు. అందువల్ల తాము చదివే ఇంగ్లీషు పుస్తకాల్లో ఉన్న అంతర్జాతీయ సాంకేతిక పదజాలాన్ని పూర్తిగా వాడుకోవటం తెలుగు వాళ్లకు మనస్కరించదు. తెలుగులో ఆయా శాస్త్రాల్లో సాంకేతిక పదజాలాన్ని నిర్మించుకోవడం తప్పనిసరి. అయితే తెలుగుకున్న పరభాషా సహిష్ణుత అంత తొందరపెట్టదు కనుక కొంతకాలం అంతర్జాతీయ పదజాలాన్ని వాడుకోవచ్చు. క్రమక్రమంగా తెలుగు మాటలను సృజించుకొని పరభాషా పదాలను తగిన సమయంలో వదులుకోనూవచ్చు. ఇది తెలుగు భాషకున్న ఒక సౌకర్యం.

తెలుగులో పదనిర్మాణం చేయటానికి ఎక్కువగా అక్కరకు వచ్చేది సమాసం. అయితే కేవలం తెలుగు మాటలతో సమాసాలు ఏర్పరచాలంటే ఒక కష్టం ఉంది. సమాసంలో పద సంఖ్య పెరుగుతున్న కొద్దీ సమాసాల ఉత్పాదక శక్తి (productivity) తగ్గిపోతుంది. సంస్కృతానికి ఈ ఇబ్బంది లేదు. సంస్కృత సమాస రీతిలో ఉన్న అధికోత్పాదక శక్తిని తెలుగు కవులు కొల్లగొట్టిన సంగతి తెలుగు సాహిత్యంతో పరిచయం ఉన్న వాళ్లకి సువిదితమే.

ప్రతి భాషలోనూ ఒక శబ్ద విభాగం నుంచే రూప సామ్యాన్నీ, అర్థసామ్యాన్నీ సంరక్షించుకుంటూ ఇతర పద విభాగాలను సృజించుకునే పద్ధతులుంటాయి. ఇట్లా నామం నుంచి క్రియ, క్రియ నుంచి నామం, వాటి నుంచి విశేషణాలు, విశేషణాల నుండి మళ్లీ నామక్రియలు ఇట్లా కొత్త పదాలు నిర్మించుకోవచ్చు. దురదృష్టవశాత్తు తెలుగు భాష ఈ విషయంలో అర్భకురాలు. ఇట్లా కొత్త పదాలను తయారుచేసుకునే నిర్మాణరీతులు అసలు లేవని కాదు, బహుశా ఇతర భాషల కన్నా ఎక్కువే ఉన్నాయేమో. అయితే ఈ రీతులు

తక్కువ సూత్రాలతో ఎక్కువ పదాలను తయారు చేసుకునేట్టుగా లేవు. ఒక ప్రక్రియ ద్వారా ఒక వర్గం నుంచి కొన్ని మాటలను తయారుచేసుకుంటే అదే వర్గంలో నుంచి మరికొన్ని మాటలను తయారుచేసుకోవాలంటే ఆ సూత్రం చాలదు. ఇంకో రకంగా చేస్తే పదనిర్మాణ ప్రక్రియలో సాధారణత (Generality) లేదు. Predictability తక్కువ. వర్గ భేదాలు (class differences) ఎక్కువై పదనిర్మాణంలో సూత్రబద్ధత, హేతుబద్ధత లోపిస్తాయి. సంస్కృతంలో ఒక ధాతువు నుంచి రూపసామ్యం అర్థసామ్యం చెడకుండా ఒకే ప్రక్రియ ద్వారా అధికాధిక పద నిర్మాణాన్ని సాధించవచ్చు. అందువల్ల పద నిర్మాణానికి చాలా అవసరమైన రూపసాధన ప్రక్రియ (derivation), సమాసకల్పన (compounding) అనే విషయాల్లో తెలుగు భాషకు సహజ పరిమితులున్నాయి. సంస్కృతానికి అట్లాంటివి లేవు. అయితే ఈ సంస్కృత పదనిర్మాణ ప్రక్రియ తెలుగు భాషకు సహజమే నన్నంత సొంతమైపోయాయి. అవసరానికి తగినట్లుగా ఉపయోగించుకుంటే ఇది తెలుగు భాషకు ఒక అమూల్యమైన వరం. అందివచ్చిన అద్భుతమైన వరం.

సంస్కృత పదాలు తెలుగులోనికి వచ్చినప్పుడు వాటి సమానార్థక తెలుగు పదాల కన్నా వేరే విధంగా ఉపకరిస్తాయి. తెలుగు మాటలు సాధారణ వ్యవహారానికి పనికొస్తే, సంస్కృత పదాలు విశేష ప్రయోజనాలకు ఉపకరిస్తాయి. ప్రాచీన భాషా సహాయమున్న ఆధునిక భాషలన్నింటికీ ఈ సౌకర్యం ఉంది. ఇంగ్లీషులో water, Hydro అనే మాటలు సమానార్థకాలైనా, సాంకేతిక భాషలో Hydro అనే మాటను వాడతారు. ఇది గ్రీకు నుంచి ఇంగ్లీషు అరువు తెచ్చుకుంది Hydrochloric acid, Hydroelectricity అంటారు. కాని waterchloric acid అని water electricity అని అనరు. అట్లాగే తెలుగులో ఉదజహరికామ్లము అనే మాటే సైన్స్‌లో వాడతాం కాని నీటి ఉప్పు పులుసు అని అనం. Hydro electricity ని జలవిద్యుత్ అంటాము. కాని నీటిమెరుపు అని గాని నీటి వెలుగు అని గానీ అనం. దీని అర్థం ఏమిటంటే ఒక భాషలో పురాతన భాషా (classical language) పదాలు, ఆధునిక భాషా పదాలు సమానార్థకాలుగా ఉంటే పురాతన భాషా పదాలు సాంకేతిక పద నిర్మాణానికి పనికి వస్తాయి. ఆధునిక భాషా పదాలకు అర్థస్థైర్యం తక్కువ. పురాతన భాషా పదాలకు వ్యవహారం పరిమితం కనుక అర్థస్థైర్యం ఎక్కువ.

ఏ పరిభాషకైనా అత్యవసరమైన కొన్ని లక్షణాలుంటాయి.

*1. భావక్లుప్తి:* అసలు పరిభాష అవసరమే భావాన్ని సంక్షిప్తం చేయటం కోసం. ఇట్లాంటి క్లుప్తత తెలుగులో కొంత వరకు మాత్రమే సాధ్యమౌతుంది. అన్నింటికీ తెలుగు

మాటలే పెట్టాడంటే అచ్చ తెలుగు కావ్యాల్లో భాష మాదిరిగా దురవగాహమైన సమాసాలు వాడాల్సివస్తుంది. అచ్చ తెలుగు కావ్యాల్లో పదాలు అర్థం అవుతున్నాయంటే ఆ సమాసాల వల్ల కాదు. వాటిని సంస్కృత సమాసాల్లోకి దూర్చుకోవడం వల్ల అర్థం అవుతున్నాయి. అందువల్ల క్లుప్తంగా భావం ఉండాలంటే సమాసం చిన్నదిగా ఉండాలి. ఆ సమాస ప్రక్రియ భాషా పద్ధతికి సన్నిహితంగా ఉండాలి.

*2. శబ్దలాఘవం:* మాటలు పొట్టిగా ఉంటే త్వరగా గుర్తు ఉంటాయి. ఒకసారి ఎప్పుడో రా, పో, తే,కా వంటి క్రియా రూపాలను దీర్ఘైక స్వరాంత ధాత్వా దేశ రూపాలు అని పిల్చాను. వీటిని ఇంత వేరు బెట్టి పిల్చే బదులు, ఆదేశ క్రియలు అని వాడి వాటి ఇతర లక్షణాలను వాక్యాల్లో చెప్పుకుంటే సరిపోయేది.

*3. వ్యక్తీకరణ సామర్థ్యం :* ఒక్కోసారి మాటలు ఇంగ్లీషులో ఉన్న వాటికి సరిపోయినట్లు కన్పించినా అవి ఉద్దేశించిన అర్థాన్ని వ్యక్తం చేయలేక పోవచ్చు. ఉదాహరణకు Social dialect అనే మాటను 'కుల మాండలికం' అని పి. ఎస్. సుబ్రహ్మణ్యం గారు వాడారు. ఇక్కడ సంఘంలో అంతరువులను బట్టి వచ్చే భాషా భేదం అన్న అర్థం ఈ మాటకు రాదు. అట్లాగే relative chronology అనే మాటకు సుబ్రహ్మణ్యం గారు తారతమ్య చరిత్ర, cyclic principle అనే దానికి 'తరంగ న్యాయం' అనీ వాడారు. రెండు ధ్వని పరిణామాల మధ్యన కాలానుక్రమణికి సూచిస్తే దాన్ని relative chronoiogy అంటారు. సూత్రాలు ఒక వరుసలో వర్తించిన తరువాత మళ్లీ మొదటి కొచ్చి అదే వరుసను పాటిస్తే దాన్ని cyclic principle అంటారు. ఇది వర్తుల క్రమం అన్నమాట. దీన్నే వర్తులక్రమ సూత్రవర్తన అనవచ్చు.

*4. పదసామ్య పరిరక్షణ:* ఒకే భావం భిన్న వ్యాకరణ రూపాల్లో వాడినపుడు ఆ మాటల మధ్యన రూపసామ్యమూ, అర్థ సామ్యమూ ఉంటే, ఆ భావాన్ని గ్రహించటం తేలిక అవుతుంది. ఈ శక్తి సంస్కృత వ్యాకరణానికి ఎక్కువ. నామ్నీకరణ వ్యాసాలను రాసేటప్పుడు నామ్నీకృత అనే ధాతువును ఏర్పరచుకోవడం వల్ల నామ్నీకరణ, నామ్నీకృత, నామ్నీకారక, నామ్నీకరించు వంటి అనేక రూపాలను అర్థరూప సామ్యాలను పరిరక్షించుకుంటూ వాడటం వీలు అయింది. సంస్కృత వ్యాకరణం వల్ల ఈ రూపసాధన క్రమ పద్ధతిలో సాధ్యం అయింది. ఇదే తెలుగులో చెప్పాలంటే చాలా ప్రయాస పడాల్సి వచ్చేది.

*5. జంటతనం :* శాస్త్రంలో కొన్నిచోట్ల కొన్ని భావాలు ఒకదానికొకటి సన్నిహితం

గానూ లేక భిన్నత్వాన్ని బోధించేవిగానూ ఉంటాయి. వాటికి వాడే మాటల మధ్యన అక్షర సామ్యం ఉంటే ఆ మాటలను జంటగా గుర్తు పెట్టుకోవడం తేలిక. పరివర్తన వ్యాకరణంలో competence, Performance అనే మాటలు ఒకదానికొకటి భిన్నమైనవి. ఒకటి చెప్తే రెండవది గుర్తురావాలి. competence అంతర్గతమైనది. Performance బహిర్గతమైనది. వీటికి ప్రతిభ, ప్రవృత్తి అనే మాటలు వాడాను. ఈ మాటలు సాహిత్య శాస్త్రంలో సరిగ్గా ఈ అర్థాల్లో కాకపోయినా సన్నిహితమైన అర్థాల్లో వాడారు. అల్లాగే deep structure, surface structure అనే మాటలు పరివర్తన వ్యాకరణంలో ప్రసిద్ధం. మొదటిది వ్యాకర్త విశ్లేషించి సాధించేది. త్వరగా బయట పడనిది. రెండవది స్థూల దృష్టికి కూడా దొరికేది. వీటిని గుప్తనిర్మాణం, వ్యక్త నిర్మాణం అని వాడాను. వీటిని సుబ్రహ్మణ్యంగారు అంతరంగ నిర్మాణం, బహిరంగ నిర్మాణం అని వాడారు. ఆ మాటలుకూడా అర్థబోధను కల్గిస్తున్నాయి కానీ, క్లుప్తత, జంటతనం తక్కువ.

Matrix sentence, embedded sentence అనే మాటలకు నేను కొంతకాలం నుంచి గర్భివాక్యం, గర్భవాక్యం అని వాడుతున్నాను. సుబ్రహ్మణ్యంగారు, అంగివాక్యం, అంగవాక్యం అనే మాటలను ఇటీవల ప్రవేశపెట్టారు. ఈ రెండు జంటల్లోనూ క్లుప్తత, జంటతనం రెండూ ఉన్నాయి. బహుశా ఈ జంటల మధ్య పోటీలో సుబ్రహ్మణ్యంగారి మాటలకే ఇక ముందు వ్యాప్తి కలుగవచ్చు. ఈ విధంగా చాలా వాటికి సుబ్రహ్మణ్యంగారు గాని నేను గాని సంస్కృతం సహాయంతో పరిభాషను సృష్టించుకొని వాడుకున్నాం. ఈ పై భావనలకు *తల్లివాక్యం, పిల్లవాక్యం* అనరాదా అని భద్రిరాజు కృష్ణమూర్తిగారు ఒకసారి అడిగారు. మాటల మధ్యన శబ్దసామ్యము, అర్థసామ్యము క్లుప్తత, జంటతనము అవసరమైనపుడు సంస్కృతాన్ని ఉపయోగించుకోవడంలో మనకు సంకోచం ఉండక్కర లేదు.

తెలుగులో ప్రాచీన కాలం నుంచీ వ్యాకరణ శాస్త్రం పాఠ్య విషయంగా ఉంది. దీనివల్ల భాషా శాస్త్రానికి ఒక సౌకర్యం ఉంది. సంస్కృత వ్యాకరణం నుండీ తెచ్చుకున్న పరిభాష చాలా వరకూ తెలుగు వ్యాకరణాలు ఉపయోగించుకున్నాయి. ప్రాచీన వ్యాకరణ సంప్రదాయం భాషా శాస్త్రంలో భాగమే కనుక ఆధునిక భాషా శాస్త్రంలో అవసరమైన చాలా మాటలకు వ్యాకరణ శాస్త్రం మూలంగా ఉంటుంది. నామం, క్రియ, ఆఖ్యాతం, విశేషణం, పదం, వాక్యం ఇట్లాంటి మాటలు మనకు ప్రసిద్ధంగానే ఉన్నాయి. అయితే పెరుగుతున్న శాస్త్రం కనుక అన్ని భావనలకు వ్యాకరణ శాస్త్రం సహాయపడలేదు.

కొన్నింటిలో కొన్ని అర్థభేదాలు ఉంటాయి. అటువంటప్పుడు కొన్ని పాత మాటలకు కొత్త అర్థాలు కల్పించి అర్థ నిర్దేశం చేయాల్సి ఉంటుంది. ఆధునిక భాషా శాస్త్రంలో phone, allophone, phoneme అని ప్రసిద్ధంగా ఉన్న మాటలకు భద్రిరాజు కృష్ణమూర్తిగారు ధ్వని, సవర్ణం, వర్ణం అని వాడుతున్నారు. వ్యాకరణంలో వర్ణం, భాషా శాస్త్రంలో వర్ణం సంపూర్ణ సమానార్థకాలు కావు. వ్యాకరణంలో వర్ణం సిద్ధభావనలా ఉంది. భాషా శాస్త్రంలో వర్ణం విశ్లేషణ పద్ధతి ద్వారా సాధించింది. అయినా వర్ణం అన్నమాట స్థూలంగా సరిపోతుంది. కాని సవర్ణం అనే మాట వ్యాకరణంలో తుల్యాస్య ప్రయత్నమున్న వర్ణాలకు వాడారు. వ్యాకరణాల్లో సవర్ణం ఇప్పటి phonology లో natural class అనే దానికి సరిపోతుంది. allophone అనే భావన ప్రాచీన వ్యాకరణ సంప్రదాయంలో లేదు. అయితే ఒక్కొసారి వాడేవారి పలుకుబడి వల్ల ఆ మాటకు ప్రచారం ఎక్కువగా రావచ్చు. ఇవాళ వర్ణం, అనే మాటల, పదం, పదాంశం అనే మాటలు ఆయా అర్థాల్లో స్థిరపడ్డట్లు కన్పిస్తున్నాయి. ఒక అర్థంలో ఒక పరిభాషా పదం స్థిరపడితే అర్థానికీ పదానికీ మధ్యన ఉన్న సంబంధం? మనం కల్పించేదే కనుక ఆ పదాలకు కొత్త పదాలు వెతుక్కోవాల్సిన అవసరం లేదు.

ఆధునిక భాషా శాస్త్రంలో ఇంగ్లీషులో కూడా రోజురోజుకీ కొత్త పదాలు పుడుతూనే ఉన్నాయి. స్వతంత్ర రచన చేస్తున్నప్పుడు, స్వతంత్ర భావనలకు స్వతంత్ర పదాలు కూడా ఏర్పడుతాయి. ఉదాహరణకు పత్రికాభాషా పరిశీలన చేసే సందర్భంగా గర్భ వాక్య పురస్కరణం (Foregrounding of embedded sentence ) క్రియాసృష్టి 'గారడి' (predicate magic ) అనే మాటలకు పూర్వం వాడాను. ఇంతకు పూర్వం ఈ మాటలు ఈ అర్థాల్లో ఇంగ్లీషులోనూ లేవు తెలుగులోనూ లేవు అట్లాగే అనుకృతిని గూర్చి పరిశోధిస్తూ శబ్ద ప్రధానం (code centered ) అర్థ ప్రధానం లేక విషయ ప్రధానం (information centered ) అనే మాటలను ఆ భావనలకు అనుగుణంగా వాడాను. ఇక్కడ ప్రధానంగా గ్రహించాల్సింది ఏమిటంటే ప్రతి భావనకూ ఇంగ్లీషు నుంచే వెతుక్కోనక్కరలేదనీ స్వతంత్ర రచన తెలుగులో చేస్తే ఆయా సందర్భాలకు అనుగుణంగా కొత్త భావనలు ఏర్పడ్డప్పుడు కొత్త పదాలు కూడా అవసరాన్ని బట్టి ఏర్పడతాయని.

భాషా శాస్త్రంలో కొత్త పదాలు ఏర్పడాలంటే రెండు ప్రధాన మార్గాలున్నాయి. ఒకటి ఆయా శాస్త్రాల్లో విషయ వివరణ చేస్తూ పుస్తకాలు, వ్యాసాలు రచించాలి. రెండు, తమ మౌలిక పరిశోధనను కూడా తొలిగా తెలుగులోనే ఆలోచించి తెలుగులోనే రచించాలి. ఈ రెండు పనులూ చేస్తున్న వారు తెలుగులో ఎక్కువ మంది లేరు. రెండవ పని చేస్తున్న

వారు అసలే లేరు. పాఠ్య గ్రంథాల రచన కొంత జరుగుతున్నది. పాఠ్య బోధన తెలుగు శాఖలలో జరుగుతుంది. తెలుగులో భాషాశాస్త్ర పరిశోధన ఏర్పడటానికి ఈ రెండే ప్రధాన మార్గాలుగా కన్పిస్తున్నాయి. తెలుగులో స్వతంత్ర రచన ఎంత ఎక్కువ జరిగితే తెలుగులో అంత పరిభాష స్వతంత్రంగా ఏర్పడుతుంది. ఇది ఉత్తమ మార్గం. రెండో మంచి మార్గం పుస్తకాలు, వ్యాసాలు తెలుగులో స్వతంత్రంగా రచించటం. పదాలు దగ్గర పెట్టుకొని అనువాదం చెయ్యటం అథమ మార్గం. అత్యావసరమైనప్పుడు ఈ మార్గం అనుసరణీయం అవుతుంది.

పరిభాషా నిర్మాణం గురించి పండితుల్లో కూడా కొన్ని అపోహలున్నాయి. అందులో ఒకటేమిటంటే పరిభాషా పదాలు అందరికీ వెంటనే అర్థం కావాలనేది. ఏ పరిభాషా పదమూ అందరికీ అర్థం కాదు. అందరికీ అవసరమైనదీ, అర్థం అయ్యేదీ సాధారణ భాష. పరిభాష ప్రయత్న పూర్వకంగా నేర్చుకునేది. ఈ విషయాన్ని గమనించని కొందరు పెద్దలు నూత్న పరిభాషా కల్పనకు అడ్డం తగులుతుంటారు.

ఉదాహరణకు వృక్షచ్ఛేధన నియమం (tree prunching convention ) కర్తృద్ధరణ (subject raising ) వంటి మాటలు కాని, ఆ మాట కొస్తే ప్రతిభ, ప్రవృత్తి అనే చిన్న మాటలు కూడా ఆ భావన అర్థమైతే తప్ప అర్థం కాదు. ఏ మాటలైనా వాటి అర్థాలతో పాటు ఆ శాస్త్రంలో చదువు కుంటేనే తెలుస్తాయి.

అట్లాగే సాధారణ భాషలో ఉన్న మాటలే సాంకేతికంగా వాడుకోగూడదా అని మరికొందరు వాదిస్తారు. సాధారణ భాషా పదాలకు అర్థ వ్యాప్తి అధికం. అందువల్ల పరిభాషా పదాలు సామాన్య పదాలు కాకుండా ఉండటమే మంచిది. పరిభాషా పదాలను విద్యార్థులకు బోధించేటప్పుడుకాని, శాస్త్రాలను సామాన్యులకు పరిచయం చేసేటప్పుడు కాని సామాన్య భాషా పదాలను వాడి విషయ వివరణ చెయ్యవచ్చు. విషయ ప్రతిపాదనకు, విషయ వివరణకు మధ్య భేదాన్ని గుర్తించక పోవటం వల్ల ఈ అపోహ ఏర్పడిందను కుంటాను.

పండితులకు, పత్రికల వారికి ఒక సంఘర్షణ ఎప్పుడూ జరుగుతుంటుంది. పత్రికల వారు ఆ సమయానికి అవసరమైన మాట సృజిస్తారు. ఆ మాట పండిత సమ్మతం అవునా కాదా అని ఆలోచించే వ్యవధి ఉండదు. అయితే ఆ పదాలను శాస్త్ర పరిభాషగా గ్రహించాల్సిన అవసరం లేదు. విజ్ఞానాన్ని ఎక్కువమంది ప్రజలకు అందించటమే పత్రికల పని. శాస్త్ర పరిశోధన వారి వృత్తి కాదు. విషయ ప్రతిపాదన వారి పని కాదు. విషయ వివరణ, సమాచార వ్యాప్తి మాత్రమే వారి లక్ష్యాలు.

పండితుల కృషికి పత్రికల రాతలు ప్రత్యామ్నాయం కాదు. అదనపు సహాయం మాత్రమే. పత్రికల భాష సామాన్య భాష. అందులో వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలుండ వచ్చు. మిశ్ర సమాసాలుండవచ్చు. సంప్రదాయం అనుమతించని పద సృష్టి చెయ్యవచ్చు. ఇవన్నీ సామాన్య భాషా వ్యవహారానికి సంబంధించినవి. శాస్త్ర ప్రతిపాదనకు సంబంధించినవి కావు. అయితే ఇక్కడ ఒక సూచన చెయ్యవచ్చు. పత్రికలలో ఆయా శాస్త్రాలతో పరిచయం ఉన్న వారిని ఆయా శాస్త్రాల విషయ సంపాదకులుగా నియమించ వచ్చు. ఈ పని విదేశాల్లో చేస్తారు. ఈదేశంలో ప్రసిద్ధాంగ్ల పత్రికలకు ఈ సంప్రదాయం ఉంది. తెలుగు పత్రికల్లో మాత్రమే ఈ సర్వజ్ఞ సంపాదక సంప్రదాయం సాగుతున్నట్టుంది. ఇది విచారించదగిన విషయమే. అయితే విద్యావేత్తలు ఈ విషయంలో చెయ్యగలిగిందేమీ లేదు.

భాషా శాస్త్రం గురించి తెలుగులో రాసేవాళ్ల సంఖ్య చాలా కొద్దే అయినా చాలా వైవిధ్యం కనిపిస్తుంది. ప్రధానంగా భద్రిరాజు కృష్ణమూర్తి, పి. ఎస్. సుబ్రహ్మణ్యం, చేకూరి రామారావు వంటి వారు తెలుగులో ఎక్కువ రాశారు. పి.సి. నరసింహారెడ్డి, బి.వి. ఎల్. నారాయణరావు, ఎల్.బి. శంకరరావు వంటి వారు కూడా కొంత రచన చేశారు. తూమాటి దొణప్ప, జి. ఎన్. రెడ్డి, నాయని కృష్ణకుమారి వంటి వారు పాఠం చెప్తూ కొన్ని మాటలు వాడారు. వీరందరి కృషివల్ల తెలుగులో ఈ పాటికే కొంత పరిభాష తయారయింది, తయారు కావాల్సింది చాలా ఉన్నా తయారయిన పదాల్లోనూ వైవిధ్యం (variation) చాలా ఉంది. వారు సృజించిన మాటలను వారి రచనల్లోనూ, పాఠ్య బోధనల్లోనూ వాడుతున్నారు. దీనివల్ల ఒకే భావనకు ఎక్కువ మాటలు వ్యాప్తికి వస్తాయి. ఒక భావనకు ఒకే మాట ఉండాలని కనీసం ఇప్పుడు వాదించక్కర్లేదు. తెలుగులో భాషా శాస్త్ర రచనే చాలా తక్కువ. ఇప్పుడే ప్రామాణీకరణ పేరుతో వైవిధ్యాన్ని చెరిపెయ్యకూడదు. దానివల్ల సృజన శక్తి శాశ్వతంగా కుంటుపడే ప్రమాదం ఉంది. ఇప్పుడు కావాల్సింది విస్తృతంగా తెలుగులో రచన, చర్చ. వైవిధ్యం ఇప్పుడు గుణం. రచనల్లో ఎక్కువ మాటలు ఉండటం వల్ల ఇప్పుడు వచ్చిన నష్టం ఏమీ లేదు. కొన్నాళ్లు బ్రాకెట్లలో ఇంగ్లీషు మాటలు ఇవ్వవచ్చు. పుస్తకాల చివర ఆంగ్లాంధ్ర పద పట్టిక లివ్వవచ్చు. భాషా శాస్త్రం విస్తృత పాఠ్యాంశంగా ఏర్పడినప్పుడే ప్రామాణీకరణం గురించి ఆలోచించవచ్చు.

సృజనశక్తిని నాశనం చేసే ప్రామాణీకరణ వల్ల నష్టమే కాని ప్రయోజనం లేదు.

# కవిత్వ భాష

కవిత్వానికీ భాషకూ ఉండే సంబంధాన్ని గురించి అనాదిగా చర్చ సాగుతున్నది. కవిత్వం భాషలోనే సాధ్యం. అయినా భాష నుంచి విడదీసి చూపించలేం. ఇదిగో ఇక్కడ కవిత్వం ఉంది అని చూపించిన చోట అయినా అది భాష కూర్పే అవుతుంది. శరీరం నుంచి ప్రాణాన్ని ఎట్లా విడదీయలేమో భాష నుంచి కవిత్వాన్ని అట్లా వేరు చెయ్యలేం. కవిత్వం లేని భాష ఉండవచ్చుగాని భాష లేని కవిత్వం ఉండదు.

మాట వరసకన్నాను గాని, కవిత్వం లేని భాష కూడా ఎక్కడా లేదు. ప్రపంచ భాషలన్నిట్లోనూ కవిత్వం ఉంది. అప్పుడు కవిత్వం అంటే ఏమిటి అనే ప్రశ్న వస్తుంది. దీన్ని నిర్వచించటానికి ప్రపంచమేధావులంతా చిరకాలం నుంచి విఫలయత్నం చేస్తూనే ఉన్నారు. నిర్వచన సాధ్యం కాని అనేక విషయాల్లో ఇదీ ఒకటి. అయినా నిర్వచించటం మానుకోని అనేక విషయాల్లో ఇదీ ఒకటి. చెప్పే విషయాన్ని బట్టి ఆ సందర్భాన్ని బట్టి, అవసరాన్ని బట్టి నిర్వచనాలేర్పడుతూనే ఉన్నాయి. అసమగ్రతను గుర్తించినా అవసరం కోసం తాత్కాలిక నిర్వచనం (working definition) ఒకటి తయారు చేసుకొని ముందుకు పోవటం శాస్త్ర సంప్రదాయం (scientific convention) నిర్వచనం కాకపోయినా, ఏదో రకమైన లక్షణవివేచన చేసుకొని ముందుకు సాగవచ్చు.

మనుషుల ప్రధాన భావప్రకటన సాధనాన్ని భాష అంటున్నాం. భాషేతర భావప్రకటన సాధనాలు మనిషికి అందుబాటులో ఉన్నాయనీ, వాటిని కూడా తరచుగానో, అరుదుగానో భాషతో కలిపి గానీ, విడిగా గానీ వాడుతుంటామనీ, అయితే అవి ప్రధాన వాహికలు కావనీ దీని అర్థం. ఆ సాధనాలు ఆంగికమూ కావచ్చు. వాచికమూ కావచ్చు. ఇప్పటికి తెలిసిన సమాచారాన్ని బట్టి భాషలన్నీ వాచికం, కొన్నింటికి మాత్రం లిఖిత వ్యవస్థ ఉన్నది. భాష వాచికంగా ఉంటుందన్న మాట నిజమే కాని ఉక్తమైనదల్లా భాష కాదు. భాష, భాషేతరమూ ఎంతగా కలిసిపోయి ఉంటాయంటే ఒక్కోసారి వాటిని విడదీయటం మహాకష్టం అవుతుంది. ''ఛూ ! ఛీ ! ఫో'' అంటే మొదటి రెండూ భాషలోవి కావని చెప్పవచ్చు. కానీ ''ఫో'' అంటే భాషలో భాగమేనా ? పో అనేది క్రియా పదమేనా ? మరి ఈ మహాప్రాణం ఏమిటి? అర్థం చూసినా నిజంగా ఇక్కడ గమనార్థం ఉందా ? అనే ప్రశ్నలు వేసుకుంటే అంత స్పష్టమైన సమాధానాలు దొరుకుతాయనుకోను. చాలా భాషల్లో వాడే ధ్వన్యను కరణాల్లో భాషాంశం ఎంత ? భాషేతర ధ్వన్యంశం ఎంత ? భాషను గుర్తుపట్టటంలో

కొన్ని చోట్ల కొంత క్లేశం ఉన్నా అన్ని చోట్లా ఈ అసౌకర్యం ఉండదు, ఇవి అంచుల సమస్యలు (Marginal problems). మనం భాషను గుర్తు పడుతూనే ఉన్నాం, వాడుతూనే ఉన్నాం. భాషలో భాషను గురించి మాట్లాడుతూనే ఉన్నాం.

మనం నిత్యం వాడుకునే భాష అయినా ఎప్పుడూ ఒక రకంగా ఉండదు. సంతోషంగా ఉన్నప్పుడు ఒక మాదిరిగా మాట్లాడతాం. విచారంగా ఉన్నప్పుడు ఇంకోలా మాట్లాడతాం. ఆవేశంగా గబగబా మాట్లాడతాం. సాలోచనగా ఆగి ఆగి మాట్లాడతాం. అత్యంత నిర్వికారంగా మాట్లాడతాం. మరింత ఉద్వేగభరితంగా మాట్లాడతాం. చెప్పే విషయం ఒకటే అయినా చెప్పే పద్ధతిలో మన మనఃస్థితిని బట్టి భేదాలు చూపిస్తాం. ఈ భేదం ధ్వనులు కూర్పులో ఉండవచ్చు. పదాల ఎన్నికల్లో ఉండొచ్చు. వాక్య సంయోజనలో ఉండొచ్చు, వాక్య విన్యాసంలో ఉండొచ్చు.

ఇవన్నీ నిత్యం మనం చేస్తూనే ఉన్నా, మన దృష్టి వాటి మీద ఉండదు. సాధారణ వ్యవహారంలో పడి వీటిని అంతగా గమనించం. గమనిస్తే భేదం తెలుస్తుంది. ఇట్లాంటి భేదాల్లో ఒకదాన్నే కవిత్వం అంటాం. దానికి కవిత్వం అని పేరు పెట్టకపోవచ్చుగాని ఆ కూర్పులో విశిష్టతను గమనిస్తాం. అంటే కవిత్వంలో భాష కూర్పు సామాన్య భాషలో కూర్పు కంటే భిన్నంగా ఉంటుందనీ, చెప్పే విషయంకన్నా కూర్పు మనల్ని ఆకర్షిస్తుందనీ గ్రహించగలం. అదిగో దాన్నే కవిత్వం అంటాం.

ఒక్కోసారి ఒక క్షణం కింద మనం ఏమన్నామో గుర్తుండకపోవచ్చు. ఏం చెప్పామో గుర్తుంటుంది గాని, ఎట్లా చెప్పామో గుర్తుండకపోవచ్చు. రోజువారీ మాట్లాడే భాషలో చెప్పే విషయమే ప్రధానం కానీ, చెప్పే పద్ధతి కాదు. అందుకే సాధారణభాషను వర్ణిస్తూ త్వరనాశాన్ని (rapid fade away) ఒక లక్షణంగా ప్రతిపాదించారు. కవిత్వంలో పద్ధతికి ప్రాధాన్యం వస్తుంది. భాష కూర్పును గుర్తుంచుకుంటాం. భౌతిక ప్రపంచంలో మాయమైనా మనః ప్రపంచంలో గుర్తుంటుంది. రాతి మీదనో, ఆకు మీదనో, కాయితం మీదనో పెడితే భౌతిక-ప్రపంచంలోనూ ఉంటుంది. ఈ కూర్పును పదేపదే గుర్తుచేసుకుంటాం. చదువుకుంటాం. భావిస్తాం, అనుభవిస్తాం. దాన్నే కవిత్వం అంటున్నాం. భాషలో పలుకుబడులు, జాతీయాలు, సామెతలు వంటి నుడికార విశేషాలు భాషలో అట్లాగే స్థిరపడి ఉంటాయి. ఇవి లేకుండా కూడా శుభ్రంగా మాట్లాడుకోవచ్చు. అనువాదంలో ఇవి అడ్డుతగుల్తుంటాయి కూడా. అయినా ఇవి లేకుండా మాతృభాషలో మాట్లాడలేం. (ఇంగ్లీషు మీడియం స్కూళ్లలో చదువుకున్న వాళ్లు ఇవి లేకుండా మాట్లాడగలరు. కానీ వాళ్లు మాతృ

భాషాదూరులు) ఆమె వాగ్ధోరణి గంగా ప్రవాహంలాగా ఉందనో, అతను మాట్లాడుతుంటే రాళ్ల చేలో గుంటక తోలినట్లు ఉంటుందనో, ఆమె చెక్కిలి చిదిమి దీపం పెట్టవచ్చుననో అంటుంటాం. ఏం ? మాట్లాడితే నోటి ముత్యాలు రాలిపోతాయా అని ఎద్దేవా చేస్తాం. నారు పోసిన వాడు నీరు పోయడా ? అని నిట్టూరుస్తాం. వెన్నెల పిండి ఆరబోసినట్టుంది అంటాం. ఇట్లా ఎన్నో అవసరం లేని పలుకుబడులూ, సామెతలూ, సామ్యాలూ ఉపయోగిస్తాం. ఇవిలేకుండా మాట్లాడలేమా అంటే మాట్లాడ వచ్చు. కాని చాలా నిగ్రహించి మాట్లాడాలి. వీటి ప్రయోగం మనిషికి సహజమైంది. ఎందుకు సహజమైనది ? అంటే మనిషి భాషా నిర్మాణంలో ఇవి భాగంకనుక అని సమాధానం. ఇట్లాంటి వాటికి వీలుకల్పించే లక్షణాలు భాషలో ఉన్నాయి. అన్నిటినీ ఇక్కడ ఏకరువు పెట్టటం కుదరదు కాని కొన్నిటిని గురించి అయినా చెప్పుకోకపోతే ముందుకు పోలేం.

భాషలో చెప్పేవి వాస్తవాలు కానక్కర్లేదు. నిజమే చెప్పాలన్న నియమం లేదు. కన్నవీ, విన్నవీ మాత్రమే మాట్లాడుకోవాలన్న కట్టుబాటు లేదు. వాస్తవ విరుద్ధమైన ఊహలు చెయ్యవచ్చు. లోకాతీతమైన కల్పనలు చెయ్యవచ్చు. భాషలో చెప్పే భావాలకు దేశకాలావధుల్లేవు. భాషకున్న ఈ సామర్థ్యం మానవజాతి అభివృద్ధికి దోహదం చేసింది. వీటి అన్నిటినీ కలిపి ఇంగ్లీషులో ఓపెన్నెస్ (Openness) అంటాం. *పరిమితి రాహిత్యం* అని తెలుగులో అనుకోవచ్చు. ఏ విషయాన్ని గురించి అయినా ఎన్ని విషయాలను గురించి అయినా, ఎక్కడి సంగతులయినా, ఎప్పటి విషయాలయినా, జరిగినా, జరక్కపోయినా, జరగటానికి వీలున్నా, వీలులేకపోయినా, ఈ లోకాన్ని గురించి అయినా, ఉన్నాయో లేదో తెలీని లోకాల గురించి అయినా - ఇదీ అదీ అనే భేదం లేకుండా, సాధ్యాసాధ్య విచక్షణ లేకుండా చెప్పగలిగే శక్తిని పరిమితి రాహిత్యం అంటున్నాను. నిత్య విస్తృతి దీని లక్షణం.

అవసరమైన వాటికే పరిమితం కాకపోవటం మనిషి లక్షణం.

నిత్య జీవితానికి అవసరం లేని పనులు అనేకం మనుషులు చేస్తారు. దీన్ని ఇంతకన్నా విస్తరించి చెప్పాల్సిన అవసరంలేదు. మనిషి భాష కూడా అందుకు తగినట్టు ఉంది. కవిత్వం భౌతిక జీవితావసరం కాదు. అవసరానికి మించి చేసే పనుల్లో ఒకటి కవితా రచన, శ్రవణాలు. ఇది మనిషికి సహజంగా ఉన్న సౌందర్య పిపాస వల్ల వచ్చింది. తనది కాని ఈ ప్రపంచంలో, తన కోసం నిర్మించబడని ఈ ప్రపంచంలో ఒక క్రమాన్ని, ఏర్పాటును (design and arrangement) అందులో అందాన్ని దర్శించటం మనిషికి అనాదిగా వస్తున్న అలవాటు. అటువంటి మనిషి తనదైన భాషలో అందాన్ని చూడటం,

నిర్మించటానికి ప్రయత్నించటం సహజం. పరిణామక్రమంలో నిప్పును కనిపెట్టటం, చక్రం కనిపెట్టటం లాంటి యాదృచ్ఛిక సంఘటనే కావచ్చు కవితావిర్భావం. తను విశేషించి శ్రమ పడకర్లేకుండా అందుబాటులోకి తెచ్చుకోగలిగిన భాషలో సౌందర్య సృష్టి చెయ్యాలనే కోరిక కలగటం సహజం. సౌందర్య దృష్టి, సౌందర్య సృష్టి మనిషికి మనిషిగా (species specific) అలవడ్డ లక్షణాలు.

ఇంతకాలం సాంప్రదాయికంగా లిఖిత పూర్వకంగా వస్తున్న ప్రాచీన కావ్యాల్లో కనిపిస్తున్న భాషను కావ్య భాష అంటున్నాం. కావ్య భాష, కవిత్వ భాషా ఒకటి కాదు. కావ్యభాషలో కవిత్వమూ చెప్పొచ్చు. కవిత్వేతరమూ చెప్పవచ్చు. ఆ భాషకు గ్రాంథిక భాష అనే ఇంకో పేరుండేది. అన్ని రచనా వ్యవహారాలు ఆ భాషలో జరగాలని కొంతకాలం కిందట కొందరు పండితులు వాదించారు. కాని సుమారు అర్ధశతాబ్దానికి పైగా సుదీర్ఘ పోరాటం జరిపి ఆ భాషలో రాయకర్లేదనీ నేటి భాషలోనే రాయవచ్చునీ చాలామందిని ఒప్పించాం.

నేటి భాష అనగానే మళ్లీ చిక్కులున్నాయి. ఈనాటి పండితులు మాట్లాడే భాషను శిష్ట వ్యావహారికం అని పిల్చాం. అయితే ఎప్పుడైనా పండిత భాషే కవిత్వ భాష కావాలా ? కవిత్వ భాషా పండిత భాషా ఒకటేనంటే పండితులు కాని వాళ్లకి సౌందర్య దృష్టి ఉండదని అనాల్సి ఉంటుంది. అదీగాక రాసేదే కవిత్వం అని కూడా అనాల్సి ఉంటుంది.

ఒకవైపు శాస్త్రీయ హేతుదృష్టీ, మరోవైపు ప్రజాస్వామ్య విధానం బాగా వ్యాపించిన ఈ కాలంలో పండిత భాషకే కవిత్వ భాష అయ్యే యోగ్యత ఉందని చెప్పటం వీలుపడదు. బహుశా పాఠ్యపుస్తకాల రచనకు, శాస్త్ర గ్రంథాల రచనకూ శిష్టమో దుష్టమో పండిత భాష అవసరమని వాదించవచ్చు గాని కవిత్వానికి శిష్ట వ్యావహారికమే ఉండాలని నియమం ఏర్పరచలేం.

మరీ ముఖ్యంగా అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం బాగా ప్రచారం అయిన తరువాత మాండలిక భాషలో కవిత్వం సర్వ ప్రజాదరణ పొందుతున్నది. అయితే మాండలిక భాషనే కవిత్వ భాష అందామా ?

గ్రాంథికం అనే ప్రాచీన భాషలోని పదాలు ఆధునిక కవిత్వంలో విరివిగానే కనిపిస్తున్నాయి. శిష్టవ్యావహారిక భాషా పదాలూ వ్యాకరణమూ ఈనాటి కవిత్వంలో ఎట్లాగూ ఉంటాయి. మాండలిక భాషలోనూ కవిత్వం వస్తున్నది. దీన్ని బట్టి భాష అనేది ఏదీ కవిత్వానికి నిషిద్ధం కాదని తెలుస్తున్నది. ఇన్ని రకాల భాషాభేదాలు ఉండటం తెలుగు

కవిత్వానికి దొరికిన వరంగా భావించవచ్చు. ఇతర భారతీయ లిఖిత భాషలకు ఈ సౌకర్యం ఉండి ఉండవచ్చు. బహుశా చైనీస్ భాషకు ఈ సౌకర్యం ఇంకా ఎక్కువ ఉండే అవకాశం ఉంది. చైనీస్ భాషలో భేదాలు చాలా ఎక్కువ.

ఇంతకూ కవిత్వ భాష అంటే ఏమిటి ? పై భాషా భేదాలన్నీ కవిత్వ భాష అందామా? మనం సాధారణ వ్యవహారానికి వాడుకునే భాషను సాధారణ భాష అంటాం. కవిత్వ భాష సాధారణ వ్యవహారంకోసం వాడం. సాధారణ వ్యవహారంలో భాషను కవిత్వంలో వాడతాం. అంటే సాధారణ భాషే కవిత్వ ప్రయోగంలో కవిత్వ భాష అవుతుంది. సాధారణ భాష తక్షణ ప్రయోజనం తీరిన తరువాత అనంత వాయువులో కలిసిపోతుంది. కవిత్వ భాషకు సాపేక్ష (relative) స్థయిర్యం ఉంటుంది. తక్షణ ప్రయోజనాపేక్షకార్థ స్ఫూర్తి సాధారణ భాషా లక్షణం. అర్థ స్ఫురణ కలిగించిన తరువాత సాధారణ భాషను మర్చిపోతాం. కవిత్వ భాష అర్థస్ఫూర్తికోసం కాదు, అర్థాంతర స్ఫూర్తి కోసం. అర్థాంతర స్ఫూర్తి అంటే వాచ్యేతరార్థ స్ఫూర్తి కోసం.

ప్రాచీనాలంకారికులు వ్యంగ్యం అన్నా, ధ్వని అన్నా, వక్రోక్తి అన్నా క్రిస్టోఫర్ కాడ్వెల్ గుప్త వస్తువు (latent content) అన్నా ఈ అర్థాంతర స్ఫురణను ఉద్దేశించే. అర్థాంతర స్ఫురణ భాషా సంయోజన బట్టే కలిగినా దానికి దేశ, కాల, సామాజిక, వైయక్తిక, సాంస్కృతికాంశాల ప్రమేయం ఉంటుంది. అందుకే ఒకే కవితా ఖండిక భిన్న కాలాల్లో భిన్న వ్యక్తులకు అర్థ స్ఫురణ ఒకే రీతిలో ఉండకపోవచ్చు. కవిత్వానికి భిన్న, అంతరార్థ స్ఫురణలు కలిగించే శక్తి ఉంది.

అందుకే కవిత్వంలో భాషా స్థయిర్యం అవసరం అవుతుంది. తక్షణ ప్రయోజనాభిలాషి అయిన సాధారణ భాషకు స్థయిర్యం అవసరమూ లేదు. ఉండనూ ఉండదు. భాషకు స్థయిర్యం ఇచ్చే అంశాల్లో లయబద్ధత ఒకటి. అందుకే చాలా తెలుగు సామెతలు లయ బద్ధంగా ఉంటాయి. లేకపోతే క్రమబద్ధంగా ఉంటాయి. ఉదాహరణకు చూడండి.

చక్కనమ్మ చిక్కినా అందం
సన్నగుడ్డ చినిగినా అందం

ఇదో సామెత. సాధారణ భాషలో వాడేదే అయినా దీంట్లో కవిత్వాంశ ఉంది. రెండు విషయాల సమాంతరత ద్వారా సాధించిన అర్థాంతర స్ఫూర్తి ఉంది. రెండు పాదాల ఆద్యక్షరణ వర్ణ మైత్రి ఉంది. అంత్యప్రాస ఉంది. మాత్రా విభజన సమత్వం

పద్ధతిలో కూరుస్తాడు. ఈ కూర్పు వల్లనే కవిత్వ భాష ఏర్పడుతుంది. ఉన్న భాషే కవిత్వ భాష అవుతుంది. కొత్త స్ఫూర్తినిస్తుంది. ఇట్లాటి సృష్టినే ఇంగ్లీషులో డిక్షన్ (diction) అంటారు. కొత్త కవితా మార్గంలో పయనించే కవులు కొత్త డిక్షన్ తయారు చేసుకోటం మనం తరచు గమనిస్తాం. కృష్ణశాస్త్రి గారి కవిత్వభాష ఆ కాలపు కవిత్వ భాషే అయింది.

'ప్రవాసము'లో ఈ పద్యం చూడండి.

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి
ఏ నొక వియోగ గీతిక
నేను నిదుర
వెన్నెలల దారి నొకరేయి వెడలిపోతి
నొక విపంచీ విరహ కంఠమురసి యెగసి
ఏ నొక వియోగ శాలినీ హృదయరాగ
వేదనారేఖ, నా కలి వేగునామె
యంగుళీ కిసలయ చంచలాంచలములు
విడివడి యనంత విశ్వాస బడితినాడు.
అదియె మొదలేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్త పోవు.
ఆ సమయమాదిగా నప్పరోంగనాను
రాగవీధుల, కిన్నరీ రమ్యకంఠ
సీమలో శ్రావణాంబుదాశ్లేషపాళి
తారకాలోక పంక్తుల, మారుతోరు
పక్షముల దిరుగాడుదు పవలు రేలు
కన్నుమోడుపు, మెయివాల్పు గానిలేక
ఇది ముగియబోని ఏయర్థమెరుగరాని
వేసటేలేని వెర్రి యన్వేషణమ్ము
ఈ ప్రవాసయాత్రారతి నిటులె నేను
కదలి పోవుదు నాశావకాశములను

ఒక నిట్టూర్పు పోలిక,
 ఒక గాఢవాంఛ పగిది.

ఈ పద్యంలో నిదుర వెన్నెలల దారులు విపంచీ విరహ కంఠము, హృదయరాగవేదనారేఖ, అంగుళీ కిసలయ చంచలాంచలములు, శ్రావణాం బుద్శ్లేషపాళి, మౌన బాష్ప కణము - వంటి పదబంధాలు తెలుగులో కొత్త ప్రయోగాలు. ఈ పద్యంలో వాడిన ' ఒక నిట్టూర్పు పోలిక, ఒక గాఢ వాంఛ పగిది'. అనేవి కదలికకు వాడిన కొత్త పోలిక. ఒకటి విషాదాన్ని, ఇంకొకటి సాంద్రతను తెలియజేస్తాయి.

కృష్ణశాస్త్రి గారి ఇంకో పద్యంలో ప్రేయసి వెళ్లిపోవటాన్ని ''కదలి పోతి విషాద సుఖమ్ము గూర్చి, సగము నిద్దురలో గ్రమ్ము స్వప్నమటులు'' అని వర్ణిస్తారు. సుఖదుఃఖాల అవిభాజ్యతను సూచించటమే ఈ పోలిక ప్రయోజనం. ఇదే అర్థాంతర స్ఫూర్తి.

అభ్యుదయ కవిత్వం సాధించదలచిన ప్రయోజనం భావ కవిత్వం కన్నా భిన్నం కనుక భాష కూడా వేరుగా ఉంటుంది. అభ్యుదయ కవిత్వంలో సామరస్యం, స్నేహం, ప్రణయం అనే భావాలకు బదులు, వర్గ వైరుధ్యం, యుద్ధం, కరుణ, జుగుప్స అనే కొత్త విలువలు ఏర్పడ్డాయి. అందువల్ల కవిత్వంలో కొత ప్రతీకలు, కొత్త పోలికలు కనిపిస్తాయి.

ఎముకలు క్రుళ్లిన
వయస్సు మళ్లిన
సోమరులారా చావండి !
నెత్తురు మండే
శక్తులు నిండే
సైనికులారా రారండి !

అనే గేయ భాగంలో పాత సమాజాన్ని సమర్థించే వారిని వృద్ధులు గానూ, సోమరులు గానూ చిత్రించారు. వృద్ధులంటే ఇక్కడ వయో వృద్ధులు గాదు. చాలా రోజుల తరువాత (సుమారు 20 ఏళ్లు!) రాసిన 'కొంత మంది కుర్రవాళ్లు పుట్టుకతో వృద్ధులు' అనే ప్రయోగం కూడా ఈ విషయాన్నే సూచిస్తుంది.

మన కావ్య సంప్రదాయంలో భావ్యర్థ సూచన అనే పద్ధతి ఒకటి ఉంది. ఒక కవి ఉద్దేశించినా ఉద్దేశించకపోయినా ముందు జరుగబోయేదాని సూచన పూర్వ ఘట్టంలో కనిపిస్తుంది. ఇట్లా కనిపించటానికి కారణం కవిత్వ భాషకు నిర్దిష్టత లేక పోవటం, అంతే

కాదు అనిర్దిష్టత - గుణం కావటం ఇక్కడ విశేషం. కవిత్వ భాషకు కవి ఉద్దేశించిన అర్థాలే కాక ఉద్దేశించని అర్థాలను కూడా విమర్శకులు చూపించి మహా కవుల వాక్కును అర్థమే అనుసరిస్తుంది అని సమర్థిస్తారు. ఇందుకు కారణం కవిత్వభాషకు బహుళార్థ బోధకత ఒక లక్షణం. భిన్నార్థ గ్రహణకు, వ్యాఖ్యలకు కవిత్వ భాష వీలు కల్పిస్తుంది. ఆ రకమైన సాగుదల (flexibility) కవిత్వ భాషకుంటుంది.

మహాభారతం అరణ్యపర్వంలో

శారద రాత్రులు జ్వల లసత్తర తారకహార పంక్తులన్
జారుతరంబులయ్యె వికసన్నవ కైరవ గంధబంధురో
దార సమీర సౌరభము తాల్చి సుధాంశు వికీర్యమాణక
ర్పూర పరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై

ఇక్కడితో అరణ్య పర్వంలో నన్నయ రచన ముగుస్తుంది. పరపూరితంబులై అని చదివి ఇతరులచేత పూరింపబడుతుంది. అనే సూచన ఉన్నట్లుగా సంప్రదాయంలో కథ చెపుతారు.

నాయని సుబ్బారావు గారి వేదనావాసుదేవము (1964)లో ఈ పద్యం ఉంది.

ప్రాంశుప్రోత్థ వినమ్రమూర్ధ చలన ప్రస్తార సౌభాగ్యముల్
వంశాంకూరములెల్ల నీదు విలయ వ్యాపార సంరంభ ని
స్త్రింశోదగ్రత ముక్కముక్కలుగ విచ్ఛేదమ్ములై గాని నీ
వంశీగాన నిరంతర వ్యసనముల్ వర్ధింపవా భూమిపై

తన వంశాన్ని తన ఇష్టదైవమైన వాసుదేవుడే ముక్కముక్కలు చేస్తున్నాడన్న వేదన ఈ పద్యంలో ఉంది. వంశాంకూరములంటే వెదురు మొక్కలన్న అర్థమూ ఉంది. కృష్ణుడు (వాసుదేవుడు) వెదురుతో చేసిన మురళి వాయిస్తాడు, వంశచ్ఛేదన (వెదురును కోసి) చేసి. నాయని సుబ్బారావు గారి ఏకైక కుమారుడు మోహనరావు 1968 ఆగష్టు 22న మరణించాడు. ఇట్లాంటి సూచనలు కవిత్వ భాషలో ఉన్న సాగుదల వల్లనే సాధ్యం.

కవి కొత్త మాటను సృజించడని పూర్వమే చెప్పుకున్నాం. ఆ మాటకొస్తే కొత్త మాటలను ఎవరూ పుట్టించరు, పాత మాటలకు కొత్త అర్థాలను కల్పించటం ద్వారా, కొత్త అర్థాలతో పాత మాటలను కలపటం ద్వారా కొత్త మాటలు ఏర్పడతాయి. అయితే ఈ కల్పన కవులు నిత్యం చేస్తుంటారు. అందుకే మాటలు పాతవైనా కవి ప్రయోగంలో కొత్తగా కనిపిస్తాయి. పదానికి అర్థానికీ ఉన్న దూరాన్ని బట్టి కొన్ని పదాలు ఆ భావాలకు

ప్రతీకలు అవుతాయి. కొన్ని సంయోజనలు కొత్తగా - సామాన్య భాషాతీతంగా, సాధారణ భావనకు భిన్నమైన అర్థంలో ఏర్పడ్డాయి. ఇదంతా సామాన్య భాష కవిత్వ భాషగా మారే క్రమం. ఈ మారే క్రమం కవి ప్రతిభను అనుసరించి, కాల ప్రభావాన్ని అనుసరించి ఉంటుంది. కాల ప్రభావం అంటే సామాజికుల ఆలోచనల ప్రభావం అన్నమాట !

శ్రీ శ్రీ కవిత్వంలో పురాణ సంజ్ఞలను కొత్త భావాలకు ప్రతీకలుగా వాడుకున్న వైనం విమర్శకులంతా ఈ పాటికి గుర్తించిందే. యముని మహిషపులోహ ఘంటలు, నరకలోకపు జాగిలమ్ములు, ఉదయసూర్యుని సప్తహయములు, కనకదుర్గా చండసింహం, ఇంద్రదేవుని మదపుటేనుగు, నందికేశుడు, ఆదిసూకరవేద్యుడు-అనే ప్రతీకలు ఇట్లాంటివే. శ్రమైక జీవన సౌందర్యం, యంత్రభూతములు, లోహరాక్షసులు, లోహవిహంగం, లోహశ్యేనం, మౌన మృదంగం (నిషా సుఖంలాగా) వంటి కొత్త సంయోజనలు అనేకానేకాలు కనిపిస్తాయి. శ్రీ శ్రీ వాడిన సంయోజనలపైనా, ప్రతీకలపైనా ఇంకా గాఢ పరిశీలన జరగాల్సి ఉంది.

తెలుగు కవుల ప్రతీకల ప్రయోగం, పదాల నూత్న సంయోజన, వాటి విశేషాల మీద ఇతోధిక పరిశీలన జరిగితే కవిత్వభాష గురించి ఎన్నో విషయాలు తెలుసుకోవచ్చు.

కవిత్వ భాష అంటూ సిద్ధంగా ఒకటి ఉండదు. లోకం నుంచే కవులు భాషను గ్రహిస్తారు. ''సిద్ధిర్లోకాద్భృశ్యా'' అనే చింతామణికారుని సూత్రానికర్థం ఇదేననుకుంటా. భాషా సిద్ధి లోకంలో జరిగితే, కవిత్వ భాషను కవులు తయారు చేసుకుంటారు. సాధారణ భాష కవిత్వ భాషగా మారే క్రమం ఒకటుంటుంది. ఆ క్రమంలో జరిగే పరిణామాలను గుర్తిస్తే కవిత్వభాషా స్వరూపం అర్థం అవుతుంది.

ఇది గ్రాంథిక వ్యావహారిక భాషలకంటే భిన్నం. ప్రమాణ-మాండలిక భాషలకంటే భిన్నం. వ్యాకరణ సమ్మత-విరుద్ధతల కంటే భిన్నం. ఇదొక సృజనాత్మక వ్యాపారం. అన్ని సృజనాత్మక వ్యాపారాల వలెనే ఇదీ విశ్లేషణలకు సంపూర్ణంగా లొంగదు. అంత మాత్రం చేత నిరాశపడగూడదు, నిస్పృహకు లొంగకూడదు. ఈ విశ్వాసాన్ని అర్థం చేసుకునే క్రమంలో సాధారణ భాష సాహిత్య భాషగా మారే క్రమం కూడా అర్థం అవుతుంది.

# అనువాద పద్ధతులు, ఆచరణ సమస్యలు

ఒక భాషలో, సమాచారాన్ని ఇంకో భాషలో అందించటాన్ని అనువాదం అంటాం. ఇట్లా చెప్పటం తేలికేగాని అనువాద పరిధిని పరిమితం చెయ్యటమూ, విస్తృతిని వివరించటమూ, అంత తేలిక కాదు. మాండలికాల మధ్య అవగాహనా క్షమత్వం క్రమక్రమంగా తరగటం వల్ల అవే వేరు వేరు భాషలుగా కాలాంతరంలో ఏర్పడతాయని భాషా శాస్త్రం చెపుతుంది. అయితే ఈ మాండలికాలకు వేరు వేరు భాషలుగా ఎప్పుడు ఎట్లా గుర్తింపు వస్తుందో చెప్పలేం. భాషను మాండలికం కన్న వేరుగా గుర్తించటానికి భాషా శాస్త్ర నిర్వచనాలేవీ సాయపడవు.

అందువల్ల ఒక మాండలికం నుంచి ఇంకో మాండలికంలోకి మార్చినా దాన్ని అనువాదమే అనాలి. పోరంకి దక్షిణామూర్తి. వెలుగూ వెన్నెలా గోదారి అనే నవలను ముందు గోదావరి మాండలికంలో రాసి తరవాత తెలంగాణ, రాయలసీమ భాషలలోకి మార్చాడు. సి.యస్. రావు అనే రచయిత ఊరుమ్మడి బతుకులు అనే కథను రాసి తరవాత దాన్ని నాటకంగా గోదావరి మాండలికంలోనూ, తెలంగాణా మాండలికం లోనూ వేరు వేరుగా మార్చి ప్రదర్శింపజేశాడు. ఇక్కడ ఒక ప్రక్రియ (genre) నుంచి మరో ప్రక్రియకు జరిగిన పరివర్తనను అనువాదమే అనాలి పాల్కురికి సోమనాథుడు రచించిన ద్విపద బసవ పురాణాన్ని నూర్రేళ్ల తరవాత పిడుపర్తి సోమనాథ కవి పద్య బసవ పురాణంగా రచించాడు. ప్రాచీన పద్య కావ్యాలకు అనేక గద్యానువాదాలు ఆధునికంగా వచ్చాయి. కళాపూర్ణోదయం నిర్మాణ పరంగా నవలను పోలి ఉండటం వల్ల కాబోలు దానికి గద్యాను వాదాలు ఈ శతాబ్దంలో కొన్ని వచ్చాయి. ప్రాచీన కావ్యాల్లోని ఘట్టాలను కొందరు ఖండ కావ్యాలుగా మలచారు. వాటిని అనువాదాలు అనాలో లేదో ! వ్యాసరచిత మహాభారతాను వాదంలో తెలుగు కవులు చాలా మార్పులు చేశారు. అంటే అందులో అనువాదంతోపాటు కొంత సొంత రచన కూడా ఉందన్నమాట. సొంతం ఎంత ఉంటే సొంత రచన అనాలి? అనే సమస్య కూడా ఉత్పన్నమవుతుంది. పురాణ కథలను కొన్నింటిని హేతువాద కవులు, రచయితలు పునర్వ్యాఖ్యానిస్తూ నాటక, కథా, పద్య, ఖండకావ్య కృతులుగా ఆధునిక కాలంలో రచించారు. త్రిపురనేని రామస్వామిగారి కావ్యాలూ, నాటకాలు, జి.వి. కృష్ణరావు గారి ఖండకావ్యాలు, ముద్దుకృష్ణగారి కథలు, నార్ల వెంకటేశ్వరరావుగారి నాటకాలు అట్లాంటివి. వాటిని అనువాదాలు అనవచ్చునా ?

ఒక పద్యానికి రాసిన తాత్పర్యం ఒక రకం అనువాదమే. మేడీజీలు, మేడ్ డిఫికల్టులూ సంక్షిప్తీకరణలూ, విపులీకరణలూ, విశదీకరణలూ కూడా అనువాద పరిధిలోవే కావాలి. ఒక కథనాన్ని నాటకంగానూ, ఒక సంభాషణను కథనంగానూ మార్చినా అనువాదమే. నిర్వచనంలో ఈ క్లేశాలను గుర్తిస్తూనే అనువాదం గురించి మాట్లాడకుండా ఉండలేం. వాటినన్నిటినీ విశాలానువాద శాస్త్రం (macro science) లో భాగాలుగా గుర్తిస్తూనే రెండు వేరువేరు భాషలు అని సమాజం అనుకుంటున్న వాటిలో ఒక దాని నుంచి ఇంకొక దానిలోకి ఏ రూపంలో అయినా సమాచారాన్ని అందిస్తే దాన్ని అనువాదంగా అనుకోవచ్చు. ఏ రూపంలో అయినా అనేది కీలకమైన పదం. దాని చర్చను వాయిదా వేద్దాం.

ప్రాచీనువవరూ ఈ అర్థంలో అనువాదం అనే పదాన్ని వాడిన దాఖలాలు లేవు.

రాజరాజనరేంద్రుడు నన్నయ్యను ''కృష్ణ ద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారత నిరూపితార్థ మేర్పడ తెనుగున రచియింపు'' మన్నాడు. ఆయనా ''నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద''నన్నాడు. తిక్కనగారు విరాట పర్వంతో మొదలుపెట్టి ''తుదిముట్టన్ రచియింపుటొప్పు'' అన్నాడు, లేక అనుకున్నాడు. పోతనగారు ''నన్నయ తిక్కనాది కవులీయుర్విన్ పురాణావళుల్ తెనుగున్ సేయుచు'' భాగవతాన్ని ''తెనుగుం జేయరు మున్ను'' అన్నాడు. తాను భాగవతాన్ని 'పలికెద'నన్నాడు. 'ఆంధ్రభాషను రచియింపం' పూనుకున్నాడు.

ఎర్రాప్రెగడ బ్రహ్మాండాది పురాణాంతర్గతంబైన శ్రీ నరసింహావతారంబను పురాణంబుఁ 'దెనుంగుబాస ప్రకటింప వలయుననుకొన్నాడు. వేమజననాథుండొక్కనాడు హరివంశమును 'తెనుంగుగ ... నిర్వహించి తెలుపుతున్నారు. అదే హరివంశంలో తిక్కన గారిని ''తనకావించిన సృష్టి తక్కొరుల చేతన్‌గాడు నాన్'' అని ప్రశంసించారు. అనువాదం అనే మాట ఉపయోగించలేదు సరిగదా, దాన్ని సృజనాత్మక వ్యాపారంగా అభివర్ణించారు.

మంత్రి పెద్దయ సింగనామాత్యుడు శ్రీనాథుని నైషధ సత్కావ్యమాంధ్రభాష (ననఘ) యొనరింపు నాపేరనంకితముగ అని అడిగాడు. ఇవన్నీ చూస్తే, తెలుగు చెయ్యటం, ఆంధ్ర భాష నొనరించటం, ఏదో భాషలో రచించటం అనే విధంగానే ప్రాచీన కావ్యాల్లో కనిపిస్తుంది. అనువాదం అనే మాట ఆధునిక యుగంలోనే వాడుకలోకి వచ్చినట్టుంది. మొదటి ప్రయోగం ఎప్పుడు, ఎక్కడ జరిగిందో తెలీదు.

ప్రాచీనులు అనువాదం చేసినవి ప్రధానంగా కథాకావ్యాలు. వారు అక్కడిక్కడ అనువైన చోట్ల కొన్ని మూల విధేయానువాదాలు చేసినా, ఆ కథను తిరిగి వేరే భాషలో చెప్పటమే

అనువాదంగా భావించారు. మూలకథను ఎడిట్ చేసినా మూల విధేయంగా చేసినట్టుగానే భావించారు. చాలా తరచుగా అందరూ సంభావించే శ్రీనాథుని వివరణ ఒకటి ఆంధ్ర నైషధాంతంలో ఉంది.

'శబ్దంబనుసరించియు, నభిప్రాయంబు గుఱించియు, నలంకారంబు భూషించియు,
నౌచిత్యంబాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు
మాతృకానుసారంబు చెప్పబడి యీ నైషధకావ్యంబు...''

అన్నాడు. ఇన్ని మార్పులు చేసినా ''మాతృకానుసారం అనటం'' కథాసారంలోనూ, సందేశసారంలోనూ భేదం లేకపోతే 'మూలానుసారం' అనే అనుకున్నారు. మన సంప్రదాయంలో అనువాదకునికి ఉన్న స్వాతంత్ర్యం అపరిమితం అని చెప్పుకోవచ్చు. ప్రాచీనాంధ్ర సంప్రదాయంలో అనువాదం అంటే పునఃకథనం అనుకున్నారే కాని ప్రతి వాక్యాన్ని, శబ్దాన్ని అనువదించాలనుకోలేదు. ఇప్పుడు మనం అనుకునే communicative translation లాంటిదన్న మాట వాళ్లు చేసింది.

అనువాదం కష్టమైన వ్యాపారమని అందరూ ఒప్పుకుంటారు. కాని శ్రమకు తగిన ప్రతిఫలం కాని, కనీసపు గుర్తింపుకాని ఇయ్యటానికి ముందుకు రారు. ఒక అభిప్రాయాన్ని మౌలికంగా చెప్పటం ఎంత కష్టమో దాని సారు చెడకుండా మరో భాషలో చెప్పటం కూడా అంతే కష్టం. పూర్వం ఉదాహరించిన ఎర్రన పద్యంలో చెప్పినదాన్ని బట్టి ప్రాచీనులు అనువాదాన్ని 'సృష్టి' అనే భావించినట్టున్నారు.

అనువాదం వాణిజ్యమా ? వ్యాపారమా ? శాస్త్రమా ? కళా ? మొదలైన ప్రశ్నలడుగుతుంటారు, కచ్చితంగా ఏదో ఒకటి అయి ఉండాలన్న ఉద్దేశంతో. నిజానికిట్లాంటి విభజన చాలా చోట్ల కుదరదు. కళ అనుకున్న దాంట్లో శాస్త్రం ఉంటుంది. కళను శాస్త్రీయంగా పరిశీలించవచ్చు. శాస్త్రం ద్వారా కళా ప్రమాణాలను పెంచవచ్చు. ఉదాహరణకు కవిత్వం సృజన వ్యాపారమే. కాని కవితా కళకు వ్యుత్పత్తి, అభ్యాసాలు ప్రతిభతో పాటు అవసరం అని గుర్తించారు. ప్రతిభా లోపాన్ని వ్యుత్పత్తి ద్వారా పూరించవచ్చునని రాజశేఖరుడు అభిప్రాయ పడ్డాడు. ఆధునికులే కవిత్వాన్ని సద్యోజాతం (స్పాంటేనియస్) అనుకుంటున్నారు.

శాస్త్రానికీ కళకూ సరిపడదని కొందరనుకుంటారు. శాస్త్రకారులకు కళాదృక్పథం ఉండదని భ్రమ పడుతుంటారు. శాస్త్రం అనగానే 'dry' (రసరహితం) అని ఒక విశేషణం తగిలిస్తారు. భాషా శాస్త్రాన్ని అట్లా అనటం చాలా సార్లు విన్నాను. భాషాశాస్త్ర పరిశోధన

లోనూ, పరిశోధన ఫలితాలను ప్రకటించటంలోనూ ఎంత కళా దృష్టికి అవకాశం ఉందో అందులో మునిగిన వాళ్లకి తెలుసు. నిష్పాక్షికంగా ఆలోచించేవారికి అర్థమవుతుంది.

అనువాదం కూడా శాస్త్రమూ, కళా. సృజనాత్మకత ఎంత అవసరమో, శిక్షణ కూడా అంతే అవసరం. కథో, కవిత్వమో రాయటానికి ఒక భాషా స్వభావమూ, ఒక సంస్కృతీ తత్త్వమూ తెలిస్తే చాలు. అనువాదానికి రెండు భాషల గురించి, రెండు సంస్కృతుల గురించీ క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. అనువాద సామర్థ్యం పుట్టుకతో వచ్చేదిగా ఈ కాలంలో అనుకోటం సహేతుకం కాదు. ప్రతి విద్యకూ జన్మతః వచ్చే పురస్సాముఖ్యం (predesposition) కొంత అవసరం. అయినా శిక్షణ ద్వారా నేర్చుకోవలసింది చాలా ఉంటుంది. దేనిపాలు ఎంతో నిరూపించటానికి ఇంతవరకూ ఎవరూ పనిముట్టు కనిపెట్టలేదు.

అనువాదానికి అవసరమైన మూలశాస్త్రం భాషా శాస్త్రం. ఈ విషయాన్ని ప్రత్యేకంగా నిరూపించక్కర్లేదు. ఈ శాస్త్రంలో ఏ భాగం ఎక్కడ ఉపయోగిస్తుందో రేఖా మాత్రంగా గ్రహిద్దాం.

అసలు విషయంలోకి పోయే ముందు రెండు అవాంతర విషయాలను ముచ్చటించుకొని ముందుకు పోదాం.

సాధారణ సంభాషణ క్రమంలో 'ఈ అనువాదం బాగుంది, ఈ అనువాదం బాగా లేదు' అని వ్యాఖ్యానిస్తుంటాం. ఈ వ్యాఖ్యలు ఎక్కువ భాగం భాషకుల సొంత అభిరుచుల మీద ఆధారపడి ఉంటుంది. మంచి అనువాదం చెడ్డ అనువాదం అని వేరు చేసే ప్రమాణాలు ఏమీ లేవు. మరీ పనికి మాలిన అనువాదాన్ని మంచి అనువాదంతో పోల్చి చెప్పగలం. ఒక అనువాదం మంచి చెడ్డలు దాన్ని ఉద్దేశించిన ప్రయోజనాన్ని బట్టి ఉంటాయి. ఒక అనువాదాన్ని ప్రచారానికుద్దేశిస్తే ఒక రకంగా ఉంటుంది, పండితులకుద్దేశిస్తే మరో రకంగా ఉంటుంది. తెలిసిన వాళ్లకుద్దేశిస్తే ఒక రకం, తెలీని వాళ్లకైతే ఇంకో రకం! అంతే కాకుండా మూలభాషాంశాలను లక్ష్యభాషలో పెట్టేటప్పుడు అనువాద ప్రయోజనాన్ని బట్టి కొన్ని అంశాలకు అధిక ప్రాధాన్యం ఇవ్వాల్సి రావచ్చు. మూల భాషలో సారాంశాన్ని మాత్రమే ఒక అనువాదం అందిస్తే, మరొక అనువాదం విషయాన్ని కొంచెం వెనక్కి నెట్టి రచనా సౌందర్యానికి ప్రాధాన్యం ఇయ్యవచ్చు.

చాలా అనువాదాలకు కొన్ని బలమైన అంశాలతో పాటు కొన్ని బలహీనతలు కూడా ఉంటాయి. ఎంత మంచి అనువాదమైనా దాన్ని ఇంకా మంచి అనువాదంగా అభివృద్ధి చేసే

అవకాశం ఎప్పుడూ ఉంటుంది. దీన్ని గురించి ఇంతగా చెప్పటం ఎందుకంటే అనువాదాల మీద తీర్పులు చెప్పేటప్పుడు కొంత నిగ్రహాన్ని పాటించాల్సిన అవసరాన్ని తెలియ జేయటానికే.

నేను ప్రస్తావించదల్చుకున్న మరో అంశం అనువాద వృత్తిలో కష్టాలను గురించిన ఒక పిట్ట కథ. ఈ కథను (Lana castellano) లానా కాస్టెలానో అనే ఆవిడ చెప్పింది. ఆ కథ వినండి :

Let me propose a life path; grand parents of different nationalities, a good school education in which you learn to read, write, spell, construe and love your own language. Then roam the world, make friends and see friends. Go back to education but to take a technical or commercial degree, not a language degree. Spend the rest of your twenties and early thirties in the countries, whose language you speak working in industry or, commerce but not directly in languages never marry into your nationality. Have your children, then back to post-graduate translation course. A staff job as a translation and then a free lance by which time your are forty and ready to begin."

అనువాదం ఎంత కష్టతరమో, అనువాద వృత్తికి ఎంత అనుభవం అవసరమో చెప్పటమే ఆమె ఉద్దేశం.

ఇక అనువాదాన్ని గురించి : అనువాదం అంటే ఒక భాషలో సమాచారాన్ని ఇంకో భాషలో అందించటం అని పూర్వం చెప్పుకున్నాం. ప్రధానంగా ఈ సమాచారం అర్థ సంబంధి. కాని ఒక భాషలో పేర్లు మరో భాషలో మార్చటం కుదరదు. అప్పుడు రాసే భాషలో కొన్ని రకాల లేఖన సమస్యలు వస్తాయా ? ఒక భాషలో లిపికీ ధ్వనికీ ఉండే సంబంధం ఆ భాషా సంప్రదాయాలను బట్టి ఉంటుంది. యూరపియన్ భాషల్లో లిపికీ ధ్వనికీ అంత దగ్గరి సంబంధం ఉండదు. ఉదాహరణకు ఒకనాటి ఫ్రాన్సు అధ్యక్షుడు Francois Mitterand. ఈ పేరును తెలుగు పత్రికల వారు ఫ్రాంకోయిస్ మిట్టెరాండ్ అని రాశారు. ఉచ్చారణకు అంతో ఇంతో సన్నిహితంగా రాయాలంటే ఫ్రాన్స్వా మితేరోc అని రాయాలి. శ్రీ శ్రీ గారు రెక్కవిప్పిన రివల్యూషన్ అనే అనువాద గ్రంథంలో Place de la sorbonne అనే ఫ్రెంచి మాటను ప్లేస్ డీలా సోర్బాన్ అని తెలుగు లిపిలో రాశారు.

దాన్ని ఫ్రెంచి ఉచ్చారణకు సన్నిహితంగా రాయాలంటే ప్లాస్ ద లా సోర్‌బోన్ అని రాయాలి. అట్లాగే ఇంగ్లీషు మాటల్ని తెలుగులో రాసేటప్పుడు కూడా ఈ రకమైన సమస్యలు చాలా వస్తాయి. అయితే ఈ సమస్యలు ముఖ్య సమాచార గ్రహణకు ఆటంకాలు కావు కానీ ఆ భాషలు తెలిసిన వాళ్లు వీటిని గురించి అనువాదకుడిని అడిగే అవకాశం ఉంది. పదజాలంలో తత్సమ తద్భవ విభాగం సంస్కృత విషయంలో పరిష్కరించింది.

సాధారణంగా అనువాదంలో మొదటగా ఇబ్బంది పడేది మూలభాషలో పదాలకు లక్ష్య భాషలో సమానార్థక శబ్దాలు దొరక్క.అంటే లక్ష్య భాషా సమాజంలో ఆ అలవాటు, దానికి తగిన మాట ఉండవన్నమాట ! ఇంగ్లీషులో privacy అనే మాటకు తెలుగులో సరైన సమానార్థక పదం దొరకటం కష్టం. అట్లాగే *ఎంగిలి* అనే తెలుగు మాటకు ఇంగ్లీషులో సమాన పదం దొరకటం కష్టం. ఒక్కోసారి మూలభాషలో ఒక్కోమాటకు కొండంత అర్థం నిక్షిప్తమై ఉంటుంది. లక్ష్య భాషలో దాన్ని విస్తరించాలంటే ఒకపెద్ద వాక్యమే రాయాల్సి వస్తుంది. బ్రజీలియన్ పోర్చుగీస్‌లో aruagao అనే మాటకు ఇంగ్లీషులో అర్థం చెపితే cleaning the ground under coffee trees of rubbish and piling it in the middle of row in order to aid in the recovery of the beams dropped during harvesting. అట్లాగే తెలుగులో *కళ్లం చెయ్యటం, కల్లాపి చల్లటం* అనే మాటల్ని ఇంగ్లీషులో చెప్పాలంటే ఈ రకం కష్టమే ఎదురవుతుంది. *మడిగట్టుకొని* వంట చేసింది' అనే మాట తెలుగులో చాలా తేలికగా కనిపిస్తుంది కాని ఇంగ్లీషులో చెప్పాలంటే చాలా శ్రమ పడాలి.

ఒక్కోభాషలో కొన్ని కొన్ని సంఘటనలను పరమ సూక్ష్మంగా విశ్లేషిస్తారు. మరి కొన్నిటిని కలిపేస్తారు. 'బహాసా ఇండొనేసియా' లో Kehujanau అంటే వాన కురుస్తుందని తెలియక బయటకు వెళ్లడం, hujan hujahan అంటే వాన కురుస్తుందని తెలిసీ బయటకు వెళ్లడం. ఇట్లా రకరకాల సంఘటనలను ఆయా భాషలు వ్యక్తం చేసే తీరులో అనేక భేదాలు అనువాదకులను చిక్కుపెడు తుంటాయి. తెలుగులో *పాకటం, కుందటం, దేకటం* వంటి భిన్న గతి క్రియలున్నాయి. కొన్ని భాషల్లో ఇవి కనిపించవు.

ఈ రకపు సమస్యలు శాస్త్రానువాదాల్లో ఎక్కువగా వస్తాయి. ఏ శాస్త్రంలో అయినా పరిభాష అని ఒకటి ఉంటుంది. అది చేసే పని ఏమిటంటే విస్తృతమైన అర్థాన్ని పదపరిమితి లో సూచించటం. ఆ అర్థం అవసరమైనప్పుడల్లా ఈ పదం ఉపయోగించవచ్చు. పరిభాషా పదాలను పదానువాదం చేస్తే ఆ అర్థం లక్ష్యభాషలో స్ఫురించక పోవచ్చు. ఉదాహరణకు

భాషా శాస్త్రంలో జనరేటివ్ గ్రామర్ (Generative grammar) అనే మాట ఉంది. మనిషి మేధాబలంతో నిమిత్తం లేకుండా ఒక భాషలో అన్నవీ విన్నవీ మాత్రమే కాక అనటానికీ వినటానికీ సాధ్యమైన సర్వవాక్య సంచయాన్ని వ్యాకరించే సాధనం - ఈ మాటను తెలుగులో ఏదో ఒక సమానార్థక పదాన్ని వెతికి పట్టుకోటం ద్వారా సాధించలేం. తెలుగు అకాడమీ వారి పద పట్టికలో ఈ మాటను వికాసక వ్యాకరణమన్నారు. ఇట్లాంటి మాటలు శాస్త్రానువాదాల్లో పంటికింద రాళ్లలా తగులుతుంటాయి.

శాస్త్రానువాదాల్లో కేవలం పదం, దాని అర్థస్ఫురణే కాక ఆ పదం ఇతర పరిభాషా పదాలతో భేదించే పద్ధతి కూడా పరిగణనలోకి తీసుకోవాలి. ఉదాహరణకు భాషా శాస్త్రంలో deep structure అనే మాటను అనువదించేటప్పుడు surface structure అనే మాటను ఎట్లా అనువదిస్తామో చూసుకోవాలి. ఈ మాటల మధ్య అర్థ సంబంధమే కాదు, శబ్ద సంబంధమైన తూగు (balance) కూడా చూసుకోవాలి. ఒకటి వాడినప్పుడు ఇంకోటి స్ఫురించేలా ఉండాలి. పై మాటలకు తెలుగులో గుప్త నిర్మాణం, వ్యక్త నిర్మాణం వాడుకలో ఉన్నాయి. అట్లాగే competence, performance అనే మాటలకు ప్రతిభ, ప్రవృత్తి అనే మాటలు అమలులో ఉన్నాయి. ఈ జంట మాటలకు అర్థంలో వైరుధ్యం, రూపంలో సారూప్యం ఉన్నాయి. అర్థం ప్రయోగ యోగ్యతను కలిగిస్తే రూప సారూప్యం పరస్పర స్ఫూర్తికి దోహదం చేస్తున్నది.

ఒక భాషలో ఒక రకపు ప్రయోజనమున్న వస్తు సముదాయాన్ని సూచించటానికి ఒక మాట, ఆ వర్గంలో వేరువేరు వస్తువులను సూచించటానికి విడివిడిమాటలు ఉంటాయి. లక్ష్యభాషలో అట్లాంటి మాటలు దొరక్క అనువాదకుడు ఇబ్బంది పడవచ్చు. సంస్కృతంలో రకరకాల ప్రత్యయాలకు, ప్రకృతులకు వేరేవేరు పేర్లున్నాయి. ఇట్లాంటి అర్థబోధక కనిష్ఠ భాషాంశాన్ని భాషాశాస్త్రంలో మార్ఫీమ్ (morpheme) అంటారు. దానికి సమానార్థం దొరక్క భద్రిరాజు కృష్ణమూర్తిగారు 'పదాంశం' అనీ, పి. ఎస్. సుబ్రహ్మణ్యం గారు 'శబ్దం' అనీ వాడుతున్నారు. భౌతిక ప్రపంచంలో జరిగే సంఘటనలను ఒక్కో భాషావ్యవహర్తలు ఒక్కోరకంగా గ్రహిస్తారు. ఒకచోటు నుంచి ఇంకో చోటుకు పోవటాన్ని, ఆ చోటుకీ వ్యవహర్త (వక్తి, శ్రోత) కీ సంబంధం లేకుండా ఇంగ్లీషులో go అనే క్రియను వాడతారు. తెలుగులో go కి పోవు, సమానార్థకం. అయితే తెలుగులో ఒక్కోసారి పోవుకు బదులు come కు సమానార్థకమైన 'వచ్చు' ను వాడతారు. అంటే ఇంగ్లీషులో go, come అనే క్రియలకు పోవు, వచ్చు అనే క్రియలు క్రమంగా

సమానార్థకాలైనా ప్రయోగంలో భేదాలున్నాయి. అనువాదంలో నిఘంటువులు మాత్రమే చాలవని, పదాల ప్రయోగరీతులను కూడా అధ్యయనం చేయాలని తెలుస్తుంది.

ఒక్కోసారి ఒక భాషలో పదాన్ని ఇంకో భాషలో అనువాదం చేసేటప్పుడు ఆ భాషలో మూలంలో ఉద్దేశించని విశేషార్థం వస్తుంది. ఉదాహరణకు ఇంగ్లీషులో extra marital relationship అన్న మాటలో విలువలకు సంబంధించిన తీర్పు ఏమీ లేదు. దానికి తెలుగులో అక్రమ సంబంధం అని వాడుతున్నారు. ఈ మాట రాగద్వేష రహితమైనదేమీ కాదు. అదేదో తప్పు అన్న తీర్పు కూడా ఉంది. ఇటీవలి కాలంలో ఇంగ్లీషులో చాలా మాటలను వ్యక్తిగతమైన అభిప్రాయంతో ప్రమేయం లేకుండా తటస్థంగా ఏర్పరిచే పద్ధతి ఒకటి అమలులో ఉంది. తెలుగులో ఆ పద్ధతి బాగా వ్యాప్తి కాలేదు. ఉదాహరణకు ఇంగ్లీషు sex worker అనేమాట అర్థం విషయంలో తటస్థమైనది. దాన్నే తెలుగులో వేశ్య అని అనువదిస్తే ఆ మాట చుట్టూ విషవాయువులు వీస్తాయి.

భాషలన్నిటికీ ఒకే రకమైన పదనిర్మాణ సామర్థ్యం ఉండదు. ఇంగ్లీషు వంటి భాషల్లో నామాల నుంచి క్రియలను నిష్పన్నం చేయడం చాలా తేలిక. నిజానికేమీ చెయ్యక్కర్లేదు. క్రియా సాధక ప్రత్యయాలు చేరిస్తే చాలు. తెలుగులో అట్లాంటి సౌకర్యం లేదు. ఏ నామానికి ఏ ప్రత్యయం చేర్చటం వల్ల ఏ అర్థం వస్తుందో సూత్రబద్ధంగా చెప్పలేము. ఉదాహరణకు *సంతోషించు* అనే క్రియ *సంతోషం* అనే నామానికి ఇంచు చేర్చటం వల్ల వచ్చింది. అన్ని నామాలకు ఇంచు చేర్చలేము. *ప్రశ్నించు* ఉందిగాని *సమాధానం ఇచ్చు* అనే అర్థంలో *ఉత్తరించు* లేదు. పోతనగారి భాగవతంలో *మానసించు* అనే క్రియ ఉంది. కాని అదే అర్థంలో *హృదయించు* అనే మాట ఎక్కడా కనపడదు. ఈ పరిమితి భాషా వ్యక్తీకరణ శక్తిని కుంటు పరుస్తుంది.

ఒక్కోసారి మాటలకు విడివిడిగా నిశ్చితమైన నిఘంట్వర్థాలున్నప్పటికీ సంయోజనలో నిశ్చితత్వం కుదరదు. అనువాదంలో ఉదాహరణకు ఈ మాటలను తెలుగులో అనువదించి చూడండి - dry cow ఒట్టిపోయిన ఆవు, dry bread ఎండురొట్టె dry wine తీపిలేని మధువు, dry sound రణగొణ ధ్వని, dry voice అనార్ద్ర స్వరం, dry country మెట్టపల్లె, dry book అనాసక్తికర పుస్తకం, dry humour పేలవ హాస్యం, dry అనే ఇంగ్లీషు మాటకు సందర్భానుసారంగా విశేషార్థాలు వచ్చాయి. అనువాదంలో ఈ పద స్థైర్యం కుదరదు.

అనువాదంలో ఎప్పుడూ రెండు విరుద్ధ లక్ష్యాల మధ్య సంఘర్షణ ఉంటుంది. అనువాదం మూల భాషానుసారంగా ఉండాలంటే లక్ష్యభాషలో ఎబ్బెట్టుగా ఉండే భాషా నిర్మాణాల సంఖ్య పెరుగుతుంది. అనువాదం లక్ష్యభాషలో సహజంగా ఉండాలంటే మూల భావ స్వచ్ఛతకు భంగం కలుగుతుంది. దీనికి అనువాదకుని భాషాలక్షణ పరిజ్ఞాన పరిమితి మాత్రమే కాదు. భాషా లక్షణ వైషమ్యం కూడా కారణమే.

అనువాదంలో లక్ష్యభాష సహజంగా ఉండాలంటే మూలభావంలో కొంత త్యాగం చేయవలసి ఉంటుంది. మూలభావానికి పూర్తి విధేయంగా ఉండాలంటే లక్ష్య భాషా సహజత్వాన్ని త్యాగం చేయాలి. ఏదో ఒక త్యాగం తప్పేట్టు లేదు. హైదరాబాద్ బుక్ ట్రస్టు ప్రకటించిన Alex Hailey రచన The Roots కు 'ఏడుతరాలు' అనువాదం విపరీతంగా అమ్ముడు పోయింది. దానికి కారణం అనువాదంలోని భాషాశైలి. అదే రచయిత కొన్ని చరిత్ర గ్రంథాలు అనువదించాడు. అవీ బాగానే అమ్ముడు పోయాయి. కాని చరిత్ర గ్రంథాల్లో వాస్తవికత అనువాద శైలిలో కొంత కొట్టుకు పోయింది.

William Carr రచించిన What is history అనే గ్రంథాన్ని వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారు మూలవిధేయంగా అనువదించారు. తెలుగు వచన రచన శైలి కొరుకుడు పడక ఆ పుస్తకం చదవటానికి సాధారణ పాఠకులు ఇబ్బంది పడ్డారు. సాహిత్య గ్రంథాలకు వస్తు నిర్దిష్టత దెబ్బతిన్నా ఫరవాలేదు గాని చరిత్రశాస్త్ర, చరిత్ర గ్రంథాల్లో త్యాగం చెయ్యాల్సి వస్తే శైలినే త్యాగం చెయ్యాలి కాని వస్తువును కాదు.

అనువాదంలో అందరినీ ఇబ్బంది పెట్టేవి నుడికారాలు, జాతీయాలు. ఇవి చాలా భాషా, సంస్కృతీ బద్ధాలు (language and culture ) వీటికి భాషాంతరనువద నీయత (inter translatability ) ఉండదు.

జాతీయాలు పదసంయోజనాలవల్ల ఏర్పడతాయి. పదైక దేశానికి , పదసంయోజనకూ సంబంధం ఉండీ లేనట్టుంటుంది. సాహిత్య గంధి రచనలకు ఇవి సౌందర్యా పాదకాలు. ఇవి అనువాదానికి లొంగవు. కొన్ని ఉదాహరణలు చూడండి.

ఇంగ్లీషులో to drain the radiator అంటే దూరప్రయాణాలు చేసేటప్పుడు పెట్రోలు స్టేషనులోమూత్రశాలకు వెళ్లటం. Pull the leg అంటే అవతలి వాళ్లను ఆటపట్టించటం, take one for a ride అంటే ఎదుటి వాళ్ల ఇష్టాఇష్టాలను పట్టించుకోకుండా వాళ్లకు సంబంధించిన నిర్ణయాలు చెయ్యటం , ఇంగ్లీషు వాళ్లు ఉత్తరాలు ముగించేటప్పుడు కొన్ని సంప్రదాయాలు పాటిస్తారు. పరిమిత సంబంధాలున్న వారికి రాసే ఉత్తరాన్ని yours

faithfully అని ముగిస్తారు. వ్యాపార లేఖలను yours truly అని ముగిస్తారు. మైత్రీ లేఖల్లో yours sincerely అని కనిపిస్తుంది. ప్రేయసీప్రియుల లేఖలో ఒక నిర్దిష్ట సంప్రదాయం ఉండదు. తెలుగులో ఇద్దరు వ్యక్తులమధ్యన లింగభేధాల్ని బట్టి ఉత్తరాల ఆద్యంతాలు ఉంటాయి. ఉత్తరం చివర పెద్దవాళ్లకైతే *చిత్తగించవలెను* అనీ చిన్నవాళ్లకైతే *గ్రహించవలెను* అంటారు. బ్రాహ్మల్లో ఇవి శాఖా బేధాల్ని బట్టి కూడా మారతాయి. వైదికుల్లో పెద్దవారిని *బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన* - అనీ , నియోగుల్లో *మహారాజరాజశ్రీ* - అనీ ఉత్తరాలు ప్రారంభిస్తారు. అదీ మగ వాళ్లకైతేనే. ఆడవాళ్లకి మళ్లీ వేరే ఉంటాయి. ముత్తైదువులను సంబోధించేటపుడు *మహాలక్ష్మీ సమానురాలయిన* అనీ, వితంతువుల్ని సంబోధించేటప్పుడు *గంగాభాగీరథీ సమానురాలయిన* అనీ, ప్రారంభిస్తారు. ఇవి చాలావరకు మాయమైపోతున్నాయి. కాని సాహిత్యంలో అక్కడక్కడా వీటి అవశేషాలుంటాయి. శ్రీశ్రీ ఒక సారి ఒక ఎన్నికల సందర్భంలో '*గంగాభాగీరథీ సమానురాలయిన కాంగ్రెసుకు ఎంత పెందరాళే ఉద్వాసన చెప్తే అంతమంచిది* అన్నారు'.

కొన్ని జాతీయాలు ఇతర భాషల్లోకి అనూదితాలయి ఆభాషల్లో కలిసిపోయిన సందర్భాలు లేక పోలేదు. ఇంగ్లీషులో crocodile tears తెలుగులో *మొసలి కన్నీళ్లుగా* కలిసిపోయింది. ఇంగ్లీషులో may his soul rest in peace అనే ప్రయోగం తెలుగు వారి సంతాప సభల్లో *ఆత్మ శాంతికి ప్రార్థించటంగా* అలవాటయిపోయింది. అయితే కొత్తగా చేసేవి ఇట్లా ఇమడవు. శ్రీశ్రీ గారి ( 1967 ఫ్రెంచి విప్లవాన్ని గురించి వచ్చిన) రెక్కవిప్పిన రివ్యూల్యూషన్ అనే అనువాద గ్రంథంలో wild cat strikes అనే నుడికారాన్ని అడవి పిల్లి సమ్మెలు అని అనువదించారు. ముందస్తు నోటీసు లేకుండా చేసే సమ్మె అనే అర్థం. ఈ మాటకు ఇంగ్లీషులో ఉన్నట్టు తెలుగులో రాదు. అదే పుస్తకంలో - Dean Roche is also a shit అనే వాక్యంలో shit అనే మాటను 'అశుద్ధం ' అని అనువదించారు. '*పెంటవెధవ*' అంటే ఇంగ్లీషులోని తీవ్రత తెలుగులో వచ్చేది.

అట్లాగే కొన్ని భాషల్లో సూక్తుల్లాంటి వాక్యాలేర్పడతాయి. వాటిని యథాతథంగా అనువదిస్తే మూలార్థం స్పష్టపడదు. పైన పేర్కొన్న పుస్తకంలోనే శ్రీశ్రీ గారు Medium is the message అనే ఆంగ్లసూక్తిని సాధనమే సందేశం అని అనువదించారు. ఇంగ్లీషులో ఉద్దేశించిన అర్థం తెలుగులో వచ్చినట్టులేదు. సాహిత్యానువాదంలో (వచనమైనా, కవిత్వమైనా) ఈ చిక్కు ఎప్పుడూ ఉంటుంది. భాషల మధ్య వ్యాకరణ భేదాలు కూడా అనువాదంలో క్లేశాన్ని కలిగించేవే. ఇంగ్లీషు క్రియల్లో కొద్దిగా పురుష భేదం, కొంచెం

వచన భేదం చూపించాలి. లింగ భేదం లేదు. తెలుగులో ఇంగ్లీషు కన్నా ఎక్కువగా పురుష, లింగ వచన భేదాలన్నీ చూపించాలి. తెలుగులో ఏకోదరుల మధ్య వయోభేదం చూపిస్తారు. ఇవికాక వక్తృశ్రోతల మధ్య వయోభేదాన్ని అంతస్థుల భేదాన్ని బట్టి సంబోధన ఉంటుంది. అంతస్థుల భేదం క్రియల్లోకూడా చూపించాల్సి ఉంటుంది. ఇంగ్లీషులో అట్లాంటి అవసరం లేదు. తెలుగులో కూడా ఇటీవల ప్రజాస్వామీకరణ (democratization) ప్రభావం వల్ల అంతస్థుల భేదాలు తగ్గిపోతున్నాయి.

ఇంగ్లీషులో ఉన్నన్ని కాల బోధభేదాలు (tense differences) తెలుగులో లేవు. ఇంగ్లీషులో present perfect and past perfect అనే కాల బోధ భేదాలు తెలుగులో లేవు. తెలుగులో కాల బోధ చాలా సరళమైనది. సంస్కృతంలో ఇవి దశ విధ లకారాలుగా విభక్త మయ్యాయి. ఇంగ్లీషులో reflexive కేవల వాక్య నిర్మాణ గతమైనది. అందుకు సమానంగా తెలుగులో వాడే 'కొను'కు అర్థచ్ఛాయాభేదాలు ఎక్కువ. తెలుగులో చేయు,చేసుకొను, చేసి పెట్టు, అనే క్రియరూపాల మధ్య ఉన్న ధాత్వర్థ-స్వార్థ-పరార్థ భేదాలను అంత సులువుగా ఇంగ్లీషులోకి తీసుకురాలేము. ఇంగ్లీషును subject oriented language అంటారు. అంటే అవసరం ఉన్నా లేకపోయినా వాక్యంలో subject ఉండాలి. I caught cold, I feel hungry, I am thirsty, I have a degree వంటి వాక్యాలకు ఇంగ్లీషులో subject ప్రధానం. తెలుగులో కర్త లేకుండా విషయి-విషయం (topic - comment) అనే పద్ధతిలో చెపుతాం. ఈ రకమైన వాక్యాల్లో ఏ వాక్యానికావాక్యం అనువదించుటలో క్లేశం లేకపోయినా వాక్య సన్నివేశంలో కొన్ని చిక్కులు వస్తాయి.

భాషల మధ్యన వాక్యనిర్మాణ భేదాలు ఒక ఎత్తు, వాటి ప్రయోగ భేదాలు మరో ఎత్తు. భాషల్లో చాలా వాక్య నిర్మాణాల్లో సమానత ఉంది. అయితే ప్రయోగాల్లో భేదం ఉంది.

తెలుగులో రెండు రకాల సంబంధ బోధక వాక్య నిర్మాణాలు (relative clauses) ఉన్నాయి. ఒకటి యత్తదర్థక నిర్మాణం (correlative clause) ఇంకొకటి ధాతుజ విశేషణ నిర్మాణం (phrasal relative). మొదటిది విస్తృతమైనది. రెండోది పరిమితమైనది. ధాతుజ విశేషణ ప్రక్రియలో సాధ్యం కానివి కూడా యత్తదర్థక నిర్మాణంలో సాధ్యం అవుతాయి. ఒకే అర్థంలో రెండు రకాలూ సాధ్యమైనా - అంటే రెండు నిర్మాణాలూ సమానార్థకాలైనా సమ ప్రయోగార్హాలు కావు. ఉన్నత భావవ్యక్తీకరణకు (higher cultural contexts) లో యత్తదర్థకం ప్రయుక్తమవుతుంది. సాధారణ సందర్భాల్లో 'యత్తదర్థకం

హాస్యాస్పదంగా ఉంటుంది. ఉదాహరణకు ఈ కింది వాక్యాలను పోల్చి చూడండి.

1. ఏ స్వాతంత్ర్యం కోసం మన నాయకులు అశేష త్యాగాలు చేశారో ఆ స్వాతంత్ర్యం ఇప్పుడు లేదు.
2. ఏ పట్టుచీర కంజీవరంలో కొన్నానో ఆ పట్టుచీర చినిగిపోయింది.
3. నేను కంజీవరంలో కొన్న పట్టుచీర చినిగి పోయింది.

పై వాక్యాల్లో రెండోది వింతగా కనపడుతుంది. అనువాదకుడు ఈ ప్రయోగ యోగ్యత తెలుసుకోక పోతే అనువాదం అపహాస్యం పాలయ్యే ప్రమాదం ఉంది.

తెలుగు భాషా వ్యవహారంలో వాక్యాదిన మరే, అవునూ, కాదూ అంటే వంటి మాటలుపయోగిస్తారు. సంభాషణ ప్రారంభ సూచకాలుగా తప్ప వీటికి వేరే అర్థం లేదు. వీటిని discourse markers గా గుర్తించటం తప్ప వాటికి శబ్దానువాదం చేస్తే ఎబ్బెట్టుగానూ, సందర్భరహితంగానూ ఉంటుంది.

ఒక్కో వాక్య పద్ధతికి ఒక్కో భాష రకరకాల ప్రయోజనాలు (functions) కల్పించు కుంటుంది. కర్మణి వాక్యాలు అనేక భాషల్లో చిత్రాతి చిత్రమైన ప్రయోజనాలను నిర్వహించటం చూస్తాం. కారణమేమో తెలీదు కాని చాలా భాషల కన్నా ఇంగ్లీషులో ఈ వాక్యాల ప్రయోగం ఎక్కువ, మరీ ముఖ్యంగా శాస్త్ర గ్రంథాలలో వీటి ప్రయోజనమూ, ప్రయోగమూ ఎక్కువగా కనిపిస్తాయి. ఫ్రెంచి, రష్యన్ భాషల్లో వీటి ప్రయోగం తక్కువ. కొన్నిచోట్ల ఇతర భాషల్లో కర్మణి లేని వాక్యాల్ని అనువదించేటప్పుడు ఇంగ్లీషులో కర్మణి వాక్యాలు వాడాల్సి వస్తుంది. ఫ్రెంచిలో on-parle anglais అనే ప్రయోగానికి సరైన నిర్మాణం ఇంగ్లీషులో one speaks English there. కాని సందర్భయోగ్యమైన పద్ధతి English is spoken there అని అనటం.

యానా (yana) అనే అమెరికన్ ఇండియన్ భాషలో కర్త ప్రథమ పురుషలో ఉండి కర్మ ఉత్తమ మధ్యమ పురుషల్లో ఒకటైతే కర్మణి వాక్యాలు కచ్చితంగా వాడాలట. Tjolobal అనే మెక్సికన్ భాషలో సాధారణ వ్యవహారంలోనే కర్మణి వాక్యాలు ఎక్కువ వాడతారు. కొన్ని నైలోటిక్ భాషల్లో అకర్మక క్రియలతో కూడా కర్మణి వాక్య పద్ధతి ఉంది. ఇదే పద్ధతి సంస్కృతంలోనూ, హిందీలోనూ కనిపిస్తుంది.

పెరూలో అగ్వారునా అనే భాషలో రచన ఆద్యంతాల్లో కర్మణి వాక్యాలు వాడతారు. చైనీస్, జాపనీస్, వియత్నమీస్, తాయి భాషల్లో అనిష్ట సంఘటనలకు, కర్మణి వాక్యాలు

వాడాలి. అకర్మక క్రియలకైనా ఈ సందర్భంలో కర్మణి ప్రయోగాలు చెయ్యాలి. నేను వానలో తడిశాను అనడు, తడవబడ్డాను అనాలి. జాపనీస్‌లో మానాన్న చనిపోయాడు అనగూడదు. మా నాన్న చావబడ్డాడు అనాలట ! I was died on by my father అనాలి. అంటే బహుశా మా నాన్న చావు భారం నాపై బడింది అన్న అర్థం కావచ్చు. వాక్య నిర్మాణమే చాలదు. అనువాదంలో మూల లక్ష్యభాషలలో వాక్యాల ప్రయోగ యోగ్యత కూడా చూసుకోవాలి అన్నమాట.

ఇంతవరకు పదవాక్య నిర్మాణ ప్రయోగ యోగ్యతలను గురించి చర్చించుకొన్నాం. ఒక విషయాన్ని గూర్చి కూర్చిన వాక్య సముదాయాన్ని మన ప్రాచీనులు మహా వాక్యం అన్నారు. దాన్నే ఇటీవలి భాషా శాస్త్రజ్ఞులు వ్యవహార ఖండిక అనీ వాచకం అనీ, గ్రంథం అనీ అంటున్నారు. ఇంగ్లీషులో text అనే మాట ఈ అర్థంలో వాడుకలో ఉంది. తెలుగులో ప్రస్తుతానికి గ్రంథం అనే మాట వాడుకుందాం. ఈ గ్రంథం మౌఖికమూ కావచ్చు, లిఖితమూ (అచ్చు) కావచ్చు. ప్రాచీన మత గ్రంథాలు బహుశా ఖండ ఖండాలుగా మౌఖిక ప్రసారంలోనే బహుకాలం ఉండి తరువాత లిఖిత రూపం పొంది ఉండవచ్చు. రామాయణ, భారతాలు బహుకాలం మౌఖికంగానే ఉండి తరవాత లిఖిత స్థితిని పొంది ఉండవచ్చు. మూలగ్రంథం భాష మౌఖిక స్థితిలో ఉండి అనువాదం చదువుకొనే వారికి చేస్తే లిఖిత భాషలోకి చెయ్యవలసి ఉంటుంది. ఇది వ్యావహారిక, గ్రాంథిక భాషల వ్యవహారం కంటె భిన్నమైనది.

మౌఖిక భాష అంటే మాట్లాడే భాష. లిఖిత భాష అంటే రాసే భాష. మూల గ్రంథం మౌఖిక భాషలో ఉంటే అందులో శైలి విస్తృత పద్ధతి (elaborate style) లో ఉంటుంది. పునరుక్తులు దండిగా ఉంటాయి. మౌఖిక భాషకు ప్రత్యేకమైన మరికొన్ని లక్షణాలు కూడా ఉంటాయి. అనువాదకుడు ఇట్లాంటి వాటిని 'ఎడిట్' చేసుకోవాలి. దువ్వూరి రామిరెడ్డిగారి ఉమర్ ఖయ్యాం రుబాయతులను పారశీకం నుంచి తెలుగులోకి అనువదించారు. అనువాదంలో పునరుక్తులను ఎడిట్ చేసుకున్నానని రామిరెడ్డిగారు చెప్పుకున్నారు. మూల విధేయంగా రచించిన వివిధానువాదాల కన్నా రామిరెడ్డిగారు 'పానశాల' పేరుతో అనువదించిన రుబాయిలకే ఎక్కువ ప్రశస్తి ఉంది. మూల విధేయంగా బూర్గుల రామకృష్ణరావు, ఉమరాలీషా కవి వంటి వారు అనువదించారు.

ఇటీవల తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్ వారు మూడవసారి (1994) చేసిన దివ్య ఖురాన్ ముద్రణలో ఉర్దూ అనువాదకులు అబు ఆలా ఆ పుస్తకంలో అనువాద సమస్యలను పీఠికలో (1971 ఏప్రిల్ 4) చర్చించారు. అందులో సరిగ్గా ఈ సమస్యనే చర్చించారు. అరబ్బీ మౌఖిక భాషలో ఉన్న మూలగ్రంథాన్ని ఉర్దూ లిఖిత భాషలోకి మార్చవలసిన

అవసరాన్ని గురించి, అందుకు తీసుకున్న చర్యలను గురించీ వివరించారు. అనువాద విధానంలో కొత్త సమస్యను ప్రస్తావించారు. అనువాదకులు, భాషా వేత్తలు ఆలోచించాల్సిన అంశాలున్నాయి గనుక, కొంచెం దీర్ఘమైనా ఇక్కడ ఉట్టంకిస్తాను.

''శబ్దానువాదం ప్రభావం చూపలేకపోవటానికి మరొక ముఖ్యకారణం, ఖురాను ప్రవచనరీతి, రచనాత్మకం కాకుండా ప్రసంగాత్మకం కావటమే. ప్రసంగ భాషను రచనా భాషలోనికి మార్చకుండా యథాతథంగా అనువదించినట్లయితే మొత్తం రచన పొంతన లేనిదై పోతుంది. ప్రారంభంలో ఖురాను లిఖిత పుస్తకరూపంలో వెలువడలేదు. కాని ఇస్లామ్ సందేశ ప్రచారం జరిగేటప్పుడు సందర్భాన్ని బట్టీ, అవసరాన్ని బట్టీ ఒక ప్రసంగం మహా ప్రవక్త (సఅసమ్) పై అవతరింపజెయ్యబడేది. ఆయన దానిని ప్రబోధరూపంలో ప్రజలకు వినిపించేవారు. ఈ విషయం అందరికీ తెలిసిందే. ప్రసంగ భాషకూ రచనా భాషకూ మధ్య సహజంగానే పెద్ద వ్యత్యాసం ఉంటుంది. ఉదాహరణకు, రచనలో ఒక సందేహాన్ని ప్రకటించి దానిని నివృత్తి చేయటం జరుగుతుంది. కాని ప్రసంగంలో స్వయంగా అనుమానం వెలిబుచ్చేవారు ఎదుటనే ఉంటారు. ఇందువల్ల ''ప్రజలు ఇలా అంటారు'' అని మాటిమాటికీ చెప్పే అవసరమే ఉండదు. అయితే ప్రసంగకర్త మొదట్లోనే వారి అనుమానానికి జవాబుగా ఉండే ఒకే ఒక వాక్యాన్ని చెప్పేస్తాడు. రచనలో విషయక్రమానికి భిన్నమైనదే అయినా దానితో సమీప సంబంధం ఉన్నమాట చెప్పవలసివస్తే అది అవాంతర వాక్యంగా ఏదో విధంగా విషయం నుండి వేరు చేయబడి వాక్కు యొక్క పొందిక చెడ కుండా వ్రాయబడుతుంది. కాని ప్రసంగంలో కేవలం కంఠస్వరాన్నీ ఉపన్యాస ధోరణినీ మార్చి వక్త పెద్ద పెద్ద అవాంతర వాక్యాలు చెపుతూపోతాడు; అయినా పొందిక లేదు అని అనిపించదు. రచనలో విషయాన్ని పరిసరాలతో అన్వయించటానికి పదాల సాయం తీసుకోవలసి ఉంటుంది. కాని ప్రసంగంలో స్వయంగా పరిసరాలే విషయంతో తమ సంబంధాన్ని అన్వయించుకుంటాయి. పరిసరాలను సూచించకుండా చెప్పబడే మాటల మధ్య, లోటు ఉన్నట్లు తోచదు. ప్రసంగంలో సంబోధించేవాడూ సంబోధింపబడేవాడూ మాటిమాటికీ మారుతూ ఉంటారు. వక్త తన ఉపన్యాసంలో సమయ సందర్భాలను బట్టి ఒకప్పుడు ఒకే వర్గాన్ని ప్రథమ పురుషలో ప్రస్తావిస్తాడు. మరొకప్పుడు అదే వర్గాన్ని ఎదుట ఉన్నట్లు భావించి మధ్యమ పురుషలో సంబోధిస్తాడు. ఒకప్పుడు ఏకవచనం ప్రయోగిస్తాడు. ఒకప్పుడు తానే స్వయంగా ఉత్తమ పురుష అవుతాడు. మరొకప్పుడు ఒక వర్గం తరపున మాట్లాడుతాడు. ఒకప్పుడు ఒక అతీతశక్తికి ప్రాతినిధ్యం వహిస్తాడు. మరొకప్పుడు ఆ అతీతశక్తి స్వయంగా అతనినోట పలకటం ప్రారంభిస్తుంది. ప్రసంగానికి

ఈ విషయంవల్ల ఒక సొగసు వస్తుంది. కాని రచనలో ఈ విషయమే పొంతనను కోల్పోతుంది. ఒక ప్రసంగాన్ని రచనారూపంలోకి తీసుకువస్తే దానిని చదివేటప్పుడు పఠిత తప్పనిసరిగా అందులో ఒక విధమైన పొందికలేమిని గ్రహిస్తాడు. పఠిత అసలు ప్రసంగం యొక్క పరిస్థితులకూ పరిసరాలకూ ఎంతగా దూరమౌతాడో అంతగా ఈ అనుభూతి కూడా అధికం అవుతూ పోతుంది. అరబ్బీ ఖురాన్‌లో కూడా పొందికలేమి ఉన్నది అని అజ్ఞులు అనటానికి అసలు కారణం ఇదే. దానిని దూరం చేయటానికి వ్యాఖ్యాన వివరణల ద్వారా మూలంలోని పొందికను విస్పష్టం చెయ్యటం తప్ప మరొక మార్గం లేదు. ఎందుకంటే ఖురాను యొక్క మూలరచనలో హెచ్చుతగ్గులు చేయటం నిషిద్ధం. కాని మరొక భాషలోకి ఖురానును భావానువాదం చేస్తున్నప్పుడు ప్రసంగ భాషను జాగ్రత్తగా రచనా భాషలోకి మార్చుకుంటే ఈ పొందికలేమి చాలా తేలికగా తొలగిపోతుంది.''

పై ఉట్టంకింపులో ప్రసంగ భాష, రచనాభాష అంటే ఈనాటి భాషా శాస్త్రవేత్తలు వాడే మౌఖిక, లిఖిత భాషలు (Spoken and Written Languages).

ఈ సుదీర్ఘ ప్రస్తావలోని ముఖ్యవిషయాలు ఇవి.

1. (a) ప్రసంగ భాషలో పాత్ర వ్యత్యయం (role change) ఉంటుంది.
   (b) స్వర సహాయం (intonation) ఉంటుంది.
   (c) సందర్భం ప్రత్యక్షంగా ఉంటుంది.
2. యథాతథానువాదం (literal translation) చేసే రచనా భాషలో పొందిక లేమితనం కనిపిస్తుంది.
3. అందువల్ల విషయం తగ్గించకుండా వ్యాఖ్యాన సహాయంతో రచనా భాషలోకి పరివర్తించుకుంటూ పొందిక లేమిని(incoherence) సవరించుకోవాలి.
4. కనుక శబ్దానువాదం (literal translation) కన్నా భావానువాదం ప్రయోజనకరం.

ఇదే పీఠికలో కుఫ్ అనే అరబ్బీ మాటకు ఒకే నిఘంట్వర్థం కుదరదనీ ఆ సందర్భాన్ని బట్టి అర్థం అన్వయించుకోవాలని కూడా సూచించారు. ఇంతకు ముందుదహరించిన dry country, dry wine శబ్దాల్లో dry అనే మాటకు సందర్భాన్ని బట్టి వచ్చే అర్థభేదాల్లాంటిదే ఇది. గ్రంథ భేదాన్ని బట్టి, ఉద్దేశించిన ప్రయోజనాన్ని బట్టి అనువాద విధానం ఎట్లా ఉండాలో ఖురాన్ అనువాద విధాన చర్చ ద్వారా తెలుస్తున్నది.

ఇక్కడ ఇంకో విషయం గుర్తించదగినది ఉంది. ఖురాన్‌లో అసలు విషయాన్ని

అనువాదంలో పెంచనూకూడదు, తుంచనూ కూడదు. అసలు విషయ సారాంశం మార్చకూడదు. బహుశా బైబిలు అనువాదానికి కూడా అట్లాంటి నిబంధనే ఉండవచ్చు. సంస్కృత గ్రంథాలకు అట్లాంటి నియమం ఉన్నట్టులేదు. పెంచి, తుంచి, అవసరమైనంత మార్చి అనువదించటం భారత భాషల పద్ధతిలాగుంది.

మూల గ్రంథ విషయాన్ని బట్టి అనువాదంలో శైలి ఉంటుంది. శాస్త్ర గ్రంథానువాదంలో వస్తు నిర్దిష్టత అవసరం. సాహిత్య గ్రంథాల్లో వస్తు నిర్దిష్టతను శైలికోసం కొంతైనా త్యాగం చెయ్యాల్సి ఉంటుంది.

ఉద్దేశించిన పాఠకులను బట్టి శాస్త్ర గ్రంథాలలో రచనా భేదాలు ఉంటాయి. సామాన్య పాఠకుల కోసం అనువదించేటప్పుడు పరిభాష తగ్గుతుంది. శాస్త్ర సంక్షిప్తత (precision) ను త్యాగం చెయ్యాల్సి ఉంటుంది. బహుశా కొంతలో కొంత వస్తు నిర్దిష్టత కూడా త్యాగం చెయ్యాల్సి రావచ్చు. దృష్టాంతాలు పెరుగుతాయి. చాలా విషయాలలో సంక్షిప్తతను త్యాగం చేసుకుంటూ ఎక్కువ వివరణలు ఇచ్చుకుంటూ పోవాలి. ఆ శాస్త్రంలో చిరకాలం నుంచి కృషి చేసేవారికి ఉద్దేశిస్తే రచన బిగువుగా ఉంటుంది. బహుశా రచన వాద ప్రతివాదన రూపంలో ఉండవచ్చు. వివరణలు ఎక్కువ ఇచ్చే అవసరం లేనందువల్ల సంక్షిప్తత దెబ్బతినదు. శాస్త్ర గ్రంథానువాదంలో పరిభాషా క్లిష్టత తప్ప ఇతరమైన భాషాక్లేశం ఉండదు. సాహిత్యానువాదంలో భాష, శైలి ముఖ్యం. కవిత్వంలో మాటల కుదింపులు, ఊహల విస్తరింపులు, ఉద్దిష్ట బహుళార్థకతలు, భావ సౌందర్యం కోసం వాడే జాతీయాల వంటి స్థిరీకృత (crystalized) పద సంయోజనలు, భావ సామ్య తీవ్రతా భేదాలను సూచించే పద ప్రయోగం, ఇంకా లయ, ఛందస్సు వంటి అనేకానేక సమస్యలున్నాయి. కవిత్వపుటూహాల్లో కొన్ని సర్వ జాతి, భాషా సమానమైనవి ఉండవచ్చు. కాని కొన్ని భాష సంస్కృతీ బద్ధాలుగా ఉంటాయి.

ఇటీవల కవిత్వంలో అయితే వ్యక్తి నిష్ఠమైన సంకేతాలు, ప్రతీకలు ఎక్కువ. విశ్వనాథ సత్యనారాయణ గారి కవిత్వంలో సంస్కృతీ బద్ధత ఎక్కువ. శ్రీశ్రీగారి కవిత్వంలో శబ్దచమత్కారాలు, లయ బద్ధత ఎక్కువ. వేగుంట మోహన్‌ప్రసాద్ కవిత్వంలో ఛందస్సుండదు కాని శబ్దానికి సంబంధించిన అన్ని గుణాలూ ఉంటాయి. పైగా వ్యక్తి నిష్ఠమైన సంకేతాలు, ప్రతీకలూ ఎక్కువ. ఇవన్నీ అనువాదంలో చిక్కుపెట్టే సమస్యలే. Medium is the message అనేమాట కవిత్వంలో ఎక్కువ నిజం.

ఇటీవలి కాలంలో తెలుగులో ప్రతి కవితా ఖండికనూ తేలిగ్గా ఫ్రీవర్సులో చేస్తున్నారు.

కవిత్వానికి లయ ఒక ప్రధానాంశం. ఒక మార్చింగు సాంగును తగిన పద్ధతిలో లయబద్ధంగా చెయ్యపోతే దాని ప్రయోజనమే దెబ్బ తింటుంది. కవిత్వానువాదంలో మూల భాషా సౌందర్యం చాలా వరకు పోయేమాట నిజమే కాని, ప్రయత్నిస్తే కొంత నిలుపుకోవచ్చు, మరికొంత పునస్సృజించుకోవచ్చు. కవిత్వాన్ని అనువదించటం కష్టమే. అయినా కవిత్వానువాదాలు శతాబ్దాలుగా వస్తూనే ఉన్నాయి. బహుశా రాఘవ పాండవీయం వంటి ద్వర్థి కావ్యాలు, వసుచరిత్ర వంటి శ్లేషకావ్యాలు లాంటివి ఇతర భాషల్లో సంపూర్ణానువాదానికి ఎప్పుడూ లొంగక పోవచ్చు.

అనువాద పద్ధతులను గురించి పరిమితులను గురించి ఎంతైనా చెప్పుకోవచ్చు. కాని ముగింపుగా ఒక విషయం మళ్ళా చెప్పాలి. అనువాదం ఒక సృజన వ్యాపారం. అనువాద శక్తిని భగవద్దత్తంగా భావించక తగిన శిక్షణను పొంది అనుభవం సంపాయిస్తే మంచి అనువాదాలు వస్తాయి.

(తెలుగు విశ్వవిద్యాలయం అంతర్జాతీయ కేంద్రం 1996 జూన్ 10న
ఏర్పాటు చేసిన అనువాద చర్చా గోష్ఠిలో చేసిన ప్రధాన ప్రసంగ పాఠం)

# భాషా, సాహిత్యాల తాత్త్విక భూమిక

It is a somewhat paradoxical fact, that the conceptual systems that give man an understanding of himself and his world are themselves not adequately understood by him.

Jerrold J.Katz "The philosophy of Language." -1965

''తన్ను తాను, చుట్టూ ఉన్న ప్రపంచాన్నీ అర్థం చేసుకోవటానికి ఏర్పరచుకున్న భావనా వ్యవస్థలే మనిషికి పూర్తిగా అర్థం కాలేదు. ఇదో వైరుధ్యం''.

భాషా సాహిత్యాలు ప్రస్తుత ప్రసంగ ప్రసక్త విషయాలు మనిషి నివసిస్తున్న ప్రపంచంలో మనిషి ఏర్పరచుకున్న వ్యవస్థలు, భాషా, సాహిత్యాలు. యుగయుగాలుగా వివిధ భాషా సమాజాల్లో మేధావులు భాషా సాహిత్యాలను నిర్వచిస్తూ వచ్చారు. ఏ ఒక్క నిర్వచనమూ సమగ్రం కాదు. ఏ నిర్వచనమైనా సత్యానికి ఆమడ దూరంలోనే ఉంటుంది.

పాఠ్యపుస్తకాల్లోనూ, శాస్త్ర గ్రంథాల్లోనూ భాషను చాలామంది నిర్వచించారు. ఒకప్పుడు విశాలాంధ్ర వారు అచ్చు వేసిన ఒక రష్యన్ అనువాద భాషా శాస్త్ర పాఠ్య గ్రంథంలో 'Berezin' అనే ఆయన చాలా నిర్వచనాలిచ్చి 'V.I.Lenin' నిర్వచనాన్ని ప్రత్యేకంగా సమర్థించాడు. ఇంతకీ లెనిన్ నిర్వచనం ఏమిటంటే "Language is the most important means of human communication." ''మానవుల భావ ప్రకటనల సాధనాల్లో భాష అత్యంత ముఖ్యమైనది''.

దీన్ని గురించి ఎక్కువ మాట్లాడనక్కర్లేదు. ఎందుకంటే ఈ నిర్వచనం భాషను గురించి చెప్పింది ఏమీ లేదు. ఏమీ చెప్పకపోవటం లెనిన్ దోషం కాదు. లెనిన్ విప్లవకారుడు ప్రపంచ చరిత్రను ఒక మలుపు తిప్పిన మహానాయకుడు. అంతమాత్రాన ఆయనకు ప్రపంచంలో అన్నీ తెలిసి ఉంటాయనుకోవటం మన అజ్ఞానం.

భాషకు చాలా నిర్వచనాలు దొరుకుతున్నాయి. వాటి నిర్వచనాలన్నీ ఇక్కడ ఏకరువు పెట్టను. అట్లాగే సాహిత్య నిర్వచనాలు. అలంకార శాస్త్ర గ్రంథాలలో దండిగానే దొరుకుతాయి. వాటిని కూడ ఇక్కడ పేర్చి పెట్టదల్చుకోలేదు.

నిర్వచనాల జోలికి పోకుండా భాషా సాహిత్య మౌలిక తత్త్వాలను అర్థం చేసుకునే ప్రయత్నమే ఇవాళటి నా ప్రసంగ ధ్యేయం.

ఒక విషయాన్ని అర్థం చేసుకోవటానికి నిజానికి నిర్వచనాలు అక్కర్లేదు. నిర్వచనాలు తాను చెప్పే విషయానికి మార్గదర్శకాలే కాని సమగ్ర స్వరూప దర్శకాలు కావు. అయితే నిర్వచనాల్లేకుండా భాసా సాహిత్యాలను అర్థం చేసుకోవడం ఎట్లా? భాషా సాహిత్య లక్షణాలను, పరిశీలించటం ఒక మార్గం. మానవ సమాజంలో వాటి ప్రయోజనాన్ని గుర్తించడం ఇంకో పద్ధతి. ఇవి లేకపోతే మానవ సమాజం ఏమయ్యేది? అని ఆలోచించటం మరో పద్ధతి. ఈ చెప్పినవి కాక ఇంకా చాలా పద్ధతులున్నాయి. ఈ పద్ధతులన్నీటినీ క్రమ బద్ధంగా పరిశీలిస్తానని వాగ్దానం చెయ్యలేను. జ్ఞానం అఖండమనీ తద్గ్రహణ పద్ధతుల మధ్య స్పష్టమైన విభాజకరేఖ ఉండదనీ నా మతం. చాలమంది తమ పరిశోధనలో విషయ విభాగమూ అంశా విభాగమూ చాలా స్పష్టంగా సంఖ్యలతో సూచిస్తారు. నేనూ అట్లాంటి ప్రయత్నాలు చేసినా అవి నా కెప్పుడూ సంతృప్తి కలిగించలేదు. తొలి తొలి రోజుల్లో అట్లాంటి విభాగాలు చేశాను. రానురాను వాటిని తగ్గించాను.

భాషా లక్షణాలను ఇతర జంతువుల భావ ప్రకటన సాధనాలతో పోల్చి చూస్తే కొన్ని ప్రధానమైన భేదాలు కన్పిస్తాయి. అందులో స్థల, కాల, దూరీకరణ (Displacement) చాలా ప్రధానమైనది. మానవులు మాట్లాడుకునే విషయాలు వర్తమాన దేశకాలాలకు పరిమితం కానక్కరలేదు అని దీని అర్థం. ఈ లక్షణం వల్ల భాషకు అపరిమితమైన వైశాల్యం వచ్చింది. ప్రపంచంలో ఆ మాటకొస్తే ఆ ప్రపంచం వాస్తవ ప్రపంచం కూడా కాకపోవచ్చు. ప్రపంచంలో ఏ విషయాన్ని గురించి అయినా మాట్లాడుకోవడానికి ఈ లక్షణం అవకాశం ఇస్తుంది. మాట్లాడేది నిజమూ కావచ్చు. అబద్ధమూ కావచ్చు. కల్పనకావచ్చు, వాస్తవమూ కావచ్చు. ఈ లక్షణం వలన భాషలో వ్యతిరేకాంశాలు చెప్పటానికి వీలవుతుంది. ఉదాహరణకు 'మా ఇంట్లో బియ్యం లేవు.' అనే వాక్యం లేని విషయాన్ని చెప్తుంది. - జంతువుల అరుపులు ప్రత్యక్ష విషయాలనే ప్రస్తావించగలవు.

ఆదిమ జాతుల భాషలతో సహా ప్రపంచ భాషలన్నింటిలోనూ కథలూ, కవిత్వం వంటివి ఉన్నాయి. దీన్నే సాహిత్యం అందాం. సాహిత్యం అంటే ఏమిటి అన్న విషయం తర్వాత మాట్లాడుకోవచ్చు. ప్రపంచ భాషలన్నిటిలోనూ సాహిత్యం ఉంది. ఈ సాహిత్యానికి అవకాశం కల్గించింది ఈ లక్షణమే. నిజం నిజం లాగానే చెప్తే సాహిత్యం కాదు. చాలా సమాజాల్లో సాహిత్యాన్ని పరిశీలిస్తే అవి కల్పనలుగా గ్రహించగలం. వాస్తవేతరం గురించి మాట్లాడుకోగలగడం మనిషికి చాలా ఉపయోగించిన విద్య. మానవ సంస్కృతీ వికాసం అంతా కూడా ఈ విద్య మీదనే ఆధారపడి ఉంది. సాహిత్యమూ, తత్త్వశాస్త్రమూ, సైన్సూ ఇంతవరకూ సాధించిన, ఇక ముందు సాధించబోయే మానవ విజ్ఞానం అంతా

ఈ లక్షణం మీదనే ఆధారపడి ఉంది. మానవ భాషలోనే కవిత్వం ఉంది. కథలున్నాయి. మానవులే ఈ ప్రపంచ మూలాలను గురించి జీవిత లక్ష్యాలను గురించి, గమ్యాలను గురించి నీతి, అవినీతి అనే విలువల గురించి చర్చించుకోగల్గుతారు. అంతేకాక తమ చుట్టూ ఉన్న ప్రపంచాన్ని అర్థం చేసుకోవటం కోసం సిద్ధాంత ప్రతిపాదనలు చేస్తారు. వీటినే ఇంగ్లీషులో hypothesis అంటారు. విజ్ఞాన శాస్త్రాల్లో ఒక అంశం నిర్మాణాన్ని గురించి లేక ప్రవర్తనను గురించి చేసే పరికల్పనే hypothesis. ఈ రకమైన పరికల్పనలు తరచుగా మారుతుంటాయి. నిజం ఏదో తెలియకపోయినా నిజమేమోనని ఊహించి చేసే ప్రతిపాదనలు ఇవి. ఈ ప్రతిపాదనలకు ఉపపత్తులు కూర్చుకోవటం లోనూ లేక వీటిని సవరించుకోవటంలోనూ లేక పనికిరావని తోసివేయడంలోనూ విజ్ఞానశాస్త్రాల అభివృద్ధి ఆధారపడి ఉంది. ఈ కాల్పనిక శక్తి ఒక రకంగా అబద్ధమాడే శక్తి అనిగానీ, మోసగించే శక్తి అని గానీ అనుకోవచ్చు.

పరిణామంలోకి తొంగిచూస్తే మామూలు కోతులకు అంత లేదు గానీ Baboons, great apes అనే primate జాతులకు భాష లేకపోయినా ఈ మోసగించే శక్తి ఉన్నట్లు తెలుస్తుంది. బహుశా ఈ శక్తి మనకు వారసత్వంగా వచ్చింది కావచ్చు. అది భాషలో ఒక లక్షణంగా స్థిరపడి ఉండవచ్చు. మోసగించే శక్తి అంటే భయపడక్కర లేదు. ఉదాహరణకు చిన్న బిడ్డ తల్లి దృష్టి తన వైపు మరల్చుకోడానికి దొంగేడుపు ఏడవడం ఈ కోవ కిందికే వస్తుంది. అట్లాగే స్కూలుకు వెళ్ళే చిన్నపిల్లలు చిన్న చిన్న అబద్ధాలు ఆడటం మనం గమనిస్తాం. ఈ శక్తే రకరకాల పిల్లల ఆటల్లో కూడా కనిపిస్తుంది. దాగుడుమూతలు అట్లాంటిదే. ఈ శక్తి వల్ల మనుషులు ఒకరితో ఒకరు వ్యవహారం నడుపుకోవటం ఆటపాటలలో ఆనందంగా కాలం గడపుకోవటం అనేవి సాధ్యమైనవి. ఈ రకపు మోసగించే శక్తి చింపాంజీలకు, Baboons కు ఎక్కువ ఉండటానికి కారణం అవి చెట్లమీద ఎక్కువ ఆధారపడకుండా ఉండటం, అని కొంతమంది పరిశోధకులు అభిప్రాయపడ్డారు. సంఘజీవితానికి, చెట్లకు దూరం కావటానికి దగ్గర సంబంధం ఉన్నట్లుంది. బహిరంగ మైదానాలలో తిరిగేటప్పుడు ఎక్కువ రక్షణ అవసరం కనుక ఎక్కువ సంఘ జీవితం కూడా ఏర్పడి ఉండవచ్చు.

మోసగించటం అంటే అవతలివారి ఆలోచనలను గుర్తించి ప్రవర్తించటం. ఇతరుల ఆలోచనలకు గ్రహించడం అంటే ఇతరులకు కూడా ఆలోచించే శక్తి ఉంది అని గుర్తించడం. బహుశా ఈ రకమైన మోసగించే శక్తి అవసరాన్ని బట్టి వచ్చి ఉంటుంది. ఈ

అవసరమే primates లో మెదడు పరిమాణం పెరగడానికి ప్రేరకం అయి ఉంటుంది. ఈ పెరిగిన మెదడు మనుషుల్లో మనిషి సాంఘిక జీవితానికి అనుగుణంగా మోసగించడానికి అత్యంతం అనువైన భాషను కనిపెట్టడానికి వీలయి ఉంటుంది. ఇక్కడ ఒక విషయం గుర్తించాల్సి ఉంది. మన సన్నిహిత సహోదరులైన వానరజాతులు ఈ శక్తిని తమ భౌతికావసరాలకు మరీ ముఖ్యంగా స్వార్థానికి వాడుకొని ఉంటాయి. పెరిగిన మనిషి మెదడు స్వార్థ, నిస్వార్థ ప్రయోజనాలకు రెంటికీ ఉపయోగపడుతుంది. భాషలో ఈ లక్షణం స్థలకాల పరిమితి లేకుండా ఏ విషయాన్ని మాట్లాడుకోవడానికైనా వీలు కల్పించింది. మానవ సంస్కృతిలో కన్పించే సర్వ అభివృద్ధికర అంశాలకు ఈ లక్షణం మూలంగా కన్పిస్తుంది.

మానవజాతి పరిణామ క్రమంలో సాధించిన అనేక అభివృద్ధికర అంశాలకు మేలు కీళ్ళు రెండూ ఉన్నాయి. వాటిని మంచికి ఉపయోగించుకోవడం. చెడ్డకు ఉపయోగించుకోవడం అనేది విలువ గుర్తింపును బట్టి ఉంటుంది. ఈ రెండూ బహుశా విడదీయలేని అంశాలు కావచ్చు. అయితే తత్త్వవేత్తలు, శాస్త్రజ్ఞులు ఎప్పుడూ వీటిని వేరు చేయటానికి చిరకాలం నుంచీ ప్రయత్నిస్తూనే ఉన్నారు. జయాపజయాలు రెండూ సమతూకంగా సాధిస్తూనే ఉన్నారు.

భాషకున్న మరో లక్షణం పరిమితి రాహిత్యం. దీన్నే కొందరు openness అనీ మరి కొందరు infinity అనీ అన్నారు. దీనికి స్థల కాలదూరీకరణానికి displacement సంబంధం ఉంది. భాషలో చెప్పే విషయాలకు, భాషలో వాక్యాల సంఖ్యకూ పరిమితి లేదు. మానవులు ఏ విషయాన్ని గురించి అయినా మాట్లాడుకోగలుగుతారు. నాగరికత, విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ మాట్లాడే విషయాలు సంఖ్యా పెరుగుతుంది. ఏ భాషలో అయినా పదాలను లెక్కపెట్టగలం కానీ, వాక్యాలను లెక్కపెట్టలేం మనుష్యులు పాత వాక్యాలను జ్ఞాపకం ఉంచుకొని మాట్లాడరు. కొత్త వాక్యాలను సందర్భోచితంగా సృజించుకొని మాట్లాడతారు. ఇట్లాంటి శక్తిని Noam chomsky గారు సృజన శక్తి (creativity) అన్నారు. ఇది భాషా వ్యవహర్త నిర్మించుకున్న మనో వ్యాకరణం వల్ల సాధ్యమయింది. మానవులు చాలా చిన్నతనంలోనే మనో వ్యాకరణాన్ని నిర్మించుకుంటారనే విషయంమీద చాలా పరిశోధన జరిగింది. భాషా శాస్త్రజ్ఞులు, మనస్తత్వ శాస్త్రజ్ఞులు తమ పరిశోధనల్లో ఈ విషయాన్ని విరివిగానే చర్చించారు గనుక ఈ విషయాన్ని ఇంతకన్నా ఎక్కువ విస్తరించను.

అయితే ఈ వ్యాకరణ నిర్మాణ దక్షిత ఎట్లా వచ్చింది. అనే విషయం చర్చనీయం.

ఇది మనిషికి పుట్టుకతోనే వచ్చింది. అని ఒప్పుకొంటారు. అయితే పుట్టుకతో ఎంత వచ్చింది? నేర్చుకున్నది ఎంత అనే విషయం చెప్పటం కష్టం ! కొందరు శాస్త్రవేత్తలు predisposition అన్నారు. అంటే మానవ మేధ. భాషను నేర్చుకోవటానికి సిద్ధంగా తయారయి ఉంది అని. దీన్ని అందరూ అంగీకరిస్తారు. అయితే Noam chomsky మాత్రం మనిషి విశ్వవ్యాకరణంతో పుడతాడని ఆ విశ్వ వ్యాకరణం ప్రత్యేక భాషా వ్యాకరణాన్ని నిర్ణయిస్తుందని ప్రతిపాదించాడు. దీనికి ఋజువు లేమీ లేవు. ఉండవు కూడా. మనిషి తలబద్దలు కొట్టి చూస్తే అక్కడ ఏ వ్యాకరణమూ కనిపించదు. మానవుల భాషా వ్యవహారాన్ని సర్వభాషా సామ్య భేదాల్ని పరిశీలించి చేసిన శాస్త్ర పరికల్పన (hypothesis) మాత్రమే.

ఈ సిద్ధాంతానికి తత్త్వవేత్తలు ప్రతిపాదించిన జ్ఞాన సిద్ధాంతాలకు (epistemological theories) కీ సంబంధం ఉంది. అనుభవ వాదం (empiricism) హేతువాదం (rationalism) అనే రెండు పాశ్చాత్య జ్ఞాన సిద్ధాంతాలున్నాయి. మనిషి పుట్టినప్పుడు ఏ జ్ఞానమూ ఉండదనీ అనుభవం ద్వారా మాత్రమే జ్ఞాన సంపాదన జరగుతుందనీ అనుభవ వాదం చెపుతుంది. మనిషీ పుట్టేటపుడే జ్ఞానం ఉంటుందనీ (దీన్నే innate ideas అంటారు). అనుభవంతో జత కలిసినప్పుడు అది వ్యక్త రూపం దాలుస్తుందనీ హేతువాదం చెపుతుంది. హేతువాదం అంటే మనం ఇప్పుడునుకునే నాస్తిక హేతువాదం కాదు. మనిషికి హేతుబద్ధమైన జీవి కావటానికి ఉపయోగించే పద్ధతులు పుట్టుకతోనే వస్తాయనే హేతువాదం ఇది. జంతువులన్నీ యాంత్రికంగా జీవిస్తాయని, మనిషి హేతుబద్ధంగా ప్రవర్తిస్తాడని. ఈ శక్తి పుట్టుకతోనే వస్తుందనేది ఈ హేతువాదం.

బహుశా సత్యం ఈ రెండు వాదాల మధ్య ఎక్కడో ఉంది. సర్వజ్ఞానం పుట్టుకతోనే మనిషికి దత్తం అనే దానికి ఎక్కడా ఆధారం లేదు. అట్లాగే మనిషి మెదడు మొదట ఏజ్ఞానం లేని మొద్దుబల్ల (tabula rasa-clean slate) అనటం కూడా కుదరదు. జ్ఞానం అంతా ముందే ఉంటే మానవకృషికి అర్థమే లేదు. మనిషి పుట్టుకతో మొద్దురాచ్చిప్పలాగే పుడితే మిగతా జంతువుల లాగే ఉండేవాడు. మనుషులు కొంత జ్ఞానంతో కనీసం జ్ఞాన సంపాదక సమర్థక మేధతో పుడతారనీ జ్ఞాన సంపాదన అనుభవం ద్వారా, అన్వేషణ ద్వారా చేస్తారనీ ఒప్పుకోవటానిక అభ్యంతరం ఉండక్కర్లేదు. తత్త్వశాస్త్రంలో ఉన్న ఈ ప్రతి పాదనలకు భాషా శాస్త్రం మళ్లీ చర్చలోకి తెచ్చింది. భాషా లక్షణాలను చర్చిస్తూ తత్త్వశాస్త్రంలోకి కొంచెం ఎక్కువ పోయాం. అయితే

భాషా లక్షణ వివేచనకు, తత్త్వశాస్త్ర ప్రతిపాదనలకు ఉన్న సంబంధం కొంతైనా ప్రదర్శించాలన్న ఉద్దేశంలో ఈ ప్రతిపాదలను స్పృశించాను.

భాషకు అర్థ వత్తత. అర్థహీనత అనే రెండు లక్షణాలూ ఉన్నాయి. అర్థవత్తతను అర్థం చేసుకోటం తేలికే. భావ ప్రకటన సమాచార వినిమయం అనేవి భాషకు ప్రధాన ప్రయోజనాలని అందరూ ఎరిగిందే ఏదో సమాచారం అందించటం కోసం మనం మాట్లాడతాం. అది మన జీవితావసరం. మన అవసరాలను ఇతరులకు చెప్పటం, ఇతరుల అవసరాలను మనం గుర్తించటం. సాంఘిక జీవనంలో భాగం. ఇట్లాంటి అవసరాలు లేని భాషావ్యవహారం కూడా ఉంది. ఇద్దరు మనుషులు కలిసినప్పుడు ఏవేవో పనికిమాలిన మాటలు మాట్లాడుకొనే అలవాటు మనుషులకుంది. ఇది సంఘజీవనంలో భాగం. ఉదాహరణకు పాశ్చాత్యులు అవతలివారిని పలకరించడానికి It's a nice day ? అని isnt it అంటారు. మధ్య వయస్కులైన అమెరికను ఆడవాళ్లు ఇంకాస్త ఉత్సాహంగా It's a gorgeous day Don't you feel it ? అని కూడా అనగలరు. మన సంస్కృతిలో గ్రామాల్లో బయటి నుంచి వచ్చిన వారిని పలకరిస్తూ ఆరోగ్యం గురించి అడుగుతాం. ఫలానా, ఫలానా వారు బాగున్నారా? పాడి అవుతుందా? పంటలు బాగున్నాయా? వర్షాలు కురుస్తున్నాయా? అని వాటిని గురించి అడుగుతాం.

మానవ ప్రవర్తనలోనే అవసరానికి మించిన ప్రవర్తన ఉంటుంది. దీనికి ప్రత్యేకమైన ఉదాహరణలు అక్కర్లేదు. మన శాసన సభల్లో, పార్లమెంటులో, రాజకీయోపన్యాసాల్లో ఎక్కువ భాగం అవసర ప్రసంగాలే. అసందర్భ ప్రలాపాలే. అయితే ఇక్కడి విశేష మేమిటంటే ఇది భాషా ప్రయోజనంలో ఒక భాగమే. చాలా మంది ఉద్యోగులు క్యాంటీన్లలోనూ, విద్యార్థులు రాత్రిళ్లు ఇరానీ హోటళ్లలోనూ చేసే బాతాఖానీ ఈ ప్రయోజనాల్లో భాగమే అంటే అర్థవంతమైన ప్రయోజనకరమైన సమాచార ప్రసారంతో పాటు కేవలం నిరర్థకమైన భాషా వ్యవహారానికి కూడా సాంఘిక ప్రయోజనం ఉంది. అదే లేకపోతే సమాచార ప్రసారం ఒక్కటే ప్రయోజనం అయితే మనం చాలాకాలం మౌనంగా ఉండాల్సి వచ్చేది.

భాషా లక్షణాలను గురించి ఇంకా చాలా విషయాలు చర్చించవచ్చు ఉదాహరణకు భాషలో భాషను గురించి మాట్లాడే అవకాశం ఉంది. దీన్ని C.F. Hockett గారు Reflexivity అన్నారు. దీన్ని communication about communication అన్నారు.

వ్యాకరణ రచన. భాషాశాస్త్రం ఈ లక్షణం వల్ల వచ్చిన సౌకర్యాలు మానవ భాషలన్నిట్లోనో కనిపించే ప్రత్యక్ష పరోక్ష అనుకరణ వాక్య విధానం ఇందులో ఒక భాగం. ఈ అనుకరణ విధానం మానవ భాషలకు చేసిన ఉపకారం గురించి చాలా విషయాలు మాట్లాడుకోవచ్చు. Voroshilov అనే రష్యన్ శాస్త్రవేత్త చాలా అమూల్యమైన విషయాలు చెప్పాడు. ఇంకా భాషను గురించి చెప్పాల్సిన విషయాలు చాలా ఉన్నాయి. కనుక ప్రస్తుతానికి ఈ విషయాలు వదిలేస్తాను.

భాష సమాచార ప్రసారం కోసం వచ్చిందన్నాం కాని భాష శక్తికీ ఒక పరిమితి ఉంది. ప్రపంచ spatial relations ను భాష సరిగా చెప్పలేదు. ఒక స్థలావకాశంలో ఉన్న వస్తువుల సంబంధాలను positions ను బొమ్మలో చెప్పినంత స్పష్టంగా భాషలో చెప్పలేం. అట్లాగే అనేక రకాల బాధలను, emotions ను భాషలో స్పష్టంగా చెప్పలేము. ఈ పరిమితులెన్ని ఉన్నా మానవుల భావ ప్రకటన సాధనాల్లో భాష అత్యంత క్లిష్టమైనది, ఉత్తమమైనది, ప్రయోజనకరమైనది.

జీవపరిణామ సిద్ధాంతం గురించి ఇక్కడి శ్రోతలకు నేను ప్రత్యేకంగా వివరించాల్సిన పని లేదు.

మనం, మన చుట్టాలయిన వానర జాతులన్నిటినీ కలిపి ప్రైమేట్ ఆర్డర్ (Primate order) అంటాం. అందులో మనుషులది హోమినిడ్ కుటుంబం(Family). ఆ కుటుంబం నుంచి నిష్పన్నమైన జీనస్ హోమో అనే జాతి. ఆ జీనస్ నుంచి ఉద్భవించిన జాతి(species)ని హోమోసేపియన్స్ (homo Sapiens) అంటారు. ప్రైమేట్ దశలో వానర జాతులన్నీ సహోదరులే. హోమినిడ్ దశలో గొరిల్లాలు, చింపాంజీలు మనకు దగ్గరి వాళ్లు. హోమో అనే పేరుతో దిగుబడి అయిన జీవి (జీవులు) మానవజాతి పరిణామంలో భాగం.

ఈ మానవ జీవ పరిమాణంలో కొన్ని దొరకని లింకులున్నా ఈ పద్ధతి చిత్రణలో పెద్దగా అభిప్రాయ భేదాలు లేవు అయితే భాష ఎక్కడ ఏ దశలో ఆరంభం అయిందో చెప్పడానికి ఆధారాల్లేవు.

1. comparative method and reconstruction ద్వారా ఏ భాషా చరిత్రలోనైనా 6వేల సంవత్సరాల వెనక్కి పోగలం.

2. 3.5 మిలియన్ల సంవత్సరాల కింద అస్ట్రేలియా హితికస్ మనలాగే నిలబడినారు.
3. ద్విపాద గమనానికంటే ముందు భాష వచ్చి ఉండదు.
4. హోమోసేపియన్సు, నియాండర్తల్ man 10 మిలియన్ల సంవత్సరాల కింద 1400 c.c ల బరువు గల మెదడుతో అవతరించాడు.

కవిత్వాన్ని గురించి కొన్ని స్థూల విషయాలు స్పష్టత కోసం చెప్పుకోవచ్చు. కవిత్వం భాషా రూపంలోనే ఉంటుంది. భాష నుంచి కవిత్వాన్ని విడదీయలేము. భాష నుంచి కవిత్వాన్ని వేరు చేయలేమంటే కవితా సృజనా, వినియోగం మనుషులు మాత్రమే చేస్తారని కూడా అర్థం. మనుషులు మాత్రం భాషను వాడతారు. బహుశా కళాసృజన, గుర్తింపు, వాడకం కూడా మానవజాతికే ప్రకృతి దత్తమైన వరాలు కావచ్చు.

సమాచార నివేదనం కవిత్వానికి తప్పనిసరి లక్షణం కాదు. సమాచారం కోసం కవిత్వాన్ని వినరు, చదవరు సమాచారం చెప్పేతీరులో కవిత్వం ఉంటుంది. (కవిత్వం అంటే సాహిత్యం అనే విశాలార్థంలో వాడుతున్నాను.) అందుకే ఒక శాస్త్రవేత్త పునః కథనాసక్తి. పునః పునః శ్రవణాసక్తి అనే వాటని సాహిత్య లక్షణాలుగా నిర్దేశించారు. అయితే లిఖిత ముద్రణ సార్యాలు వచ్చిన తరువాత ఆ లక్షణాలను కొంచెం మార్చుకోవాలనుకోండి. అది వేరే విషయం.

కవిత్వం భాషారూపంలో ఉంటుందన్నాం. అంటే మాట్లాట్టంలో లాగే కవిత్వంలో కూడా భాషా ప్రయోగం ఉంటుందన్న మాట. సాధారణ వ్యవహారాన్ని కవిత్వ వ్యవహారాన్ని భాషా దృష్టితో వేరు చెయ్యటం ఎట్లా?

సాధారణ భాష వ్యవహారంలో మనం అన్నదేమిటో గుర్తుపెట్టుకోం. ఉదయం లేచిందగ్గర్నుంచీ ఇప్పటివరకు ఏమేం అన్నామో కాగితం మీద పెట్టడానికి ప్రయత్నించండి. చాలా మర్చిపోతాం. గుర్తు వచ్చినా సారాంశం గుర్తుంటుంది కాని అన్నది అన్నట్టుగా గుర్తుండదు. అయితే అన్న వాటిలో కొన్ని యధాతధంగా, పోనీ దాదాపు యధాతధంగా గుర్తుంటాయి. విషయ ప్రాధాన్యం కొంత కారణం కావచ్చు కాని, మనం ఆ వాక్యాన్ని అన్న తీరు గుర్తుపెట్టుకోటానికి ప్రధాన కారణం రొటీన్ విషయాలు గుర్తుపెట్టుకో అక్కర్లేదు. అందుకనే మనం చాలా సార్లు పొద్దున్నే కాఫీ తాగామో లేదో మర్చిపోతుంటాం. కాఫీ తాగటానికి ముందూ వెనకా ఏం మాట్లాడామో మర్చిపోతాం. గుర్తుపెట్టుకోవలసిన

విషయం అయినప్పుడు దాన్ని ఒక పద్ధతిలో అని గుర్తు పెట్టుకుంటాం. ఆ పద్ధతి సాధారణ భాషా ప్రయోగ పద్ధతి కన్నా ఏదో విషయంలో భేదించవచ్చు. అట్లా భేదించిన ఒక పద్ధతిని పద్యం అంటాం. పద్యం అంటే సంస్కృత వృత్తమనీ కాక. సూర్యేంద్ర గణాల కూడిక అని కాక లయబద్ధమైన భాషా ప్రయోగం అనే అర్థంలో వాడుతున్నాను. పద్యం, పాట, గేయం, అనే అన్నిటినీ కలిపి కాసేపు పద్యం అందాం. ఇంగ్లీషులో Verse అనే మాటకు సమంగా అన్న మాట.

పద్యం మౌఖికంగా ఉన్నప్పుడు లయబద్ధంగా ఉంటుంది. లయను గురించి కూడా ఒక్క వాక్యంలో చెప్పటం కష్టం. సమతూకంగా ఉన్నయ్యనుకున్న ధ్వనుల సంపుటుల ఆవృతి వల్ల లయ ఏర్పడుతుంది. Lord అనే ఆయన వీటిని breath groups అన్నాడు. దానికి వెల్చేరు నారాయణరావుగారు తెలుగులో ధ్వని సంపుటులు అన్నారు. ఇంగ్లీషు మాటను బట్టి ఊపిరి తీసుకోవటానికి భాషాలయ ఏర్పడటానికీ దగ్గరి సంబంధం ఉందన్న మాట. ఈ ధ్వని సంపుటుల మధ్య విరామం కన్నా పెద్ద విరామం ఉంటే అది పాదం అయింది.

అందుకే పద్యాల్లో పాద విభజన ఒక ప్రధాన అంశంగా కనిపిస్తుంది.

ఏటుకూరి బలరామమూర్తి గారి స్మారకంగా 1998 సెప్టెంబర్ 21నాడు
నాడు విజయవాడ విశాలాంధ్ర ప్రెస్సులో చేసిన ప్రసంగ పాఠం